

"పత్రం పూజయామి"

ఫొటో: జి. జి. కె. మూర్తి—గుంటూరు.

| సంవత్సర చందా |
| --- |
| రు. 12-0-0 |
| విడిప్రతిక 4 అ. |

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

| సంపుటము 49 |
| --- |
| సంచిక 3 |
| **21.9-55** |

మన్మథ నిజ భాద్రపద శుద్ధ పంచమి బుధవారం



"తుండము, నేక దంతమును, తోరపు
బొజ్జయు, వామహస్తమున్......"
ఫొటో: ఎస్. రామకృష్ణ—మామువరం.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : "అదిల్ - ఏ - జహాంగీర్" లో మీనా కుమారి.




ప్రవేశం ఉచితం!

ఇప్పుడే పాల్గొనండి గొప్ప డాల్డా పోటీలో

ముగింపుతేదీ : 30వ సెప్టెంబర్ 1955

రు. 25002 గెలువండి!

(మరియు ఇంకొక రు. 20,001లు, ధర్మార్థం యివ్వబడును)

మొదటి బహుమతి
రు. 20,001లు*
రెండవ బహుమతి
రు. 5,001లు




* మొదటి బహుమతిని గెలు పొందినవారు ఒక్కరుగాని లేక అందరూ కలిసిగాని అదనపు రు. 20,001 లను ఒక విర్థం అన్యులకుగాని లేక వార్తకుగాని ఇచ్చు హక్కుకూడా కలిగి యుంటారు.

ఒక ఎంట్రీ ఫారమ్‌ను మీ డాల్డా వ్యాపారివద్ద తీసుకోండి

(బొంబాయి, హైదరాబాద్, సౌరాష్ట్ర మరియు మైసూరు రాష్ట్రములందు నివసించువారు తప్ప) తక్కినవారందరూ పాల్గొనవచ్చును.

HVM. 252-X52 TL

# నవ్వితేనే వుంది లోకం

## "భాస్కరం - ప్రభాకరం"

కథకుడు:
ప్రళయ ఝంఝానిలం వీచి, ప్రణయనౌక
నూపి వేసింది, ప్రేమికుడు ఓడిపోయి
పెళ్లి కుదరక, బెంగతో పిచ్చియెత్తి
ఆత్మహత్యకు వచ్చాడు హాస్పిటలుకు!!
అతినిది యీ ప్రేమతమో వాటిక
ఆ జీవితనాటిక కిది అవతారిక.

ప్రేమికుడు:
నే కోరినదొక్క రివాల్వర్
స్టెతోస్కోపు తీశావా డాక్టర్?
జ్వరం లేదు నన్నొదిలెయ్ మిష్టర్,
తియ్యబోకు నీ థర్మామీటర్!
స్టెతోస్కోపు వొద్దనవసరం
టెలిస్కోపుతో చూడీ హృదయం
నిరాశ, నిస్పృహ, దుఃఖం, శోకం
ప్రబంధ నాయకుల విప్రలంభం,
కొలవకపోతే థర్మామీటర్
కొదయ్యో, అది అధర్మమీటర్!

డాక్టరు:
గట్టిగ వూపిరి పీల్చు పంతులూ,
మెల్లి మెల్లిగా వొదులూ!

ప్రేమికుడు:
బ్రతుకే యిక నిట్టూరుపులైతే
హృదయ పరీక్షలు ఎందుకు డాక్టర్
అయినా కోరావ్, ఇదుగో పట్టు,
ఉచ్ఛ్వాసం, నిశ్వాసం, శ్వసనం!

డాక్టరు:
అః! హై ఫడ్నెస్
అయిరన్ లంగ్స్!
నోరు తెరచి నా
లిక చూపించు?

ప్రేమికుడు:
వెర్రి డాక్టరూ, నీ కెందుకయా
విశ్వరూప సందర్శన వాంఛ?
నోరు మంచిదే డాక్టరు బాబూ,
నోరుమాత్రమే స్మశాన సదృశం!!

డాక్టరు:
ఉక్కు ఖడ్గంలాంటి మనిషికి
దిక్కుమాలిన మందులెందుకు?
అసలు జరిగిన సంగతేమిటి?
అనేసెయ్, గొడవెందుకు?

ప్రేమికుడు:
తెల్లవార్లు నిద్రలేని
కల్లోలిత మానసుణ్ణి!
కలలలోన లలనకో అను
కలువరించు ప్రేమికుణ్ణి!
నేను భగ్నప్రేమికుణ్ణి!
రోమియోకి వస్తాదుణ్ణి!!

డాక్టరు:
ప్రేమ భగ్నమయ్యిందా?
బెంగ బయలుదేరిందా?
నిక్షేపంలాంటివాణ్ణి
నిన్నే వొద్దందా?
"పెద్దవాళ్లు, రాక్షసులు
హాసనీయ"రందా?
"పెద్దవాళ్లు వొప్పుకోరు
పోనీ లెమ్మం"దా?

ప్రేమికుడు:
సరిగా కనిపెట్టావు డాక్టరూ
'రోగనిదానం' నీ మారుపేరు
నా ప్రేయసి తండ్రొక 'పెద్ద లాకియర్'
లేడా వస్తే నాజీ, హిట్లర్!!
నా మొహంలో కళ లేదంటాడు
ఉన్నా అది ప్రేతకళంటాడు!
మేం గాని యిక పెళ్లాడామా,
నన్ను చంపుతాడు; తను చస్తాడు!

డాక్టరు:
నీ దోషం లేకపోలేదు నాయనా,
చెప్పమంటావా యిప్పుడయినా?
నీ రోజులు బాగుపడాలంటే
నీ ముఖకవళికలే మారాలి!
హాయిహాయిగా నవ్వావంటే
మాములు 'ఖ్యూ'లో నిలవాలి!
చంద్రబింబంలాంటి వదనం
నవ్వలేదేం పంతులూ?
నవ్వితేనే వుంది లోకం
నవ్వి పారెయ్ పంతులూ!

ప్రేమికుడు:
నవ్వమంటావ్, నవ్వమనవూ?
జివ్వుమని పోతోంది ప్రాణం
ఎప్పుడేనా నవ్వితేనా,
ఇప్పుడిట్టే నవ్వడానికి?

డాక్టరు:
నవ్వలేనంటూ విదేమిటి?
నవ్వడం బ్రహ్మాండ మేమిటి!
పానుగంటి, చిలకమర్తి
గాని నీకేం తగల్లేదూ?
మొక్కపాటి, భమిడిపాటీ
ఎక్కడా నువ్ చదవలేదూ?

ప్రేమికుడు:
చస్తున్నా మొర్రోమంటే
పుస్తకాల గొడవెందుకు డాక్టర్?
చేతకాదని చెప్పి నాకియ్,
చిటికెడంత 'పొటాషియం సైనేడ్!'

డాక్టరు:
ఆగవోయి, ఇంపేషెంట్ పేషెంట్!
ఆత్మహత్య డామిన్ డీసెంట్!
ఆగి, చూసుకో నా మజాకా!
చూసి, కాస్కో నా తడాఖా!
నైట్రస్ ఆక్సైడ్ వాయువుతో నే
నవ్వులు కురిపించేస్తాను.
శోధన నాళికలోని వాయువుని
శుభ్రంగా లోనికి పీల్చు!
తెరలు తెరలుగా నవ్వు దొంతరలు
కురిపిస్తానోయ్, భగ్నప్రేమికా!

ప్రేమికుడు:
అపర ధన్వంతరివి నువ్వే డాక్టర్
ఆగని మహా ప్రవాహం తీరున
అప్పుడే నవ్వొస్తోంది, కాసుకో
అహ్హాహ్హాహ్హా హూహ్హూహ్హూ!

డాక్టరు:
అదేమి నవ్వోయ్ మహానుభావా?
'హాసం' కాదది 'విషహాసం'!

సుగంధికా
సరస్వతీ తైలము
మెదడుకు, చల్లదనమునకు, కన్ను, ముక్కు, చెవి, వ్యాధులకు, 32 సం॥ నుండి ప్రపంచమంతటా వాడుచున్నారు ఒకసారి వాడిన తెలియును
మీ పెద్ద డీలర్లు అందరి వద్ద దొరుకును
ఈష్టన్ మెడికల్ వర్క్స్
కాకినాడ.
డిస్ట్రిబ్యూటర్లు: సీతారామ్ జనరల్ స్టోర్సు

# ★ నవ్వితేనే వుంది లోకం ★

పాతపాతకం, దగాలు, కుట్రలు
పైకి తీసుకుని వచ్చే నవ్వు!
మర్మాలన్నీ తెలిసిన నవ్వు!
మాయలు కనిపెట్టేసే నవ్వు!
గిల్టీకాన్షన్స్ వచ్చే నవ్వు!
డిటెక్టివ్‌లు యికిలించే నవ్వు!
దోషుల గోలెత్తించే నవ్వు!!

ప్రేమికుడు:
నవ్వుకి నువ్వేగా మందిచ్చావ్?
నవ్వుని నువ్వే విమర్శ చేస్తావ్?

డాక్టరు:
"శాంతము లేక సౌఖ్యము లేదు
సారసదళనయనా", నా పేషెంట్!
నా చరిత్ర నిర్దుష్టం కావున
నీ నవ్వుకి నే భయపడలేను!
కానీ లోపంవున్న మానవులు
నీ నవ్వుకి బేజారవుతారు!
పది నిముషాలకు వొక్కసారిగా
పకపకమని నవ్వేస్తుంటావ్!
అప్పుడు మర్మంవున్న మానవులు
అదిరిబెదిరి ఖంగారవుతారు!

కథకుడు:
అది అవతారిక
ఇది ఉపక్రమణిక
గడియారం ఉదయం పదికొట్టింది
ప్రేమికుడి ఆనందం మిన్నుముట్టింది
పదేసి నిముషాలకు వొకతెర నవ్వు
పడపడి నిరాశతో చూడిన ముఖకవళిక

ప్రేమికుడు:
పది నిముషాలకు వొకసారి
పక్కున పళ్ళికిలిస్తున్నాను
దారిపొడుగునా నవ్వుకి ఫలితం
దాఖలా తప్పక గనువార్హం!


## రవి. టాయ్‌లెట్స్

అందముకు,
వర్చస్సుకు




సోల్ ఏజంట్లు:—
ది న్యూ స్టార్ & కో., మద్రాసు 21.


అదుగో టెన్ టెన్! నవ్వొస్తోంది
అహ్హాహ్హాహ్హా హ్హుహ్హుహ్హు!

కథకుడు:
తప్పుతూకం తూచి యిస్తూ
అప్పుడే యీ నవ్వు వినపడి
పక్క కొట్లో నున్న కోమటి
బిక్క మొహమున పిలిచాడు!

కిరాణా సాహుకారు:
బాబుగారూ, చిన్న కబురు
పక్కున నవ్వేశారే?
నా వ్యాపారం కిటుకు మీరు
బాగా కనిపెట్టారే!
ఏదో పది యేళ్ళనుంచి
ఇల్లాగే బ్రతికాను
గజీతగాణ్ణి మీ చేతిలో
గంజికుంటలో చచ్చాను!
ఇన్నాళ్ళకి నా తూకంలో
ఈనాడే దొరికాను
దండుగకో నాలుగుపోగు
పంచెయించకండి!
ఇది పుచ్చుకు, నా సంగతి
పొక్కనీయకండి!!

ప్రేమికుడు:
బాగుంది వరస. వెళ్ళొస్తాను,
పదీ యిరవయ్ అవుతోంది
అదిగో నవ్వొచ్చేస్తున్నది
అహ్హాహ్హాహ్హా హుహ్హుహూ!

కథకుడు:
రంగునీళ్లు సీసాల్లోపట్టి
హంగుచేసి 'మందం'టూ అమ్మే
నాటువైద్యుడీ నవ్వు వినగనే
నాడి జారిపోయిం దనుకున్నాడు.

నాటు వైద్యుడు:
బాబుగారు, చిన్నమాట
పకపకమని నవ్వారేం?
'మంద'ని నీళ్ళిచ్చానని
ఎటా కనిపెట్టారేం?
ఏం చెయ్యను చెప్పండి?
ఎంతో డబ్బున్నవాడు
ఏమీ లేందే "జబ్బు"ని
ఏడుస్తూ వుంటాడు!
ఈ దినమా? విడాదిగ
ఈ నీళ్ళు యిస్తున్నా.
ఇది పుచ్చుకు తగ్గిందని
ఎంతో సుఖపడతాడు!
పరులతోటి చెప్పకండి!
ప్రాక్టీస్ చెడగొట్టకండి!
పొరపాటున నోరుజారి
పైకిమాత్ర మనకండి!
ఇదిగో దయచేసి మీరు
ఈ 'బహుమతి' పుచ్చుకోండి!

ప్రేమికుడు:
అల్లాగే మరి. టైటో! గుడ్ బై!
నే వెళ్ళొస్తా. పదిన్నరైనది!
అహ్హాహ్హాహ్హా హ్హుహ్హుహ్హా!

కథకుడు:
పక్కనే ఒక గొడుగు పట్టుకు
పెద్ద పెద్దగ అంగలేసుకు
పారిపోయే పెద్దమనిషి
భయము చెందెను నవ్వు వినగా.

గొడుగుగల ఆసామీ:
పంతులు గారూ, ఇల్లా రండి!
పకాలుమన్నా రేమండి?
గొడుగు సంగతి కనిపెట్టేశా?
నా గొడుగే ననుకుని తీశా!
కాదని యిప్పుడే గుర్తించాను
మీదా? ఇదుగో! వెళ్ళొస్తాను...

ప్రేమికుడు:
నా దేమిటి?
గొడు గేమిటి?
ఆశ్చర్యంగా వున్నది లోకం
ఆనందంలో వున్నది స్వర్గం
ఆ కాఫీహోటలుకు పోయి
అరకప్ కాఫీ తాగొద్దాం!
అరరే టైము పది నలభయ్యె
అహ్హాహ్హాహ్హా హ్హుహ్హుహ్హా!

కథకుడు:
హోటల్లోపల వున్న అయ్యరు
హుటాహుటిని పరుగెత్తుకొచ్చెను.

హోటల్ యజమాని:
కనిపెట్టాసెండి కులాసా?
తెలిసిపోయిందె లెండి దిలాసా!
పాలల్లో కలపాలని
పాలపొడుం డబ్బాలను

(55-వ పేజీ చూడండి)


## మంచీ - చెడూ

రచన:
'శారద'
**వెల 2-0-0**

శ్రీమదాంధ్ర
## మహాభారతము
ఉద్యోగపర్వము
వెల రూ. 1-0-0
**ఆంధ్రగ్రంథమాల,**
మదరాసు-1



# తురయా

మూలం: ప్రేమ్‌చంద్    అనువాదం: "ద్వారకా" బి. ఏ.,

## 1

ప్రభుత్వంవారి అనాథ శరణాలయం వదలి నేను సరాసరి సైన్యంలో చేరాను.

నా శరీరం కండలు తేలి బాగా బలిష్టంగా వున్నది. సాధారణాలతో పోలిస్తే నా కాళ్ళు చేతులు పొడుగ్గావుండి, బలంగా వున్నయ్. నేను ఆరడుగుల తొమ్మిదంగుళాల ఎత్తున్నాను. సైన్యంలో నేను 'శేర్' అనే పేరుతో ప్రఖ్యాతి పొందాను. సైన్యంలో చేరటంతోటే నా అదృష్టం తలక్రిందులైంది. నేను చేసినపనులవల్ల గౌరవం, ఆదాయం పెరిగినయ్. సైన్యంలోవున్న ప్రతియువకుడూ కన్నెర్రిగివున్న వాడే. మేజర్ సర్దార్ హిమ్మత్ సింహుకికి నామీద ఎంతో దయ. ఎందువల్లనంటే నేను ఒకసారి ఆయనప్రాణాలను కాపాడాను. దానికి మించి, ఎందువల్లనో ఆయన్ని చూస్తే నా హృదయంలో ఒకవిధమయిన భక్తి, శ్రద్ధలు కలుగుతయ్. ఆయన పూజ్యుడని నా విశ్వాసం. మా యిద్దరిమధ్య వ్యవహారం స్నేహపూర్వకంగా సాగుతుండేది.

నాకు తల్లిదండ్రులెవరో తెలియదు. వారినిగురించిన జ్ఞాపకాలుకూడా యేమీ లేవు. ఎప్పుడయినా యీవిషయాన్ని గూర్చి ఆలోచించదామనుకున్నాంటే ఒకకలలాంటి దృశ్యం కనిపిస్తుంది. పెద్దపెద్ద పర్వతాల మధ్యలో నివసించే కుటుంబం, ఒక స్త్రీ ముఖం, బహుశా నా తల్లిదయి వుంటుంది. కనబడుతయ్. నేను పెరిగి పెదవాడినయింది కొండల మధ్యనే. పెషావరు నుండి యేనభై మైళ్ళ దూరంలో కులహాల నే పేరుగల గ్రామం వున్నది. అక్కడే ప్రభుత్వం అనాథ శరణాలయమున్నది. దాంట్లోనే నేను పెరిగాను. అక్కడనుంచే సైన్యంలో చేరాను. హిమాలయపు శీతల వాయువులలో నా శరీరం తయారయింది. నేను సరాయి ప్రాంతాలలో వుండే అఫ్రిదీలు, గిల్జాయీలు మొదలగు కొండప్రాంతపు ప్రజలలాగా దీర్ఘ శరీరంతో, బలిష్టంగా తయారయినాను. వారి జీవితానికీ నా జీవితానికీ యేదయినా భేదమున్నదంటే అది నాగరకతలోనే. నేను చదవగలను. మాట్లాడగలను. తీపివేతలు, గుణింతాలు తెలుసుకున్నాను చిన్న పెద్దలతో ఎట్లా ప్రవర్తించాలో తెలుసు. కాని ఆకారానికి మాత్రం యేమీ తెలియని కొండజాతి వాడినిగా వుంటాను.

అప్పుడప్పుడు స్వేచ్ఛగా ఆ కొండలలో విహరిద్దామని కోరిక పుడుతుంది. కాని జీవిత సమస్య ఆ కోరికను అణచివేస్తుంది. ఆ యెడారిదేశంలో తినటానికి యేమీ వుండదు. అక్కడి ప్రజలు ఒక రొట్టెముక్క సంపాదించుకోటానికి హత్యలు కూడా చేస్తారు. ఒక గుడ్డకోసరం శవాలను అఘోగతిపాలు చేస్తారు. ఇక, ఒక తుపాకికోసం సైన్యాలనే అవస్థలపాలు జేస్తారు. ఇంతకంటె మించి, అక్కడి ప్రతిమనిషి వస్నేరిగున్నాడు. నా పెత్తురు త్రాగాలని దాహంతో వున్నారు. నేను వారికి దొరికిపోయానంటే నా నామరూపాలు ప్రపంచంలో లేకుండాపోతై. ఎంతమంది అఫ్రిడీలను, గిల్జాయీలను చంపేశానో, ఎంతమందిని పట్టుకపోయి ప్రభుత్వాని కప్పగించి జైళ్ళపాలు చేశానో, ఎన్ని గ్రామాలు కాల్చేసి శ్మశానాలుగా మార్చేశానో లెక్కలేదు. నేను చాలా జాగ్రత్తగా వుంటాను. ఒక ప్రదేశంలో వారం రోజులకంటె ఎక్కువ వుండను.

## 2

ఒకరోజు నేను మేజర్ జనరల్ హిమ్మత్ సింహుగారింటికి పోతున్నాను. అప్పుడు మధ్యాహ్నం రెండుగంటలయింది. ప్రస్తుతానికి పనేమీ లేదు. నిన్న, మొన్ననే కొన్ని గ్రామాలను బూడిద చేశాము. వాటి నుండి ఏవిధమయిన అపాయం కలిగేనూచనా లేదు. మేము నిర్భయంగా పిచ్చాపాటి చెప్పుకుంటూ సంతోషంగా నవ్వులతో కాలం గడుపుకొంటున్నాము. పూరికనే హృదయంలో భయం తలెత్తింది. మనసును సముదాయించుకోటానికి సర్దారుగారింటి వేపు బయలుదేరాను. త్రోవలో ఒక దుర్ఘటన జరిగింది. ఒక ముసలి అఫ్రిడీవాడు ఒక హిందూదేశయువకుణ్ని సరిపెట్టగల బలం కలిగినవాడు, ఒక సైనికుడితో కుస్తీ పడుతున్నాడు. నేను చూస్తూచూస్తూ వుండగానే వడుములోనుండి కత్తిని దీసి వాడి రొమ్ముల్లో పొడిచాడు. ఆ యువకుడిదగ్గర ఒక తుపాకి వున్నది. అందుకోసరమే యీ పోట్లాటంతా. కనురెప్పపాటులో సైనికుడు నేలమీద కూలిపోయాడు. ముసలివాడు తుపాకి తీసుకొని పారిపోతున్నాడు. నేను వాడివెంటనే పరిగెత్తాను. వాడు బహువేగంగా పరుగెత్తుతూ కొద్ది సేపటిలోనే కనుచూపుమేరను దాటిపోయాడు. నేనూ మొండిగా అతడిని వెంబడించాను. పూరి పొలిమేరలలోకి పోయేసరికి అతడికి నాకు మధ్య ఇరవై గజాలు దూరమున్నది. అతడు వెనక్కు తిరిగి చూచాడు. నేను వంటరిగా అతడిని వెంబడిస్తున్నాను. అతడు తుపాకిని నా వంకకు గురిబెట్టాడు. నేను వెంటనే నేలమీద వాలిపోయాను. తుపాకి గుండు నా ముందున్న రాతికి తగిలింది. ఆ గుండు నన్ను చంపేసిందనుకున్నాడు. నెమ్మదిగా సంకోచిస్తూ నా వంకకు వచ్చాడు. నేను శ్వాసబిగబట్టుకొని పడుకున్నాను. అతడు నా సమీపానికి వచ్చిన తరువాత సింహం లాగా అతడి గొంతు పట్టుకొని అమాంతంగా క్రింద పడేశాను. కత్తితో గుండెల్లో నాలుగు పోట్లు పొడిచాను. అఫ్రిడీవాడి జీవితనాటకం సమాప్తమైంది. ఇదే సమయానికి సైన్యంలో వున్న వాళ్లు చాలామంది నా దగ్గరకు చుట్టూచేరారు. నాలుగుప్రక్కలనుండి ప్రశంసలు వినిపిస్తున్నయ్. ఇంతవరకు నేను నైతన్యవంతంగా లేను. ఇప్పుడు నాకు తెలివి వచ్చింది. ఆ ముసలివాడిని జూచి నా హృదయం ఎందుకు భయపడిందో తెలియటంలేదు. ఇంతకుముం దెప్పుడూ నేను భయపడి వుండలేదు. నేలమీద కూర్చొని


**మాలతీ చందూర్ రచనలు:**

| | |
|---|---|
| చంపకం — చెదపురుగులూ | 1 8 0 |
| రేణుకాదేవి ఆత్మకథ | 1 8 0 |
| పావ (కథల సంపుటి) | 1 8 0 |
| మాలతీ చందూర్ కథలు | 1 0 0 |

5-8-0 M. O. పంపిన వారికి పై నాలుగు పుస్తకాలూ పోసు ఖర్చులు భరించి పంపగలం.

దేశకవితామండలి విజయవాడ - 2.

ఆ ముసలివాడిని చూచాను. సైన్యంలోని వారు అనేకులు నాకు గాయాలు తగిలిన వనుకొని ఎన్నో ప్రశ్నలు వేశారు. మాట్లాడకుండా నెమ్మదిగా లేచి పట్టణంవేపు నడిచాను. సైనికులు ఆ ముసలివాడి శరీరాన్ని లాక్కొంటూ నా వెంటనే వచ్చారు. పట్టణంలోని ప్రజల జయజయ ధ్వానాలు ఆకాశాన్నంటినయ్. నేను మాట్లాకుండా మేజర్ సర్దార్ హిమ్మత్ సింగుగారింట్లో ప్రవేశించాను.

సర్దారుగారు తన గదిలో కూర్చొని యేదో వ్రాసుకుంటున్నాడు. ఆయన నన్ను చూచి "యేఁ! ఆ అఫ్రిడీవాడిని చంపేశావా?" అన్నాడు.

నేను కూర్చుంటూ "అవునండీ! కాని సర్దార్ గారూ నేనంత మోసగాడినెలా అయిపోయానో తెలీటంలేదండి" అన్నాను.

సర్దారుగారు ఆశ్చర్యంతో "అసద్ ఖాఁ! మోసమూనా? ఇవి రెండూ ఒకచోట వుండటం అసంభవం" అన్నాడు.

నేను లేస్తూ అన్నాను. "సర్దార్ సాహెబ్ ఇక్కడ బాగాలేదు. వరండాలోకి పోయి కూర్చుందాము పదండి. నాకెందుకో భయంగా వున్నది."

సర్దారులేచి నాదగ్గరకు వచ్చారు. స్నేహభావంతో నావీపు చరుస్తూ "అసద్! నీవు పరుగెత్తిపరుగెత్తి అలసిపోయి వుంటావు. అంతకంటె యేమీ కాదు. పోదాంపద. వరండాలో కూర్చుందాము. సాయంత్రపు చల్లటిగాలి నిన్ను వుత్సాహవంతుణ్ణిగా చేస్తుంది" అన్నాడు.

సర్దారుగారు, నేను, వరండాలో కుర్చీలలో కూర్చున్నాము. పట్టణంలో నాలుగు దార్లూ కలిసేచోట ముసలివాడి శవం చుట్టూ జనం మూగివున్నారు. వరండాలో వున్న నన్ను చూచిన వారంతా సంజ్ఞలు చేయటం మొదలు పెట్టారు. సర్దారుగారు యీ దృశ్యం చూచి "అసద్ ఖాఁ! చూడు ప్రజల దృష్టిలో నీవు ఎంత వున్నతంగా వున్నావో, నీ వీరత్వం పసిపాపలకుకూడా అవగాహన మయిపోయింది. పైగా నీవు మోసగాడివయిపోయావంటున్నావా?" అన్నాడు.

నేను నవ్వుతూ "ఈ ముసలివాణ్ణి చంపినదగ్గరనుండి నా హృదయంలో యేదో కల్లోలం బయలు దేరింది" అన్నాను.

సర్దారుగారు నవ్వి "నీకంటె బలహీనుణ్ణి చంపినందువల్ల నయివుంటుంది" అన్నాడు.

నేను నా మనస్సును కూడదీసుకుంటూ "బహుశా అందుకే అయివుండవచ్చు" అన్నాను.

ఇకే సమయానికి ఒక అఫ్రిడీ యువతి సర్దార్ గారి ఇంటిముంగుకు వచ్చింది. ఆమెను చూడగానే సర్దార్ గారి ముఖం తెల్లబడిపోయింది. భయాన్ని కలిగించే ఆమె చూపులు అతడివంకనుండి నా దిశకు మారినయ్. నేనామెను చూచి ఆశ్చర్యపోయాను. పురుషుల శరీరాలు గూడా అంత బలిష్టంగా వుండవు. పయిజామా తొడుక్కున్నది. నీలిరంగు డశసరి చొక్కా వేసుకొన్నది. బెలూచిస్థానపు స్త్రీలాగా తల కొకగుడ్డ చుట్టుకున్నది. బంగారు రంగు శరీరం. యౌవనకాంతులు తెంచుకొని ముందుకు వస్తున్నయ్. ఆమె చూపులు ప్రతివాడినీ భయపెడుతయ్. ఆమె చూపులు సర్దారుమీదినుంచి నా వంకకు తిరగంగానే నాకు భయమేసింది. సర్దారును చూచి 'ఖూ' అని నేలమీద వుమ్మేసింది. నావంక చూస్తూ చూస్తూ వేరె ప్రక్కకు పోయింది.

ఆ యువతి పోయిన తరువాత సర్దారుగారి శరీరం చేతనమయింది. నా తలమీదనుండికూడా కొంత బరువు దించేసినట్లయింది.

నేను సర్దారుగారిని "మీ రీమెను ఎరిగున్నారా?" అని ప్రశ్నించాను.

సర్దారుగారు ఒక దీర్ఘ ఉచ్ఛ్వాసాన్ని వదిలి "అవును, నన్ను ప్రాణసమానంగా ప్రేమించినదీమె. నిజంగా ప్రాణం పోతుందనే భయంకూడా లేకుండా నన్ను రక్షించిందీమె. ఇప్పుడు నేనంటేనే అసహ్యించుకొంటుంది. ఈమే నా భార్యనుకూడా హత్యజేసింది. ఈమెను చూచినప్పుడల్లా నాలో ధైర్యం కర్పూరంలాగా ఉత్పతనం చెందుతుంది. ఆ భయానకదృశ్యమే నా కళ్లముందు కనిపిస్తుంది" అన్నాడు.

నేను భయవిహ్వలస్వరంతో అడిగాను. "సర్దార్ సాహెబ్! ఆమె నావంకకూడా భయంకరంగా చూచిందిగదా? నా శరీరం రోమాంచమయినది ఎందుకో!"

సర్దారుగారు గంభీరభావంతో తల వూపుతూ "అసద్ ఖాఁ! నీవుగూడా జాగ్రత్తగా వుండు. ఆ ముసలి అఫ్రిడీవాడితో ఆమెకు సంబంధం వుండివుండవచ్చు. అతడామెకు తండ్రో, సహోదరుడో అయి వుంటాడు. నీవంక చూడటం నిన్ను బాగా గుర్తుంచుకోటానికే. చాలా భయంకరమైన ఆడది" అన్నాడు.

సర్దారు చెప్పినమాటలువిని నా నరాలన్నీ కంపించి పోయినయ్. నేను మాటలను వేరేవిషయానికి జోడిస్తూ "మీ రామెను పోలీసువారి కెందుకు వప్పజెప్పరు? తప్పకుండా వురిశిక్ష పడుతుంది" అన్నాను.

సర్దారుగారు "అసద్ ఖాఁ! ఆమె నా ప్రాణం రక్షించింది. ఇంకా నన్ను కోరుకునే వున్నది. ఈ కథ చాలా పెద్దది అవకాశం దొరికినప్పుడు చెబుతాను" అన్నాడు.

సర్దార్ చెప్పే మాటలతో నా కుతూహలం హెచ్చిపోయింది. ఆయన్ను కథ చెప్పమని కోరటం ఆరంభించాను. మొదట్లో ఆ విషయాన్ని తోసెయ్యటానికి ప్రయత్నించారు. కాని నేను మరల మరల అడిగేసరికి ఆయన "అసద్! నీవు నా సహోదరుడితో సమానుడివి. అందువల్ల మనిద్దరి మధ్య యే విధమయిన రహస్యము వుంచను. విను—

అసద్ ఖాఁ! ఐదు సంవత్సరాలకు ముందు నే నిప్పుడు కనిపిస్తున్నంత ముసలివాడినిగా లేను. ఇప్పుడు నా వయస్సు నలభైకంటె ఎక్కువ లేదు. ఒక్క వెంట్రుకగూడా తెల్లబడలేదు. ఇద్దరు బలశాలురయిన యువకులతో పోట్లాడగల శక్తి నాలో వుండేది. జర్మనీవాళ్లతో జరిగిన ఘోర యుద్ధంలో ఎంతమందికి యమలోకమార్గం చూపించానో నాకే తెలియదు. జర్మనీ యుద్ధమయిన తరువాత పూరికే నాకు మేజర్ జనరల్ పదవినిచ్చి నన్నీ సరిహద్దుప్రాంతానికి పంపించారు. నే నిక్కడికి వచ్చిన మొదట్లో ఎన్నో కష్టాలు నాముందు నిలిచినయ్. వాటిని లెక్క చేయకుండా ఒక్కొక్కదాన్ని తోసుకుంటూ ముందుకు పోయాను. అన్నిటికంటె ముందు నే నిక్కడికి వచ్చినవెంటనే 'పశ్తో' భాష నేర్చుకున్నాను. దాని తరువాత ఎన్నో భాషలు నేర్చుకున్నాను. వారితో సామెత లుపయోగించి గూడా మాట్లాడగలిగెంత బాగా ఆ భాషలు నేర్చుకున్నాను. ఆ తరువాత కొంతమంది సైనికులను వెంటదీసుకొని ఈ ప్రదేశంలోని అన్ని భాగాలను గాలించివేశాను. ఈ యాత్రలో ఎన్నోసార్లు మరణించి జీవించాను. అన్ని కష్టాలను అనుభవిస్తూ ఇక్కడ కుశలంగా వుండగలిగాను. ఆ కాలంలో నే నెన్నో ఘనకార్యాలు చేయగలిగాను. నాటిద్వారా ప్రభుత్వంలో నాకు పేరు ప్రతిష్ఠలు లభించినయ్.

ఒకసారి కర్నల్ హామిల్టన్ భార్యను నే నొక్కడినే విడిపించుకొని వచ్చాను. ఎంతోమంది దేశీయ పురుషులు, స్త్రీలు నాచేత బ్రతికించబడ్డారు. నే నిక్కడికి వచ్చిన మూడుసంవత్సరాలతరువాత నాకథ ప్రారంభమయినది.

ఒకరాత్రి నేను నా కేంపులో పడుకొని వున్నాను. అఫ్రిడీవారితో యుద్ధం జరుగుతున్నది. పగలంతా కష్టపడి అలసిపోయి సైనికులు శోషపోయి పడివున్నారు. కేంపు నిశ్శబ్దంగా వున్నది. పడుకున్న వెంటనే నాకు నిద్ర పట్టింది. మెలకువ వచ్చినప్పుడు చూస్తే నా రొమ్ములమీద ఒక అఫ్రిడీవాడు, నా వయస్సుకు రెట్టింపు వయసులో వున్న

# మార్టిన్ రాట్లర్

## 'బాలసాహితి' కొత్త సీరియల్

ఆర్. ఎమ్. బాలన్‌టైన్ రచించిన "మార్టిన్ రాట్లర్" నవల అనువాదం పై వారం నుండి (28-9-55) ఆంధ్ర-వారపత్రికలో ప్రకటిస్తున్నాము. ఈ నవల ముఖ్యంగా బాలబాలికా పాఠకులకు ఎంతో విజ్ఞానదాయకమైనది. దక్షిణ అమెరికాలోని బ్రెజిల్ దేశంలో మార్టిన్ రాట్లర్ అనే ఇంగ్లీషు బాలుడు చేసిన అద్భుత సాహసాలు, చూసిన ప్రకృతి రహస్యాలు ఈ నవల వర్ణిస్తుంది.

**నేడే మీ కాపీ రిజర్వు చేసుకోండి.**


వాడు కూర్చొని వున్నాడు. నా రొమ్ముల్లో పొడిచేయటానికి సిద్ధంగా వున్నాడు. నేను సంపూర్ణంగా అతడి స్వాధీనంలో వున్నాను. బ్రతికించుకునే వుపాయమే లేదు. నేను చాలా ధైర్యం తెచ్చుకొని పశ్చా భాషలో మాట్లాడాను - "నేను ప్రభుత్వం వారి సైన్యాధికారిని. నన్ను పట్టుకుపోయి ప్రభుత్వానికి అప్పగిస్తే డబ్బిస్తారు." అన్నాను.

భగవంతుడి దయవల్ల నా మాటలు వాడి మనసులో కెక్కినయ్. నడుముకున్న త్రాడుతీసి కాళ్లు చేతులు కట్టి నన్ను భుజం మీద వేసుకొని గుడారం బయటికి తీసుకొచ్చాడు. బయట నిశ్శబ్దంగా వున్నది. అతడు విచిత్రంగా యేదో కేక వేసి చెప్పి నన్నొక అడవిలోకి తీసుకుపోయాడు. అతడు చాలా వేగంగా పరుగెత్తుతున్నాడు. అతడికి నా బరువు లెక్కలో లేదని గట్టిగా చెప్పగలను. అతడి వెనుక అతడి గుంపులోని వారు కొంతమంది, దొంగిలించిన సొమ్ము తీసుకొని పారిపోయి వస్తున్నారు.

ఈ విధమయేసరికల్లా మేమొక చెరువు దగ్గర చేరాము. చెరువును పెద్దపెద్ద కొండలు చుట్టివున్నయ్. దానిలో చాలా నిర్మలమయిన నీరున్నది. అడవి జంతువులు అన్ని ప్రక్కలా గుమిగూడి వున్నయ్. చెరువు దగ్గరకు పోయి ఆగారు. ఆ ముసలివాడు ఆ గుంపుకంతటికి నాయకుడు. నన్నొక రాతి మీద పడేశాడు. నా నడుముల్లో అపరిమితమయిన బాధ కలిగింది. ఏదయినా ఎముక విరిగిపోయిన దనిపించింది. భగవంతుడి దయ వల్ల అలా జరుగలేదు. నాయకుడు నన్ను భూమిమీద పడేసి "యేం! ఎన్ని రూపాయ లిప్పిస్తావు?" అన్నాడు. నా బాధను ఆపుకుంటూ "ఏడువందలు" అన్నాను.

నాయకుడు ముఖాన్ని వికృతం చేసి "లేదు. ఇంత తక్కువ తీసుకోను. రెండు వేలకు ఒక్క దమ్మిడీ తక్కువయినా నీ ప్రాణం దక్కదు" అన్నాడు.

నేను కొంచెం ఆలోచించి "నల్లవారి కోసం ప్రభుత్వం ఇంత డబ్బును వెచ్చించదు" అన్నాను.

నాయకుడు కత్తి బయటకు తీస్తూ "మరి ప్రభుత్వం వారిచేత బహుమాన మిప్పిస్తానని ఎందుకన్నావు. సరే. అయితే యిక్కడే చావు" అన్నాడు.

నాయకుడు కత్తి తీసుకొని నా వంకకు వచ్చాడు. నేను భయపడిపోయాను. "సరే సర్దార్! రెండువే లిప్పిస్తాను" అన్నాను.

నాయకుడు పెద్దగా నవ్వి ఆగిపోయాడు. అతడి నవ్వు ప్రాణం లేని పర్వతాలనుగూడా కంపింపజేసింది. నేను మనసులో "చాలా భయంకరమయిన మనిషి" అనుకున్నాను.

గుంపులోని మనిషి తాము దోచుకొచ్చిన డబ్బును నాయకుడిముందు పోశాడు. వాటిలో ఎన్నో తుపాకులు, తుపాకిమందు, కోట్లు, కత్తులు వున్నయ్. నన్ను గూడా సోదా చేశారు. నా దగ్గర ఆరు గుండ్ల పిస్తోలున్నది. పిస్తోలు తీసుకొని నాయకుడు ఉక్కపడ్డాడు. దానిని త్రిప్పి త్రిప్పి చూడటం ఆరంభించాడు. అక్కడే, ఆ సమయంలోనే భాగాలు పంచుకోటం ప్రారంభమయింది. అన్ని సమభాగాలు కుదిరిపోయినయ్ గాని నా పిస్తోలును వాటిలో కలుపలేదు. ఇది నాయకుడికి ప్రత్యేకంగా దొరికిన సొమ్ము.

కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తరువాత తిరిగి యాత్ర ప్రారంభమయింది. ఈసారి నా కాళ్లు విప్పేసి వారితోబాటు నడవమన్నారు. మార్గం చూడకుండా నా కళ్ళకు గంతకట్టారు. నా చేతులకు కట్టిన త్రాటికొనను ఒక ఆఫ్రిడీవాడు పట్టుకొని నడుస్తున్నాడు.

నడిచి నడిచి నా కాళ్లు నొప్పిపుట్టినయ్. వాళ్ళ గమ్యస్థానం రాలేదు. జ్యేష్ఠమాసపు సూర్యుడు తల మాడ్చేస్తున్నాడు. కాళ్ళు కాలుతున్నయ్ దప్పికతో గొంతు ఎండిపోతున్నది. వారిమాటలు నా కర్థం కావటం లేదు. అప్పుడప్పుడు ఒకమాట అరమాట అర్థమయేది.

ఎన్నో విషయాలు నా కర్థమయేవి గావు. వారు తమ విజయానికి ఆనందిస్తున్నారు. ఒక ఆఫ్రిడీవాడు తమ భాషలో ఒక పాటపాడటం ఆరంభించాడు.

"సర్దార్ సాహెబ్! ఆపాట అర్థమేమిటండీ?" అని నే నడిగాను.

సర్దారు సమాధానమిచ్చాడు. "ఆ పాట భావం జ్ఞాపకమున్నది. అదేమిటంటే, ఒక ఆఫ్రిడీవాడు పోతున్నాడు. అతడి ప్రియురాలు ఎక్కడికి పోతున్నావు? అన్నది.

యువకుడు నీకోసం గుడ్డలు రొట్టెలు తీసుకురాబోతున్నా నన్నాడు

స్త్రీ మన పిల్లలకోసం మేమీ తీసుక రావా? అన్నది.

యువకుడు పిల్లలకు తుపాకులు తెస్తాను. పెద్దవాళ్ళయిన తరువాత వాళ్లుకూడా వారి ప్రియురాళ్ళకు రొట్టెలు గుడ్డలు తీసుకురావటానికి. అంటాడు.

తిరిగి ఎప్పుడొస్తావో చెప్పు. అంటుంది స్త్రీ.

యేదయినా జయించుకొని వస్తాను. లేకపోతే అక్కడే చచ్చిపోతాను. అంటాడు యువకుడు.

స్త్రీ శెహబాస్! వెళ్లు. నీవు వీరుడవు. తప్పక జయించుక వస్తావు. అంటుంది."

పాట విని నేను ముగ్ధుడనయిపోయాను. పాట పూర్తయిపోవటంతోనే మేము ఆగాము. నా కళ్ళు విప్పారు. ముందు ఒక పెద్ద మైదానం వున్నది. నాలుగు దిశల లోనూ గుహలు వున్నయ్. అవే యీ ప్రజల నివాసాలు.

మరల నన్ను సోదా చేశారు. నా గుడ్డలన్నీ విప్పించారు. కేవలం పయిజమా మాత్రం మిగిల్చారు. ముందు ఒక పెద్ద రాయి వున్నది. అందరూ కలసి దాన్ని తొలిగించి నన్నా దిశలోనే తీసుకుపోయారు. నా హృదయం కంపించిపోయింది. వీళ్లు బ్రతికివుండగానే సమాధి చేస్తారు. శోకపూరిత నేత్రాలతో సర్దారువంక చూస్తూ "సర్దార్! ప్రభుత్వం మీకు డబ్బిస్తుంది. నన్ను చంపబోకండి" అని ప్రార్థించాను.

సర్దారు నవ్వి, "నిన్ను ఎవరు చంపుతారు? ఖైదు చేస్తున్నాము. ఈ ఇంటిలో బంధింపబడి వుంటావు. డబ్బు మా చేతికి వచ్చిన తరువాత నిన్ను విడిపిస్తాము." అన్నాడు.

నాయకుడి మాటలు విన్న తరువాత నా ప్రాణం ప్రాణంలోకి వొచ్చింది. నాయకుడు నా పాకెట్ నోట్ బుక్కు, పెన్సిలు తీసుకొని నా ముందుబెట్టి "ఇదిగో దీనిలో వ్రాయి. ఒక్క దమ్మిడీ తగ్గిపోయినా ప్రాణాలు దక్కవు." అన్నాడు.

నేను కమీషనరుగారి పేరిట ఒక ఉత్తరం వ్రాసియిచ్చాను. వారు నన్నా చీకటి కూపంలోనే పడేసి త్రాడులాగారు.

## 3

సర్దార్ సాహబ్ ఒక దీర్ఘ నిశ్వాసాన్ని వదిలి ఇలా ప్రారంభం చేశారు—

అసద్ ఖాఁ! ఆ బావిలో నేను కొట్టుకులాడుతున్నాను. నా అంతరాత్మ కంపించిపోయింది. దట్టమయిన చీకటిలో ఒకమందం పడివున్నది. దానిలో ఎన్ని ప్రాణాలు పోయాయో! ఎత్తయిన రాతిగోడలు యీ కూపం చుట్టూ వున్నయ్. వాటి సందుల్లోంచి వెలుతురు గాలి వస్తుంది. అందులో పడి నా దుర్దశను గురించి ఆలోచించసాగాను. హృదయం భయపడి పోతున్నది. ఆ కాలకూపంలో పడివుండి చావమని భగవంతుడు వ్రాసిపెట్టి వున్నాడనుకున్నాను.

మెల్లగా సాయంకాలమయింది. వారింతవరకు నా సంగతి సమాచారాలు కనుక్కోలేదు. ఆకలితో ఆత్మ అల్లాడిపోతున్నది. మాటిమాటికి, నన్ను తిట్టుకొని భగవంతుణ్ణి తిట్టేవాడిని.

ఇంతలో బయటినుండి ఎవరో ఒకసందునుంచి నాలుగు రొట్టెముక్కల్ని లోపల పారేశారు. కుక్క దూకినట్లు రొట్టెముక్కల మీదకు దూకి వాటిని తీసుకొని ఆ సందువైపు చూచాను. మరల ఎవరూ ఏమీ వెయ్యలేదు. ఏ ఆజ్ఞ ఇవ్వలేదు. కూర్చొని రొట్టెలు తింటం ఆరంభించాను. కొంతసేపయినతర్వాత ఆ సందుగుండానే ఒక పాత్రను ఇచ్చారు. దానినిండా నీరున్నది. నేను భగవంతుడికి ధన్యవాదాలర్పిస్తూ ఆ నీటిని త్రాగేశాను. ఆత్మకు కొంత శాంతి కలిగినతరువాత "ఇంకొంచెం నీరుకావాలి" అన్నాను దీంతో గోడవతలి ప్రక్కన ఒక భయంకరమయిన నవ్వు ప్రతిధ్వనించింది. "ఇకనీరు రేపు దొరుకుతుంది. పాత్రయివ్వు. లేకుంటే రేపుకూడా నీరు దొరకదు." అని గర్జించారు.

ఏం చేసేది. ఓడిపోయిగిన్నెను అక్కడే వుంచేశాను.

ఇదే ప్రకారం ఎన్నోరోజులు గడిచిపోయినయ్. రోజూ రెండుపూటలా రొట్టెలు, ఒక గిన్నె మంచినీరు దొరుకుతుండేవి. నెమ్మదిగా యీ కుక్కజీవితానికి నేనుకూడా అలవాటుపడిపోయాను. వంటరిపాటు అంత చెడ్డదిగా లేదు. నా భాషలో, పష్తూ భాషలో అప్పుడప్పుడు పాటలు పాడేవాడిని. దీనితో నాకు కొంత మనశ్శాంతి దొరుకుతుండేది. హృదయం కూడా శాంతపడేది.

ఒకరోజు నేను ఒక పష్తూపాటను పాడుతున్నాను. మజును కాలుస్తున్న వారితో అంటున్నాడు—"ముసల్మానులను కాల్చి బూడిద చేస్తున్నంతటి దుర్మార్గం మీలో లేదా? ఆ వేడి నన్నెందుకు కాల్చి వేయదు. నాలోనే ఒక వేడి వున్నందువల్ల నా?"

"మాడండి. లైలా వెదుక్కుంటూ యిక్కడికి వచ్చినప్పుడు నాశరీరాన్ని ఇసుకలో కప్పివేయండి. లేకుంటే అద్దంలాగా లైలా హృదయం పగిలిపోతుంది."

నేను పాట ఆపేశాను. అప్పుడే సందులోనుండి ఎవరో "ఖైదీ! మళ్ళీ పాడు." అన్నారు.

నేను ఉలిక్కిపడ్డాను. కొంచెం ఆనందమయింది. కొంత ఆశ్చర్యం కలిగింది. "నీవెవరు?" అడిగాను. సందులోనుండి వినిపించింది. "నేను 'తూరయా'ను. సర్దారు కూతుర్ని."

"ఏం. ఈ పాట నీకు బాగున్నదా?" నేనన్నాను.

తూరయా "అవును ఖైదీ! మళ్ళీ పాడు. నేను వినాలి" అన్నది.

నేను సంతోషంతో పాడటం ఆరంభించాను. పాట పూర్తయిన తర్వాత "నీవు రోజూ ఇదేపాట నాకు వినిపిస్తుండు. ఇంకా ఎక్కువగా రొట్టెలు నీరు ఇస్తుంటాను" అన్నది తూరయా.

తూరయా వెళ్ళిపోయింది, దానితరువాత ప్రతిరాత్రి నే నెప్పుడూ అదే పాట పాడుతాను. ఆమె గోడదగ్గరకు వచ్చి వింటుండేది. నా మనస్సంతోషానికి మరో మార్గం దొరికింది.

నిదానంగా ఒక నెల గడిచిపోయింది. నన్ను విడిపించటానికి ఎవరూ ఇంతవరకు డబ్బు పంపలేదు. రోజులు గడిచినకొద్దీ నాకు జీవితంమీద ఆశ తగ్గుతూ వస్తున్నది.

సరిగ్గా ఒక నెల జరిగిన తరువాత నాయకుడు వచ్చి "ఖైదీ! రేపుకూడా డబ్బు రాకపోతే నిన్ను చంపేస్తాము. పూరికే ఎన్నాళ్ళు రొట్టెలు పెడతాము." అన్నాడు.

జీవితంమీద ఆశంతా పోయింది. ఆరోజు యేమీ తినలేకపోయాను త్రాగలేకపోయాను. రాత్రయింది తిరిగి రొట్టెలు విసిరివేయబడినయ్. కాని తిన బుద్ధిపుట్టలేదు

మామూలు సమయానికి తూరయా వచ్చి "ఖైదీ! పాట పాడు." అన్నది.

ఆరోజు నాకేమీ బాగాలేదు. నేను మాట్లాడలేదు. తూరయా, "ఖైదీ! నిద్రపోయావా?" అన్నది.

నేను చాలా బాధగా "లేదు. ఈరోజు నిద్రపోయి యేమి చేసేది. రేపు నిద్రపోతే ఇక లేప నవసరంలేదు." అన్నాను.

తూరయా ప్రశ్నించింది. "యేఁ! ప్రభుత్వంవాళ్లు డబ్బు పంపరా?" నేను సమాధాన మిచ్చాను. "పంపిస్తేగదా. రేపు నన్ను చంపేయబోతున్నారు. ఇక వాళ్లు డబ్బు పంపినేమాత్రం ప్రయోజన మేమున్నది?"

తూరయా ఓదారుస్తూ "సరే! నీవు పాడు. రేపు నీవు చావకుండా చూస్తాను." అన్నది.

నేను పాడటం ఆరంభించాను. వెళ్లేప్పుడు తూరయా "ఖైదీ! నీకు గొడ్లచావిడిలో వుండటం ఇష్టమేనా?" అన్నది.

"ఆ! యేదో విధంగా యీ నరకంలోంచి

బయటపడితే చాలు." అని సంతోషంగా అన్నాను.

"సరే! రేపు మా నాన్నతో చెబుతాను." అన్నది తూరయా.

మరు దేజు నన్ను చీకటికూపంలోంచి బయటకు తీశారు. నా రెండుకాళ్లకు రెండు పెద్ద రాళ్లు కట్టేశారు.

నాయకుడు నాదగ్గరకు వచ్చి "ఖైదీ! ఇంకా పదిహేను రోజుల వ్యవధి యిస్తున్నాము. తరువాత నీతల శరీరంనుండి వేరు చేయబడుతుంది. ఈరోజే మీవూరు ఇంకో వుత్తరం వ్రాయి. పండగలోగా రాకపోతే నిన్ను చంపేస్తాము." అన్నాడు.

నేను రెండో వుత్తరం వ్రాసియిచ్చాను. నాయకుడు వెళ్లిపోయిన తరువాత తూరయా వచ్చింది. ఇప్పుడిక్కడినుండి వెళ్లిపోయి నామే యీమె ఈమే, నాయకుడి కుమార్తె. ఈమే నాపాట వింటుండేది. నాకోసరం సిఫారసుచేసి నన్ను రక్షించింది తూరయా వచ్చి నన్ను పరీక్షించి చూసింది. నేనూ ఆమెను చూచాను.

"ఇంట్లో నీ వాళ్లెవరున్నారు ఖైదీ!" అన్నది.

నేను దుఃఖిస్తూ "ఇద్దరు చిన్నపిల్లలున్నారు. ఇంకెవరూ లేరు." అన్నాను

"వాళ్ళ తల్లి లేదా?" అన్నది తూరయా.

నేను ఆమెలో దయాభావాన్ని పుట్టించటానికి గాను 'లేరు' నా భార్య చనిపోయింది. వాళ్లు ఒంటరిగా వున్నారు. జీవించి వున్నారో చనిపోయారో భగవంతుడికే తెలియాలి. నేనుతప్ప వాళ్ళను చూచే వారెవరూ లేరు" అన్నాను.

ఈ మాటలు చెబుతుండగా నాకళ్ళవెంట నీరు కారింది. తూరయా కళ్లుగూడా పొడిగా లేవు. తన దుఃఖాన్నాపుకొంటూ తూరయా "అయితే నీవారెవరూ లేరా? పిల్లలు ఒంటరిగా వున్నారు. పాపం! ఏడుస్తుంటారు" అన్నది.

నేను లోలోన సంతోషిస్తూ "అవును. ఏడుస్తుంటారు. ఏడ్చిఏడ్చి ప్రాణాలు కూస్తా వదిలేస్తారేమో. ఎవరికి తెలుసు?" అన్నాను.

తూరయా అందుకొని "లేదు. అప్పుడే చనిపోయి వుండరు. మీరెక్కడుంటారు? చెబితే నేను పోయి అన్నీ తెలుసుకొని వస్తాను." అన్నది.

నేను ఇంటి చిరునామా ఇచ్చాను. ఆమె "అక్కడకు నేను చాలాసార్లు పోయి వచ్చాను. బజారునుండి వస్తువులు తీసుకరాను ఎన్నోసార్లు పోయాను. ఇక పోయినప్పుడల్లా మీ పిల్లల సమాచారం తెలుసుకొని వస్తుంటాను" అన్నది.

నేను ఆలోచిస్తూ "ఎప్పుడు పోతావు?" అన్నాను.

"నేను మంగళవారం రాత్రి పోతాను గాని ఏదీ నీవా పాట పాడు" అన్నది.

ఈరోజు నే నెంతో ఉత్సాహంతో పాట ప్రారంభించాను. దాని ప్రభావం తూరయామీద ఎంతగా పడుతుందో యీరోజు చూశాను. ఆమె శరీరం కంపించింది. కళ్లనిండా నీరునిండింది. ముఖం కళావిహీనమయింది. ఆమె వణుకుతూ కూర్చున్నది. ఆమె ఆస్థితిలో వుండటం చూచి నేను మరింత వుత్సాహంతో పాడాను. పాట పూర్తిచేసి—

"తూరయా! నేను చనిపోయిన తరువాత నా సమాచారం పిల్లలకు తెలియజేస్తావా?" అన్నాను.

నా మాటలు తూరయామీద బాగాబాగా పనిచేసినయ్. తూరయా గద్గద స్వరంతో "నేను నీ పిల్లలకోసం నిన్ను వదలి పెడతాను" అన్నది

నేను నిరాశతో "తూరయా! నీవు విడిపించి పంపినా నేను జీవించటం కల్ల. నే నీ అడవిలో దారికొరకు తిరిగి తిరిగి చనిపోతాను. తరువాత నీకుగూడా ఆపద వస్తుంది. నా ప్రాణం రక్షించుకొనేందుకు నిన్ను కష్టాలలో ఇరికించటం నాకిష్టం లేదు." అన్నాను.

"నా కోసరం నీవు విచారించవద్దు. నామీద ఎవరికీ అనుమానం కలుగదు. నేను సర్దారు కుమార్తెను. నేనేది చెబితే అదే అందరూ నమ్ముతుంటారు. నీవు పోయి డబ్బు తప్పకుండా పంపుతావుగదూ ..." అన్నది తూరయా.

నేను సంతోషంతో "తప్పకుండా. తప్పకుండా పంపుతాను" అన్నాను

తూరయా పోతూ పోతూ "అయితే నిన్ను విడుదల చేయిస్తాను" అన్నది.

ఈ సంఘటన తరువాత తూరయా ఎప్పుడూ నా పిల్లల్ని గురించే మాట్లాడుతుండేది. అసద్ ఖాన్! ఈ ఆఫ్రిడీవాళ్ళకు చిన్నపిల్లలంటే చాలా ఇష్టం. భగవంతుడు వారిని కేవలం హింసాత్మక పశువులనుగా చేయక కొంత మానవత్వాన్ని కూడా ఇచ్చాడు.

చివరకు మంగళవారం వచ్చింది. సర్దారు తిరిగిరాలేదు. ఆ గుంపులోనివారెవరూ రాలేదు. ఆరోజు సాయంకాలం తూరయా వచ్చి "ఖైదీ! ఇక నేను పోలేను. మానాన్న ఇంతవరకు రాలేదు. ఆయన రేపుకూడా రాకపోతే ఆ రాత్రే నిన్ను విడిపించేస్తాను. నీవు నీ పిల్లలదగ్గరకు పో. ఇదిగో చూడు! డబ్బు పంపించటం మాత్రం మరచిపోవద్దు. నేను నిన్ను పూర్తిగా నమ్ముతున్నాను." అన్నది.

నేనారోజు చాలా సంతోషంగా పాట పాడాను. అర్ధరాత్రివరకు తూరయా పాట వింటూనే వున్నది. తరువాత నిద్రపోవటానికి వెళ్లిపోయింది. నేను మనసులో రేపు కూడా సర్దారును రాకుండా చెయ్యమని భగవంతుణ్ణి ప్రార్థించాను. మంచానికి కట్టివేయబడినందువల్ల నా కాళ్లు కొయ్యబారిపోయినయ్. శరీరమంతా నొప్పి పుడుతున్నది. దీనికంటే నరకలోకంలో పెట్టే యాతనే కొంత మేలుగా వుంటుంది. అక్కడ కాళ్ళుచేతులు కదలిస్తు నయినా వుండవచ్చు.

మరునటిరోజుగూడా గుంపు తిరిగి రాలేదు. ఆరోజు తూరయా చాలా చింతిస్తూ వున్నది. సాయంకాలానికి నా కాళ్లు విప్పేసి "ఖైదీ! ఇక నీవు వెళ్లిపో. పద. నేను కొంతదూరం పంపించి వస్తాను." అన్నది

కొంతసేపు నేను నిల్చుండలేక పడివున్నాను. కొద్దిసేపటిలో నాకాళ్లు బాగయినయ్. భగవంతుడికి ధన్యవాదాలర్పిస్తూ తూరయా వెంట సాగిపోయాను.

తూరయాను సంతోషపెట్టటానికి నేను త్రోవపొడుగునా పాట పాడుతునే వున్నాను. ఆమె మాటిమాటికి ఏడుస్తుంది. అర్ధరాత్రికి కొండదగ్గరకు చేరాము. అక్కడికి పోయిన తరువాత "ఇక్కడినుండి సరాసరి వెళ్లు. పెషావర్ చేరిపోతావు. చూడు. చాలా జాగ్రతగా వెళ్లాలి. లేకపోతే ఎవరి తుపాకికయినా ఎర అయిపోతావు. ఇదిగో నీకు సెలవు. డబ్బు తప్పకుండా పంపించాలి. నేను పూర్తిగా నిన్ను నమ్ముతున్నాను. డబ్బు పంపకపోతే నా ప్రాణాలు పోతై. నిన్నుగూడా బ్రతకనివ్వరు. డబ్బు పంపించిన తరువాతయే ఆఫ్రిడీ వాడూ నీపైకి చేయెత్తడు. నీవు వారిలో ఎవరినయినా చంపినాసరే, నిన్నెవరూ ఏమీ అనరు. భగవంతుడు నిన్ను రక్షించుగాక. కుశలంగా పిల్లలదగ్గర చేరు వెళ్లు." అన్నది.

తూరయా ఆగకుండా వడివడిగా నడచిపోయింది. అర్ధరాత్రి గడచిపోయింది. నాలుగుప్రక్కలా భయంకరమయిన నిశ్శబ్దం వ్యాపించి వున్నది. గాలిమాత్రం కొద్దిగా ధ్వనిచేస్తున్నది. ఆకాశంమధ్యలో చంద్రుడు పదహారు కళలతో ప్రకాశిస్తున్నాడు. నేను నెమ్మదిగా అతి జాగ్రతతో ఎవరికంటబడకుండా తెల్లవారు ఝాముకల్లా ఇల్లుజేరాను

నేను వచ్చినసమాచారం తెలుసుకొని నాస్నేహితులందరూ వచ్చారు. లెఫ్టినెంట్ కర్నల్ హేమిల్టన్ గారుకూడా వచ్చారు. ఆయన సంతోషాన్ని ప్రకటిస్తూ—

"హిమ్మత్ సింగ్! నీవు వ్రాసినవుత్తరం కూడా చేరింది. అది ఎవరో మోసం చేయటానికి వ్రాసి వుంటారని డబ్బు పంపలేదు." అన్నాడు.

"భగవంతుడిదయవల్ల బ్రతికి బయటపడ్డాను." అని సమాధానమిచ్చాను.

నేను కర్నల్ గారికి ధన్యవాదాలర్పించాను. "నల్లవాడు వ్రాసిందిగనక మోసంగా

కనిపించింది. అదే తెల్లవాడయినట్లయితే రెండేమిటి నాలుగు వేలు చేరిపోయేవి. ఎన్నో గ్రామాలు కాల్చేసేవాళ్లు. ఇంకా ఏమేం చేసేవాళ్లో ఎవరికి తెలుసు." అని నాలో నేననుకున్నాను.

ఇంటిదగ్గర పిల్లల్ని సురక్షితంగా చూచి నా ఆత్మ సంతోషపడ్డది. ఆ రోజే ఒక నమ్మకస్థుడయిన సేవకుడిద్వారా తూరయా కివ్వమని రెండు వేల రూపాయలూ పంపించాను.

సర్దారు ఒక నిట్టూర్పు వదలి—

అసద్ ఖాఁ! అప్పుడే కథ పూర్తి కాలేదు. దుఃఖాంతభాగం మిగిలే వున్నది. ఇల్లు చేరిన తరువాత నే ననుభవించిన కష్టాల నన్నిటిని మరచిపోయాను గాని తూరయాను మాత్రం మరచిపోలేకపోయాను. తూరయా దయవల్లనే నేను నా భార్యాబిడ్డల్ని కలుసుకోగలిగాను. అంతేకాదు. ఆమె నా ప్రాణం కాపాడింది. ఎట్లా మరచిపోగలను!

కొన్ని నెలలు—సంవత్సరాలు గడిచినయ్. నేను తూరయాను గాని, ఆమె తండ్రిని గాని చూడటం తటస్థపడలేదు. తూరయా వస్తాననికూడా చెప్పింది గాని రాలేదు. అక్కడినుండి వచ్చిన తరువాత నా భార్యను పుట్టింటికి పంపేశాను. ఎందువల్లనంటే, ఒకవేళ తూరయా వస్తే నే నబద్ధమాడినవాడి నయిపోతాను. మూడు సంవత్సరాలు గడిచిపోయినా తూరయా రానందువల్ల నిర్భయంగా నా భార్యను తీసుకొచ్చాను. మేము సుఖంగా కాలం గడుపుతున్నాము. మధ్యలో దుర్దశ సంప్రాప్తమయినది.

ఒకరోజు సాయంత్రం ఈ వరండాలోనే కూర్చొని నా భార్యతో ఏదో మాట్లాడుతున్నాను. ఎవరో తలుపు కొట్టిన చప్పుడయింది. నౌకరు తలుపు తెరిచాడు. నిర్భయంగా ఒక కాబూలీయువతి మెట్లెక్కి లోపలికి వచ్చింది. ఆమె వరండాలోకి వచ్చి శుద్ధమయిన పశ్తో భాషలో "సర్దారుగా రెక్కడున్నారు?" అన్నది.

నేను "ఎవరు నువ్వు? యేం కావాలి?" అనడిగాను.

ఆ యువతి కొన్ని ద్రాక్షపండ్లను చూపుతూ "ద్రాక్షపళ్లమ్మటానికి వచ్చాను. కొంటారా?" అన్నది.

ఆమె పెద్దపెద్ద పండ్లుతీసి టేబులుమీద పెట్టింది.

నా భార్య ద్రాక్షపండ్ల గుత్తిని చేతిలోకి తీసుకొని చూడటం ఆరంభించింది అభిలాషతో. ఆ కాబూలీ యువతి "బాబూ! ఆమె మీ కేం కావాలి?" అన్నది.

నేను "నా భార్య. ఇంకెవరు?" అని సమాధానమిచ్చాను.

ఆ కాబూలీ స్త్రీ "మీ భార్య చనిపోయింది గదా! రెండో పెళ్లి చేసుకున్నారా?" అన్నది.

నేను రోషంతో "నోర్ముయ్! తెలివి తక్కువదానా! నీవేమయినా దయ్యానివా!" అన్నాను.

నా భార్యకు పశ్తోభాష తెలియదు. తన్మయత్వంతో ద్రాక్షపండ్లను చూస్తున్నది మా సంభాషణతో తనకు సంబంధం లేనట్లుగా!

నామాటలు వినేసరికి ఎందుకో ఆ కాబూలీ స్త్రీ కళ్లు మెరిసినయ్. ఆమె చాలా కోపంగా "అవును తెలివితక్కువదాన్ని కాకపోతే నిన్నెందుకు వదిలేస్తాను? చూడ వయ్యా పెద్దమనిషి! నాతో అబద్ధమాడావు. చూడు. నీభార్య అప్పుడు చనిపోకపోతే యిప్పుడు చనిపోతుంది" అంటూ నే మెరుపులాగా ఒక కత్తిని నా భార్య గుండెల్లో గ్రుచ్చేసింది. నే నామెను పట్టుకుందామని ముందుకు పోయాను. ఒక్క గంతులో ఇంటినుంగుకు పోయి నిలుచున్నది. "ఇప్పుడు తెలిసిందా! నేను తూరయాను. ఈరోజు నీ ఇంట్లో వుండటానికి వచ్చాను నిన్ను పెండ్లి చేసుకొని నీదాని నయివుండేదాన్ని. నేను నీకోసం, తండ్రిని, ఇంటిని, అన్నిటినీ వదిలేశాను. ఈ రోజు నుండి నీపేరు జెప్పుకొని యేడుస్తాను." ఈ మాటలు అని ఆమె వేగంగా వెళ్లిపోయింది.

నేను నాభార్య సమీపానికి పోయాను. కత్తి గుండెల్లోకి బాగా చొచ్చుకుపోయింది. ఒక్కపోటుతోనే ఆమెపని పూర్తయిపోయింది. డాక్టరును పిలిపించాను. ఆమె చనిపోయింది

చెప్పుతుండగానే సర్దారు కళ్ళవెంట నీరు కారింది. తడికండ్లను తుడుచుకొని "అసద్ ఖాఁ! తూరయా ఇంత భయంకరమయిన ఆడదని కలలోగూడా అనుకోలేదు. ఆమెను మొదటిలోనే గుర్తుబట్టి వున్నట్లయితే ఇంత పని జరిగేదిగాదు. ఇంట్లో చీకటిగా వున్నది. అదీగాక ఆమెను గూర్చిన ఆలోచన గూడా లేకపోయింది." అన్నాడు.

అప్పటినుండి తూరయా తిరిగి రాలేదు ఎప్పుడయినా నన్నుచూస్తే పాములాగా బుసకొడుతూ వెళ్లిపోతుంది. నా స్మృతి తప్పిపోతుంది. ఆమెను చూచి నాహృదయం కంపించిపోతుంది. ఆమెను పట్టిద్దామని ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని ఆమెను చూడగానే నాలో చేతనత్వం నశించిపోతుంది. చేతులుకాళ్ళు స్వాధీనం తప్పిపోతయ్. నా ధైర్యమంతా గాలిగా అయిపోతుంది.

ఇంతేగాదు. తురయా ఇప్పటికీ నన్ను ప్రేమిస్తున్నది. నాపిల్లలకు అప్పుడప్పుడు యేదో ఒక అమూల్యమయిన వస్తువు యిచ్చిపోతుంటుంది. పిల్లలామెకు కనిపించకపోతే ఇంట్లోకి విసిరేసిపోతుంది. ఆ వస్తువులకు ఒక కాగితంచుట్టి దానిలో "సర్దారుగారి బిడ్డలకు" అని వ్రాసి మరీవేస్తుంది.

ఈయువతిని నే నింతవరకు అర్థం చేసుకోలేకపోయాను. అర్థం చేసుకోవాలని ఎంత గట్టిగా ప్రయత్నించినా కఠినమయిపోతున్నది. ఈమె మనిషో రాక్షసో తెలీటంలేదు

ఈ సమయానికే సర్దారుగారి పిల్లలు "నాన్నా! ఇదిగో చూడండి! ఆ మనిషే నాకీ బంగారు తాయిత్తు యిచ్చిపోయింది." అంటూ వచ్చారు.

సర్దారుగారు నావంక తిరిగి "అదిగో! అసద్ ఖాఁ! నే చెప్పలా? అర్జున్ కునిపోల్‌కు ఇట్లాగే ఎన్ని తాయిత్తులు ఇంకా ఇతర వస్తువులు ఇచ్చిందో లెక్కలేదు ఇందువల్లనే తూరయా ఒక విచిత్రమయిన స్త్రీ అంటున్నాను.

## 4

సర్దారుగారిదగ్గర శలవుదీసుకొని నేను ఇంటికి నడిచాను. చౌరస్తానుండి ముసలివాడి శరీరాన్ని తొలగించారు కాని ఆ ప్రదేశాన్ని సమీపించటంతోనే నా శరీరం పులకించింది. నే నక్కడ ఒక నిముషం సేపు నించొని వుండిపోయాను. అనుకోకుండా వెనక్కు తిరిగిచూచాను. నీడలాగా ఒక స్త్రీ నా వెనువెంటనే వస్తున్నది. నేను నించోటం చూచి ఆమె గూడా ఆగిపోయింది. ఒక దుకాణంలో యేదో కొంటున్నట్లు నటిస్తున్నది.

నేను నా హృదయాన్ని ప్రశ్నించాను. "ఆమె తూరయాయేనా?" హృదయం సమాధానమిచ్చింది "బహుశా అయివుండవచ్చు"

తూరయా నా వెంటాడుతున్న దెందుకు? ఈ విషయమే ఆలోచిస్తూ ఇల్లు జేరాను. అన్నంతిని పడుకున్నాను. ఈరోజు జరిగిన సంఘటన ప్రభావం నన్ను నిద్రపోనివ్వలేదు నిద్రపోదామని ఎంత గట్టి ప్రయత్నంచేస్తే అది అంత దూరమైపోతున్నది. గడియారం పన్నెండు కొట్టింది. ఒకటి కొట్టింది. రెండు కొట్టింది. కాని నిద్ర రాలేదు ప్రక్కలు మారుస్తూ నిద్ర రప్పించుకొనే ప్రయత్నంలో వున్నాను. ఈ అయోమయావస్థలో నిద్ర నన్నెప్పుడావరించిందో నాకే తెలియదు.

నేను నిద్రబోతున్నా నా మనసు పని జేస్తూనే వున్నది. తూరయాలాంటి మనిషే-

ంతకంటె భయంకరంగావున్న మనిషి తలుపులు పగలగొట్టి లోపలికొచ్చినట్లనిపించింది. ఆమె చేతిలో ఒక పదునయిన కత్తి వున్నది. అది దీపపు కాంతిలో మెరుస్తున్నది. ఆమె నెమ్మదిగా అడుగులు వేస్తూ - తేలికగా నాదగ్గరకు వస్తున్నది. నేనామెను చూచి లేద్దామనుకుంటానుగాని నా కాళ్లు చేతులు నా వశంలో లేవు. వాటిలో ప్రాణమే లేనట్లుగా అయిపోయింది. ఆ స్త్రీ నన్ను సమీపించింది. నన్ను కొద్దిసేపు పరీక్షించి చూచి కత్తివున్న చేతిని పైకెత్తింది. నేను అరవటానికి ప్రయత్నించాను గాని నా స్వరం కట్టుబడిపోయింది. నా రెండుచేతులను తన రెండు మోకాళ్ళ క్రింద అణచిపెట్టి నా రొమ్ములమీద సవారి జేస్తున్నది. నేను తబ్బిబ్బయిపోయి కళ్లు తెరచాను. నిజంగానే ఒక కాబూలీ స్త్రీ నా గుండెలమీద సవారి జేస్తూవున్నది. ఆమె చేతిలో కత్తి వున్నది. నిజంగా పొడవటానికే సిద్ధంగా వున్నది.

"నేను - "ఎవరు? తూరయా!" అన్నాను గట్టిగా.

ఆమె నా స్వతంగా తూరయాయే. నన్ను బాగా అణచిపెడుతూ "ఆఁ! నేను తూరయానే! ఇవాళ నీవు నా తండ్రిని చంపావు. దానికి బదులుగా నీవు చావబోతున్నావు." అని గర్జించింది.

ఈ మాటలని కత్తిని పైకెత్తింది. ఇప్పుడు నాముందు జీవన్మరణ సమస్య వచ్చి కూర్చున్నది. ప్రాణంమీది తీపి నాలో ధైర్యాన్ని నింపింది. నేను చావటానికి సిద్ధంగా లేను. నా జీవితంలో నెరవేరాల్సిన పనులు, కోరికలు ఎన్నో వున్నయ్. నేను బలాన్నంతా వినియోగించి కుడిచేతిని విడిపించుకోటానికి ప్రయత్నించాను. ఒక్క లాగు లాగేసరికి నా చెయ్యి పట్టు తప్పించుకొన్నది. నా శక్తి నంతటిని వుపయోగించి కత్తివున్న తూరయా చేతిని పట్టుకున్నాను. తూరయా ఎందుకు ప్రతిఘటించలేదో తెలియదు. నా చేతిని చూడగానే నా రొమ్ములమీదినుండి దిగింది. ఆమె పెద్ద కళ్లు వాలకుండా నా చేతిని చూస్తున్నయ్.

నేను నవ్వి "తూరయా! ఇప్పుడు చెక్క తిరిగిపోయింది. ఇక నీవు చావటం మిగిలి వున్నది. నీ తండ్రిని చంపాను. నిన్ను గూడా చంపబోతున్నాను." అన్నాను.

తూరయా కళ్లార్పకుండా నా చేతిని చూస్తూనేవున్నది. ఆమె యే సమాధానమూ చెప్పలేదు. నేనామెను గద్దిస్తూ "చెప్పవేఁ? ఇప్పుడు నీ ప్రాణం నా చేతుల్లో వున్నది." అన్నాను.

తూరయాను ఆవరించిన మైకం తొలగిపోయింది. ఆమె దృఢస్వరంతో "నీవు నా సహోదరుడివి. నీ తండ్రినే చంపేశావు యీ రోజు." అన్నది.

తూరయా మాటలువిన్న తరువాత గూడా నాకు నవ్వు వచ్చింది. నేను నవ్వుతూ అన్నాను "అఫ్రిడీవాళ్ళకు మోసంగూడా తెలుసునని యీరోజా తెలుసుకున్నాను."

తూరయా శాంతస్వరంతో అన్నది. "నీవు నా తప్పిపోయిన అన్న 'నాజిర్'వి. నీ చేతిలోని ఆ గుర్తే—ఆ గుర్తె నీవు నా తప్పిపోయిన అన్నవని తెలియజేస్తున్నది. చిన్నతనంనుండి చేతిలో ఒక పాము బొమ్మ వున్నది. దీనినే సైన్యంలో ఆనవాలుగా వ్రాసుకున్నారు."

నేను నవ్వుతూ అన్నాను. "తూరయా! నీవు నన్ను మరపించలేవు. నిన్ను నే నిప్పుడు యేవిధంగానూ, వదలను."

తూరయా తన చేతిలోని కత్తిని విసిరి పారేసి "నిజంగా నీవు నా అన్నవే, ఇంకా నమ్మకం లేకపోతే చూడు. నా కుడి చేతిలో గూడా అట్లాంటి పాముబొమ్మే వున్నది.

నేను తూరయా చేతిమీది బొమ్మను చూచాను. అది గూడా నా చేతిమీద వున్న పాము బొమ్మే సరిగ్గా.

నేను కొంచెము ఆలోచిస్తూ "తూరయా! నేను నిన్ను నమ్మలేను. ఇది వంశానికి సంబంధించిన మాట." అన్నాను.

తూరయా "నా చేతిని వదలు. నేను నీ మీదకు రాను. అఫ్రిడీవాళ్లు అబద్ధమాడరు." అన్నది.

నేనామె చేతిని వదిలాను. ఆమె నేలమీద కూర్చొని నావంక చూస్తున్నది. చాలసేపయిన తరువాత "సరే! నీకు నీ తల్లిదండ్రులను గురించి తెలుసా?" అని ప్రశ్నించింది. నేను లేదని తల వూపుతూ సమాధానమిచ్చాను. "నేను అనాథ శరణాలయంలో పెరిగాను."

నా మాటలు విని తూరయా నించున్నది. అయితే నీవు నా తప్పిపోయిన నాజిర్ అన్నవే! నేను పుట్టటానికి పూర్వం ఒక సంవత్సరమప్పుడు నీవు తప్పిపోయావు. నా తల్లిదండ్రు లప్పుడు ప్రభుత్వ సైన్యాలమీద జరిగే దాడిలో పాల్గొటానికి వచ్చారు. అప్పుడు నీవు గూడా వారితోపాటే వున్నావు. అమ్మ యుద్ధం చేయటంలో నేర్పరి. నిన్ను వీపుకు కట్టుకొని యుద్ధం చేస్తున్నది. ఆ సమయంలో ఆమె కాలికి తుపాకిగుండు తగిలి తెలివితప్పి క్రింద పడిపోయింది. అప్పుడే నిన్నెవరో వీపునుండి విప్పుకుపోయారు. నాన్న అమ్మను భుజాలమీదవేసుకొని తీసుకొచ్చాడు. అప్పుడే నిన్ను వెదికించలేకపోయారు. తరువాత ఎంతోమందిని అడిగారు. ఎంత ఆరాతీసినా నీ జాడ దొరకలేదు. అమ్మ తరచుగా నిన్నుగురించి చెబుతుండేది. ఆమె చేతిమీదగూడా ఇలాంటి గుర్తే వున్నది.

ఆమె మరలా ఆ చేతినే నాకు చూపించింది. నేను నా చేతిమీది పాముతో ఆమె చేతిమీద వున్న పామును సరిపోల్చి చూచాను. రెండుపాములూ సరిగా ఒకటే మాదిరిగా వున్నయ్. వెంట్రుకలో నూరోవంతు భేదం గూడా లేదు. నేను హతాశుడనయిపోయి మంచంమీద కూలబడ్డాను.

తూరయా నా ప్రక్కనే కూర్చొని ఎంతో ప్రేమతో నా ముఖంమీది చెమటను తుడిచింది. "నాజిర్! నీవు చచ్చిపోలేదు. బతికేవున్నావని అమ్మ చెబుతుండేది. నీవు తప్పకుండా యేదో ఒకరోజు కనిపిస్తావంటుండేది!" అన్నది.

తూరయామాటలమీద నాకు నమ్మకం కుదిరింది. నా హృదయంలో ఎవరో కూర్చొని చెబుతున్నట్లుగావున్నది: తూరయా చెప్పే మాటలన్నీ నిజమేనని! నేను దీర్ఘనిశ్వాసాన్ని వదులుతూ "యేఁ! తూరయా! నేనీ రోజు నా తండ్రినే చంపానా?" అని అడిగాను.

తూరయాముఖం దుఃఖంతో నల్లబడిపోయింది. గద్గదస్వరంతో "అవును నాజిర్! ఆ అభాగ్యుడు మన తండ్రే. కన్న కుమారుని చేతుల్లోనే చావాలని వ్రాసిపెట్టి వున్నది. ఎవరికి తెలుసు?" అన్నది.

నన్ను ఓదారుస్తూ "కాని నాజిర్! నీవు తెలియకుండా ఆపని చేశావు. నాన్న చనిపోయింతరువాత నేను వంటరిదాన్నయిపోయాను. ఇప్పుడు నీవు తోడు దొరికావు. తండ్రిలేని దుఃఖాన్ని నిన్నుచూచి కొంతవరకు పోగొట్టుకుంటాను. నాజిర్! నీవు దుఃఖించవద్దు. తండ్రెవరో, తల్లెవరో నీకేం తెలుసు. నేనే నిన్ను చంపటానికి


రాజూ - పేద

వెల రు. 2-0-0

ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు-1

కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

రెండు భాగములు

ఒక్కొక్క భాగం

వెల రూ. 3-8-0

పోస్టుఖర్చు ప్రత్యేకం.

ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు-1.

చ్చాను చూడు. నిన్ను చంపేదాన్నే.
గవంతుడి దయవల్ల మన వంశపు కుర్తును
హించాను. భగవంతుడుయీ విధంగా జర
గాలని వ్రాసిపెట్టి వున్నాడు." అన్నది.

ఒక అఫ్రిడీ సమూహానికి నాయకుడయిన
ా తండ్రిపేరు హైదర్ ఖాఁ; అని
ూరయా చెప్పగా విన్నాను. సర్దార్
ాఘ్మత్ సింగుని గురించి గూడా అడిగాను.
ామె అతడిని ప్రేమిస్తున్నదీ. కాబూలీ
స్త్రీవేషం వేసుకుపోయి అతిడి దగ్గర యేదో
మాషా చేద్దామనుకొన్నది. కాని ఘటనా
క్రం వేరే దిశలో తిరిగింది.

నేను సర్దారుగారిదళనుగురించి చెప్పాను.
ని కొంచెంసేపు ఆలోచించి అన్నది.
లేదు. ఆ మనిషి మోసగాడు. అబద్ధాలాడు
ాడు. నేనతనిని పెండ్లిచేసుకోను. నిన్ను
ాచుకొంటూ అన్నీ మరచిపోతాను. రేపు
యన పిల్లల్ని తీసుకరా. నేను ప్రేమిస్తాను"

ఉదయమే తూరయాను చూచి నౌకరు
శ్చర్యపోయాడు. ఆమె నా స్వంత చెల్లె
ి చెప్పాను. అతడికి నామాటలమీద
మ్మకం కలగలేదు. అప్పుడు నేను పవిస్త
ాగా అన్ని విషయాలు చెప్పినా తండ్రి
రం ఎక్కడుందో వగికి తెలిసికొని
మ్మని పంపాను. వాడు వచ్చి "శవం ఇంకా
లీసుస్టేషనులోనే వున్న"దని చెప్పాడు.

నేను పెద్దయ్యగారిపేర ఒక వుత్తరం వ్రాసి దాంట్లో అన్ని సంగతులు తెలియబరిచాను శవం ఇప్పించమని కోరాను. వెంటనే దొరగారిదగ్గరనుండి అంగీకారం వచ్చింది. ఒక వుత్తరం వ్రాసి మేజరు గారిని పిలిపించాను.

ఆయన వచ్చారు "విషయమేమిటి అసద్! ఇంతతొందరగా రమ్మని ఎందుకు వ్రాశావు?" అన్నారు. నేను నవ్వుతూ "మేజర్ గారూ! నా పేరు అసద్ గాదు. నా అసలు పేరు నాజిర్!" అన్నాను.

"ఒక్క రాత్రిలోనే పిచ్చివాడివయిపోయావా?" అన్నాడాయన ఆశ్చర్యంతో నావంక చూస్తూ.

నేను నవ్వుతూ అన్నాను "లేదండి సర్దారుగారు. ఇంకా వినండి. తూరయా నా చెల్లెలు. నేను నిన్న చంపినాయన నా తండ్రి."

సర్దారుగారు నామాట వినేసరికి ఆకాశం నుండి క్రింద పడినట్లయిపోయారు. ఆయన కళ్లు తలకెక్కినయ్. "యేఁ అసద్! నన్ను గూడా పిచ్చివాడిని చేయాలని చూస్తున్నావా?" అన్నాడు.

నే నాయన చెయ్యిపట్టుకొని "రండి ఆ మాటలు తూరయా నోటికుండానే విందురుగాని. తూరయా నా దగ్గరే వున్నది. మీ రాకకోసం ఎదురుజూస్తున్నది." అన్నాను.

సర్దారుగారిని కూచోబెట్టి అంతా చెప్పాను. కథంతా విని "నాజిర్! ఇక నిన్ను నాజిర్ అనే పిలుస్తాను. తూరయాను నా కిమ్మని నిన్నడుగుతున్నాను. నే నామెను వివాహం చేసుకుంటాను." అన్నాడు.

నేను నవ్వుతూ "మేము మహమ్మదీయులము మీరు హిందువులు గదా?" అన్నాను.

సర్దారు "సిపాయీలకు మతం గితం ఏమీ లేదు." అన్నారు.

తూరయా అందుకున్నది. "సర్దారుగారూ నేను మిమ్మల్ని పెండ్లిచేసుకోను. మీ బిడ్డలను నా దగ్గరకు పంపితే మాత్రం వారికి తల్లిగా వుంటాను."

సర్దారుగారు నవ్వుతూ వెళ్ళిపోయారు. ఆరోజు సాయంత్రమే మా సర్దారుగారు, తూరయా, ఇంకా కొంతమంది సిపాయిలు, నేను కలసిపోయి మా తండ్రిశవాన్ని సమాధి చేశాము.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. మెల్ల మెల్లగా చీకటి వ్యాపిస్తున్నది. మేమిద్దరం, నేను, తూరయా, మా తండ్రిసమాధిదగ్గర ప్రార్థన చేస్తూవున్నాము. ★


# రెండు మహానగరాలు

మూలం : చార్లెస్ డికెన్స్

**అనువాదకులు :**

## శ్రీ తెన్నేటి సూరి

అది ఒక వైభవోజ్వల మహాయుగం—వల్లకాటి అధ్వాన్న శకం; వెల్లి విరిసిన విజ్ఞానం—బ్రహ్మ జెముడులా అజ్ఞానం; ఆశాకుసుమాలు పుష్పించిన ఆమధురవసంతం—నైరాశ్యపు చలిగుబుళ్లు యీమకున్న శిశిరాస్యం; సర్వసంపత్సమృద్ధి—సర్వతోముఖ క్షామం; సూక్ష్మంగా చెప్పాలంటే—నేటి పరిస్థితికి నకలుగా వుందినాటి పరిస్థితి.

అలాంటి కల్లోలదినాలలో లండన్ పారిస్ నగరాలను రెంటినీ పెనవేసుకుని సాగిన ప్రణయబలిదాన గాథ; ఆంగ్ల నవలా ప్రపంచ నిర్మాత చార్లెస్ డికెన్సు ప్రతిభా సంపత్తులు వెల్లివిరిసిపోయిన ''టేల్ ఆఫ్ టూ సిటీస్'' అనే 'క్లాసికల్' నవలకు అనువాదం.

**ఆంధ్రగ్రంథమాల, మదరాసు-1.**




జి.సి. రామకృష్ణ

(గత సంచిక తరువాయి)

## 5

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారైన కామేశ్వరరావు పంతులుగారికి తెలియని విషయం ప్రపంచంలో ఏదీలేదు. ఆయన కవిత్వం చెప్పగలడు. సంగీతం పాడగలడు. పదిమంది రచ్చటరుగుమీద కూర్చొని మాట్లాడుకొనేటపుడు రాజకీయాలుగూడ దివ్యంగా ఉపన్యసించగలడు.

దేవాలయ ధర్మకర్తగారి భార్య సావిత్రమ్మకు, సంగీత సాహిత్యాలపై చాలా మక్కువ. కామేశ్వరరావుగారితో సావిత్రమ్మ ఎక్కువగా మాట్లాడేదికాదు. ఎప్పుడన్నా కొంచెం అవకాశం దొరికిందంటే కామేశ్వరరావుగారు సంగీత సాహిత్యాలలో తన ప్రతిభను ఆమెఎదుట ప్రదర్శించేవాడు.

ఆమె చదివింది వీధిబళ్లో అయిదోతరగతి వరకే. ధనవంతుల కుటుంబం కావడంచేత ఆమెకు ఇంట్లో చాకిరి ఎక్కువగా ఉండదు. అయినా, ఆమె తన భర్తకు యిష్టమైన కూరలు దాసీమనిషిచేత చేయించేదికాదు; తనే స్వయంగా చేసేది.

సావిత్రమ్మ తీరికసమయాల్లో ఏవైనా పుస్తకాలు చదువుకుంటూ ఉండేది. భారతం, భాగవతం, రామాయణం, మనుచరిత్ర, నైషధం, మొదలైన గ్రంథాలు ఆమె భర్తను బతిమాలి తెప్పించుకొంది భార్యకు 'పుస్తకాలపిచ్చి' ఎక్కువ అని తెలుసుకొని రామిరెడ్డిగారు నెల్లూరికి వెళ్ళినపుడు ఆయనకు జ్ఞాపకమున్నపుడల్లా ఏవో పుస్తకాలు తప్పకుండా తెస్తుండేవాడు. రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, వేదుల, విశ్వనాథ సత్యనారాయణ, జాషువా, దేవులపల్లి మొదలైన ఆధునిక కవుల గ్రంథాలన్నీ ఆమె చదివింది. ఆమె కాలక్షేపంకోసమే చదివేది. ఏవైనా పద్యాలు అర్థంకాకపోయినా ఆమె తెలుసుకోవాలని తంటాలుపడేది కాదు. పద్యాలు చదవడానికి ఇంపుగాఉంటే, మళ్లీ తీరిక ఉన్నప్పుడెప్పుడైనా చదువుతూ ఉండేది.

ఆమెచేత మెప్పుపొందాలని కామేశ్వరరావుగారు ఎన్నో అవస్థలు పడ్డారు.– ఒకరోజు ఆమె చదువుకుంటూ కుర్చీలో కూర్చొని ఉండగా, కామేశ్వరరావుగారు మెల్లగా ప్రవేశించారు. ఆయన సంగీతకళారాధకుడు కావడంవల్ల, ఏదో ఒకపాట ఎప్పుడూ మూలుగుతూనే ఉండేవాడు. ఆపాట వినిపించగానే సావిత్రమ్మ నిల్చుంది.

కామేశ్వరరావు లోపలికొచ్చి,

“కూర్చొండమ్మా ఫరవాలేదు” అని వినయం నటిస్తూ నవ్వి,

“మీకు కవిత్వం అంటే చాలా పిచ్చి ఉన్నట్లుందే!” అన్నాడు. ఆమె బలవంతంగా చిరునవ్వునవ్వి, “ఏదో కాలక్షేపం కోసమేలెండి” అని తల వంచుకొని పుస్తకం చదువుకోసాగింది. ఆమె చెప్పిన జవాబుతో కామేశ్వరరావుగారు సంతృప్తిపడలేదు.

“అది ఏమి గ్రంథమండీ?” అని కవిత్వశైలిలో అడిగాడు. ఆమె పుస్తకం అట్టవైపు చూచి, “రెడ్డిగారు ఈ మధ్యనే తెచ్చారండి. విజయశ్రీ, కరుణశ్రీగారు రాశారట” అని ఆమె వంచినతల ఎత్తలేదు.

ఇల్లు మారుమ్రోగేట్లు నవ్వేడు కామేశ్వరరావుగారు. ఆమె గభాలున భయపడి ఆయనవంక ఆశ్చర్యంగా చూచింది.

“శ్రీలు బయలుదేరారండీ! శ్రీలు. ఈయన్నిబట్టి రకరకాల శ్రీలు. అందరూ కవిత్వం వ్రాసేవారే—కవిత్వం అంటే ఏమిటో తెలియకపోయినా” అన్నాడు.

ఆయనతరహా చూచి సావిత్రమ్మకు ఒళ్లు భగ్గున మండింది. కానీ ఆమె ఒక్కమాటైనా మాట్లాడకుండా ఏదో పని ఉన్నట్లు వంటఇంటివైపు చూచి, అక్కడ నుండి లేచి వెళ్ళిపోయింది. కామేశ్వరరావు ముఖం వెలవెలపోయింది. ఆమెకు కవిత్వం అంటే యిష్టం కాబట్టి, ఆమెతో కవిత్వచర్చ ప్రారంభించి ఆమె మెప్పు ఆదరణలు సంపాదించుకోవాలనుకున్నాడు. కానీ ఆమె నిర్లక్ష్యంగా వెళ్లిపోయేసరికి భంగపడ్డాడు.

కామేశ్వరరావుగారు తను పది సంవత్సరాల క్రితం, పెళ్ళి కాకముందు రాసిన శృంగారకవిత్వం ఆమెకు చూపించి ఆమె మెప్పు పొందాలని, ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని అతని కోరిక ఎన్నాళ్ళకూ ఫలించనే లేదు.

కామేశ్వరరావుగార్ని చూడగానే సావిత్రమ్మ పెద్దపులిని చూస్తే భయపడినట్లు భయపడి రివ్వున లోపలికి వెళ్తుండేది. అందువల్ల కామేశ్వరరావుగారి శృంగారకవిత్వాన్ని విని ఆనందించే అదృష్టం సావిత్రమ్మకు కలగనేలేదు.

గుమాస్తాగారైన మాధవశాస్త్రిగారితో సావిత్రమ్మ చనువుగా మాట్లాడుతుందని కామేశ్వరరావుగారికి తెలుసు. మాధవశాస్త్రిగారు దద్దమ్మ అని కామేశ్వరరావుగారి ఉద్దేశం. అందువల్ల మాధవశాస్త్రిగారివంటి దద్దమ్మతో సావిత్రమ్మ మాట్లాడడం సాహిత్య, సంగీత కళారాధకుడైన కామేశ్వరరావుగారికి బొత్తిగా యిష్టంలేదు. అయితేమాత్రం ఏం లాభం? ఆయన యిష్ట ప్రకారం ఐశ్వర్యవంతురాలైన ఒక గృహిణి నడుచుకోవాల్సిన అవసరం ఏముంది? మాధవశాస్త్రిగారు సావిత్రమ్మతో మాట్లాడేటపుడు చాలా జాగ్రత్తగా మాట్లాడేవాడు. ఒక యజమానురాలి ఎదుట సేవకుడు ఎంత వినయంగా ఉండాలో, అంత విధేయతతో ప్రవర్తించేవాడు. మాధవశాస్త్రిగారి ప్రవర్తన, సావిత్రమ్మకు ఆయనపై గౌరవం పెంపొందేట్లు చేసింది. అందువల్ల, ఆమె మాధవశాస్త్రితో ఎంతో చనువుగా, ఆప్తురాలివలె మాట్లాడేది. మాధవశాస్త్రిగారు ఒకరికి హానిచేసేవాడు కాడని సావిత్రమ్మకు


అబ్బ! ఒకేజలుబు...భారము...


అమృతాంజనం వాడితే...


తగ్గిపోయింది!

అమృతాంజనము







బాగా తెలుసు. ఆయనవల్ల తనకు ఏవిధమైన అపదా రాదని ఆమెకు బాగా నమ్మకం. అందువల్ల ఆమెఆయనతో స్వేచ్ఛగా మాట్లాడేది - మనుష్యుల్లో ఉండే మంచితనాన్ని నీచుడైనవాడు గ్రహించలేడు. కుత్సిత బుద్ధితో ప్రవర్తించే మనిషికి అందరిలో ఉన్న లోపాలే స్పష్టంగా కనిపిస్తుంటాయి. కామేశ్వరరావుగారు, పూజారివీరభద్రయ్యగారూ దీక్షతో కృషిచేసి, మాధవశాస్త్రి గారికీ సావిత్రమ్మగారికీ అపవాదు అంటగట్టి బాగా ప్రచారం సాగించారు.

పల్లెటూళ్లలో ఏదైనా వార్త ఏదో ఒక మూల ప్రారంభించిందంటే, క్షణం లో గ్రామమంతా ప్రాకిపోతుంది. ఆ వార్తను ఎవరు సృష్టించారో, ఎవరు ప్రసారం ప్రారంభించారో తెలుసుకోవడం చాలా కష్టం.

కామేశ్వరరావుగారికి పూజారిగారు తోడయ్యారు. పూజారిగారికీ మాధవశాస్త్రి గారికీ స్పర్ధలు ప్రారంభమైన తర్వాత, గ్రామంలో తీరికగా ఉండే మనుషులందరికీ కాలక్షేపంగా మాట్లాడుకోడానికి కావలసినంత సమాచారం లభించింది. రచ్చటరుగుల మీద, మంచినీళ్ళ బావులదగ్గర, గ్రామస్థులు పకపక నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ ఉండేవారు.

ఒకనాటి ఉదయం ధర్మకర్తగారైన రామిరెడ్డిగారు నెల్లూరినుండి వచ్చారు. కామేశ్వరరావుగారు ముసిముసి నవ్వులు నవ్వుతూ వచ్చి, రామిరెడ్డిగారికి నమస్కారంచేసి, యోగక్షేమాలు అడుగుతూ, కుర్చీలో కూచున్నారు. రెండుగ్లాసుల్లో కాఫీ తెచ్చి, దాసి టేబిల్ పైపెట్టి వెళ్ళింది.

ఇంతలోగా మాధవశాస్త్రిగారు నెమ్మదిగా వచ్చి చిరునవ్వుతో యజమానిని హెచ్చరించుకొన్నాడు. రామిరెడ్డిగారు ఫకాలున నవ్వి, "ఏం మాధవయ్యా? నువ్వు నెల్లూరి కొస్తావేమో ననుకున్నాను. ఏం చేస్తావుంటావు మాధవయ్యా! పూరికినే ఈ వూళ్లో కూకోనుంటే, నీకైమైనా తోస్తదా?" అన్నాడు.

మాధవయ్య ఆశ్చర్యపడి,

"మీరు రమ్మని చెప్పలేదే! మీరు చెప్పి పోయి ఉంటే, అలాగే వచ్చేవాణ్ణి" అన్నాడు.

"ఆ,...పూరికినే అన్నాలే, నా కెవరున్నారూ, బిడ్డా పాపా. ఎవురున్నా ఉంటే అనుకోవచ్చు. నేను ఎన్ని రోజులు ఇంటికి రాకపోయినా అడిగేవోళ్లు లేరు... ఆ...ఇనకంటాక్సు లెక్కలు పూర్తిచేస్తే బాగుంటది...అయ్యేమన్నా రాశినావా?" అన్నాడు రామిరెడ్డి.

"[illegible]త్రికొచ్చాయండి; రెండుమూడు రోజుల్లో రాసేస్తాను" అని మాధవయ్య, పుస్తకాల బీరువాదగ్గరి కెళ్లాడు.

రామిరెడ్డిగారు స్నానంచేసి వస్తానని ఇంట్లోకెళ్ళాడు. కామేశ్వరరావు మెల్లగా ఆనందభైరవి ఆలాపనచేస్తూ మాధవశాస్త్రిని చూస్తూ కూచున్నాడు.

వీరభద్రయ్యగారు జంధ్యంతిప్పుకుంటూ వచ్చి, కామేశ్వరరావుగారికి నమస్కరించి, "రెడ్డిగా రేరీ?" అన్నాడు.

"ఏరీ?" అన్నాడు కామేశ్వరరావు.

"ఏమిటండీ పంతులుగారు? మీరుకూడా నన్ను పిచ్చివాణ్ణి చేస్తార, నాకింకా కళ్లుపోలేదులెండి. వాకిటముందు కారు నిల్చి ఉంటే! రెడ్డిగారు రాకపోతే కారు వాకిట ఎందుకుంటుందని వచ్చాను" అన్నాడు పూజారి.

కామేశ్వరరావుగారు దొంగచూపులు చూస్తూ వ్యంగ్యంగా నవ్వి, "భద్రయ్యా! అసాధ్యుడివయ్యా కారు వాకిటచూచి రెడ్డిగారొచ్చారని కనిపెట్టేశావన్నమాట. బలే వాడివయ్యా" అన్నాడు.

వారిసంభాషణ మాధవశాస్త్రిగారికి చికాకు పుట్టించింది. ఆయన లెక్కపని సాగలేదు. పుస్తకాలుమూసేసి ఆయన లేచి ఇంటికి వెళ్లాడు. పూజారి మాధవశాస్త్రిపోయినవైపు కొరకొరచూచి "చూచారాండి పంతులుగారు? వాడికెంత నిర్లక్ష్యమో, మీరే చూడండి. అబ్బబ్బ! ఎంత అదృష్టవంతుడయ్యా. క్షణం కూచొని లెక్క రాయడు; రాజభోగంగా జరుపుకుంటున్నాడు" అన్నాడు పూజారి.

ఎవరిమాటలు వాళ్లముందు మాట్లాడడంలో కామేశ్వరరావు అందెవేసినచెయ్యి.

"వాడికసలు లెఖ్ఖ రాయడం చేతొచ్చునా అంట? అన్నీ నన్ను అడుగుతుంటాడు. ఏదో నామకార్థం గుమాస్తా. రెడ్డిగారిదయవల్ల నాలుగు డబ్బులు సంపాదించుకుంటున్నాడు" అన్నాడు కామేశ్వరరావు.

వారిద్దరు గుసగుసలాడుకుంటూ ఉండగా, పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారైన రామసుబ్బారెడ్డిగారు వచ్చారు. కోరలుతిరిగిన మీసాలు, చింకిరితల, ఎఱ్ఱని కండ్లు, ప్రెసిడెంటుగారి వికృతాకారాన్ని ఇనుమడింపచేస్తుంటాయి. ఆ గ్రామంలో పంచాయతీ బోర్డు ఏర్పాటయిననాటినుండీ ఆయనే ప్రెసిడెంటు. ఆయనతో పోటీ చెయ్యడానికి ఎవ్వరికీ ధైర్యం చాలడం లేదు. అందువల్ల శాశ్వతంగా రామసుబ్బారెడ్డిగారే పంచాయతీబోర్డు అధ్యక్షులుగా ఉంటున్నారు.

రామసుబ్బారెడ్డిగారిని చూడగానే

కామేశ్వరరావుగారు, వీరభద్రయ్యగారు భక్తివినయాలతో "దయచేయండి, దయచేయండి" అని ఆహ్వానించారు. ప్రెసిడెంటుగారు, బెంచీమీద కూచుని, "ఎట్టబోయివాడు, రామయ్యా?" అన్నాడు.

"స్నానం చేస్తున్నారండీ" అని కామేశ్వరరావుగారు అవి, గోడనున్న పటాలు కొత్తగా చూచినట్లు చూచి, మెల్లగా లేచి, "వస్తానండీ, మరలా వస్తాను" అని చెప్పి గుట్టుగా వెళ్ళాడు.

ప్రెసిడెంటుగారు వీరభద్రయ్యను చూచి, "ఏంది బద్రయ్యా, మొన్నరాత్రి ఏందో గోలగా యినిపించిందే మీ యింటికాడ?" అన్నాడు. వీరభద్రయ్య అదిరిపోయాడు.

"ఏముంది లెండి; ఒకరి యింటి వ్యవహారాలు పరిష్కరించడానికి వచ్చినవాళ్లు ఏవిధంగా మెలగాలో మీరే చెప్పండి?" అన్నాడు. ఇంతలోగా ధర్మకర్త రామిరెడ్డిగారు స్నానంచేసి ఆ గదిలోకి వచ్చాడు. వీరభద్రయ్య లేచి నిల్చున్నాడు.

ప్రెసిడెంటుగారు పకపక నవ్వి, "అదిగాదు రామయ్యా, నీకు తెల్సునా తెలవదా?" అన్నాడు.

"ఏంది?" అని రామిరెడ్డి అడిగి, "ఏమిటి భద్రయ్యా," అన్నాడు.

వీరభద్రయ్య గడగడలాడుతూ వినయంగా వంగి "మహాప్రభువులు, మీ దయవల్ల ఇంతికాలంనుంచీ యీ గ్రామంలో బ్రతుకుతున్నాను. తమరు నన్ను ఇప్పటికి ఒక్కమాట అని ఎరగరు...ఏమీ లేదండీ,.. పంచాగ సెల పెట్టినతర్వాత మొట్టమొదటి రోజు ప్రసాదం పంచిపెడ్తూ ఉన్నాను. ఊళ్లో జనమంతా ప్రసాదానికి వచ్చారు. మాలపల్లెనుండి గెరటయ్య ఒక వందమంది మాలపిల్లల్ని వెంటబెట్టకొచ్చాడు. అందరూ ఊపిరి తిరక్కుండా నాచుట్టూ చుట్టుకున్నారు. ఒకసారి పెట్టించుకున్నవాళ్లే మళ్ళీ మళ్ళీ అడుగుతూ నన్ను చుట్టుకున్నారు. నాకు వళ్లు మండిపోయి ఒక పిల్లకుంకను ఒక దెబ్బ వేశాను. మాధవయ్య గబగబా వచ్చి, నా చేతులో పళ్ళెం ఒక్కవిసురున లాక్కొని, అందరికీ దోసెడు దోసెడు పంచిపెట్టి, "తీసుకరాక్షపో, పులుసన్నం" అన్నాడు. సరేనని, యింకొక పళ్లెంనిండా పులుసన్నం తీసుకొచ్చి యిచ్చాను. అది మాలపిల్లలందరికీ తన యిష్టంవచ్చినట్లు పంచిపెట్టేశాడు. అందుకు నేనేమీ అనలేదు. మొన్న నా పెళ్లామూ నేనూ ఏదో సంగతికి వాదులాడుకుంటే, గబగబా వచ్చి, ఎగిరి నా పొట్టమీద తన్నాడు. నిజమనుకోండి అబద్ధమనుకోండి, మిమ్మల్ని చూచే అదృష్టం ఉండబట్టి, ఆయన కొట్టిన దెబ్బలకు బతికాను" అని పూజారి తుండుగుడ్డతో కళ్ళనీళ్లు తుడుచుకొని, గద్గద స్వరంతో యిక మాట్లాడలేకపోయాడు.

ప్రెసిడెంటుగారు, రామిరెడ్డిగారు, ఇద్దరూ పూజారిని ఓదార్చి కూచోబెట్టారు. రామిరెడ్డిగారికి పూజారిపై విపరీతమైన జాలి కలిగింది. వీరభద్రయ్యను ఇంటికి పొమ్మని చెప్పి, మాధవయ్యను పిల్చిరమ్మని రామిరెడ్డిగారు సేద్యగాణ్ణి పంపించాడు. మాధవశాస్త్రి గడగడలాడుతూ వచ్చి "ఎందుకండీ పిలవమన్నారట?" అంటూ బెంచీమీద కూచున్నాడు.

రామిరెడ్డిగారు ఆగ్రహంతో మాధవశాస్త్రిని చూచి,

"యినాశకాలే, యిపరీత బుద్ధీ - అని పెద్దోళ్లు అంటారులే, మాదవయ్యా...... యీరభద్రయ్య నీకన్నా ఎన్నేళ్లు పెద్దోడు?" అన్నాడు. ఆమాటలకు మాధవశాస్త్రి గుండె తీవ్రమైన వేగంతో కొట్టుకుంది. పక్కటెముకలు గుండెదెబ్బలకు విరిగిపోతాయేమో ననిపించింది. మాధవయ్యకు - ఏమీ జవాబుచెప్పకుండా తల వంచుకొన్నాడు.

"ఆ దొంగసన్యాసి దినానా దేవళ్లోకి వస్తో ఉండాడా?"అన్నాడు రామిరెడ్డి.

"ఎవరు?" అన్నాడు మాధవశాస్త్రి.

అయనే, ఆ రాముభక్తుడు ... సన్యాసి పిల్లి గెరటయ్యగారు... ఆయనకు వత్తాసికి పోయినారంటగా తమరు? ఆ మాలోళ్లకి ముందు ప్రసాదం పెట్టలేదని, పెద్దోణ్ణి ఈరభద్రయ్యను నానామాట లన్నావంటగా?.. మాలోళ్లసంగతి నీకేందెల్సు మాధవయ్యా? నేను భూమ్మీద పడ్డప్పట్నించీ అళ్లతో యీగతానే ఉండాను. నాకు దెల్సు. నాగుపామునైనా నమ్మొచ్చుగానీ, మాలోణ్ణి నమ్మగూడదు. వాళ్లకి వత్తాసిగా నువ్వు మాట్లాడితే, యింక అళ్లు మనమాట యింటారాంటి? ఆ గెరటయ్య పామాన్యుడనుకున్నావా?"

రామిరెడ్డిగారు మాధవయ్యను మందలిస్తూ మాట్లాడుతూంటే, ప్రెసిడెంటుగారు ముసిముసినవ్వులు నవ్వుతూ కూచున్నాడు. ఆయన నవ్వులు, మాధవయ్య హృదయాన్ని కోస్తున్నాయి. రామిరెడ్డిగారిమాటలు శూలాల్లాగా గుచ్చుకుంటున్నాయి.

"వాళ్లు మొగుడూ పెళ్లాం తన్నుకుంటుంటే మధ్య నువ్వుపోవడం ఎందుకు? పోయినోడివి పూరికే రాకుండా, ఆ పెద్దోణ్ణి ఎగిరి తన్నేవంట్నే? అదేనా అంట నువ్వు చెయ్యాల్సినపని?" అన్నాడు రామిరెడ్డి.

మాధవశాస్త్రి మౌనంగా కూచున్నాడు. తండ్రి చెప్పిహాయినహితవాక్యాల్ని ఒక్కసారి జ్ఞాపకం చేసుకున్నాడు. 'రామిరెడ్డిగారిమాటలకు జవాబు చెప్పదామా?' అనిపించింది. కానీ యజమాని కోపంతో ఉన్నప్పుడు ఏమాట మాట్లాడినా ప్రమాదమేనని, మాధవశాస్త్రి నోరెత్తకుండా దిక్కులేనివాడిలాగా కూచున్నాడు. తన అంతరాత్మను దంపుకొని జీవచ్ఛవంలాగా, కదలకుండా కూచొని సహించాడు.

"వాళ్లు మొగుడూ పెళ్లాం ఇయ్యాళ తన్నుకుంటారు. రేపాక టైపోతారు. మధ్య నువు బొయ్యి అయన్ను తిన్నడం ఎందుకూ అంట? కొంచెమున్నా ప్రపంచజ్ఞానం ఉండక్కర్లేదంటయ్యా మాధవయ్యా ... " అని రామిరెడ్డిగారు, గడగడ మాట్లాడాడు. మాధవశాస్త్రి ఎదురుతిరిగి ఏమీ జవాబు చెప్పకపోయేసరికి, రామిరెడ్డిగారికి కొంచెం జాలికలిగింది.

"మాధవయ్యా, - నే జెప్పేదీ! నువ్వే మన్నా అనుకో, మాలోళ్ళని చెప్పకింద తేళ్ళలాగా అణిచిపెట్టాల. లేకపోతే వోళ్లు చెప్పినమాట యింటారా? గాంధీగారి దయవల్ల వాళ్లని కోవళాల్లోకి రానిస్తా ఉండారు. అంతమాత్రానికే వాళ్ళని పట్టపగ్గాల్లేకుండా ఉన్నాయి. వాళ్లకి వత్తాసిగా నీబోటోళ్లు మాట్లాడితే, వాళ్ళముందు ఒకరు బతగ్గలరా అంట?" అని రామిరెడ్డిగారు, కొంత ఆగ్రహం నెమ్మదిగా తగ్గించుకొంటూ మాట్లాడారు. పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారు రామిరెడ్డిగార్ని సమర్థిస్తున్నట్లుగా చిరునవ్వులు నవ్వుతూ కూచొని, మత్తుగా తూగి గోడకానుకొని గురకపెట్టి నిద్రపోయారు.

"భోజనానికి రండి" అని సావిత్రమ్మ గొంతు విన్పించింది. రామిరెడ్డిగారు లేచి యింట్లోకి వెళ్ళారు.

మాధవయ్య భారమైన హృదయంతో కదలలేక అక్కడే కొంతసేపు కూచున్నాడు.

"అంత చిన్న విషయానికి ఎందుకండీ అంత కోపం తెచ్చుకోవడం?...వీరభ


# బహుమతి రు. 500

(గవర్నమెంటు రిజిష్టర్డు)

**తెల్ల వెంట్రుకలను పోగొట్టును**

రంగులనుచూచి మోసపోవద్దు. అది తాత్కాలికము మాసుపోవును. "మన్ మోహిని హేర్ ఆయిల్" అనేక వనమూలికలతో ఆయుర్వేద పద్ధతిలో తయారైనది 60సంIIల వయస్సువరకు వెంట్రుకలను నల్లగా వుంచును. ఇదిగాక మెదడుకు చల్లదనము యిచ్చును. ఉన్మాదము, తలనొప్పి వగైరా జబ్బుల రానీయదు. "జ్ఞాపకశక్తి"ని కంటిచూపును వృద్ధిచేయును. కొద్దిగానెరసివుంటే ఒక సీసా రు. 3-8-0; 3 సీసాలు రు. 9-0-0 సగము నెరసివుంటే ఒక సీసా రు. 5-0-0. 3 సీసాలు రు. 12/- పూర్తిగ నెరసివుంటే ఒక సీసా రు. 7/- లు 3 సీసాలు రు. 18/- లు. ఇది పనిచేయదని నిరూపించిన రు. 500/-

GENERAL LABORATARIES,
(H. O) P O Rajdhanwar H Bagh).



# దావాగ్ని



ద్రయ్య గీతిమంతుడని అనుకుంటున్నారా మీరు? ఆయనేమీ సామాన్యుడు గాడు"....
అది సావిత్రమ్మ గొంతు - లోపల్నించి వినిపించి, మాధవయ్య హృదయానికి కొంత ఊరట కలిగింది. బరువైన మనసును బలవంతంగా స్థిమితపరచుకొని, మాధవయ్య అడుగులో అడుగు వేసుకుంటూ ఇంటికి చేరాడు. విమలమ్మ "ఎందుకండీ, అలా ఉన్నారూ?" అని పదిసార్లు అడిగినా, ఏమీ జవాబు చెప్పకుండా భగవద్గీత చదువుతూ కూచున్నాడు. రెండుమూడు శ్లోకాలు చదివేడో లేదో..."దేవుడున్నాడా లేడా?" అనే సందేహం మాధవశాస్త్రికి మళ్ళీ వచ్చింది - "లేడు. లేడు" అని మాధవశాస్త్రి గారి చెవిలో ఎవరో చెపుతున్నట్లే వినిపించింది. "ఛీ. ఛీ" అనుకొని మాధవశాస్త్రి, మనసును కేంద్రీకరించి, భగవద్గీతా పారాయణం సాగించాడు.

## 6

ఆరోజు భోగిపండుగ. అంధకారాన్ని చీల్చుకుంటూ భోగిమంటలు ఆకాశంలోకి పరుగెత్తుతున్నాయి. ఘల్లున గజ్జెలు మ్రోగినట్లు, పసిపిల్లలు నవ్వుతూ భోగిమంటల చుట్టూ కూచొని చలికాచుకుంటున్నారు. తమ బిడ్డలు ఆనందంతో కళకళలాడుతుంటే తనివితీరా చూచి తలిదండ్రులు సంతోషిస్తున్నారు.

విమలమ్మ లేచి, "ఏమండోయ్, అందరూ భోగిమంటలు వేసుకుంటున్నారండి, లేవండి లేవండి" అని మాధవశాస్త్రి గారిని లేపింది.

"సరే పోవే" అని మాధవయ్య, విదిలించి కొట్టి, దుప్పటి బాగా కప్పుకొని పడుకున్నాడు. విమలమ్మ నీళ్ళ కింద మంటచేసి, ఇల్లూ వాకిలి చిమ్ముకొని మళ్ళీవచ్చి భర్తను లేపింది. "బుద్ధిలేదూ నీకు?" అన్నాడు మాధవయ్య. విమలమ్మకు కూడా విపరీతమైన కోపమొచ్చింది.

"ఏమిటండీ,... ఈ రోజు భోగిపండుగయిన సంగతి మీకు తెల్సునా తెలీదా? అందరూ లేచి భోగిమంట వేసుకుంటూ ఉంటే, లేవండీ అంటే, ఖుస్సుమంటారేమిటండీ?" అని, తలకపోసుకోవడానికి కమ్మలూ, ముక్కుపుడకలు తీస్తూ విమలమ్మ రివ్వున వెళ్ళింది.

మాధవయ్య మళ్ళీ హాయిగా ముసుగు పెట్టుకొని పడుకున్నాడు.

విమలమ్మ తలకుపోసుకొని తల తుడుచుకుంటూ వచ్చింది. ముసుగుపెట్టుకొని పడుకొనిఉన్న భర్తనుచూచి, చిరునవ్వు నవ్వుకొని, శాస్త్రి గారిని విసురుగా అటూ ఇటూ కదిలించింది.

"హాబ్బ! ఏమిటే," అని పసిపిల్లాడిలాగా గునిశాడు శాస్త్రి గారు.

"ఈరోజు భోగిపండుగ. దేవాలయంలో ఊరేగింపు ఏర్పాట్లు చెయ్యాల్నా అవసరం లేదా. నా మాట విని లేవండి. త్వరగా భోగిమంట వేసి, తలకుపోసుకుని దేవాలయంలోకి వెళ్లండి" అని విమలమ్మ భర్తను బ్రతిమాలుకొంది.

మాధవశాస్త్రి పకపక నవ్వి, "నాకు తెలుసులే పోవే. అతణ్ణి ఎప్పుడూ ఊరేగించినా వద్దనడు" అన్నాడు.

"ఎవర్ని?" అని ఆశ్చర్యంగా అడిగింది విమలమ్మ.

"అదే ఆ దేవుణ్ణి" అన్నాడు మాధవయ్య.

విమలమ్మకు గుండె జల్లుమంది.

"అదేమిటండీ! దేవుణ్ణి గురించి అంత నిర్లక్ష్యంగా మాట్లాడతారు?" అంది.

మాధవశాస్త్రి చిరునవ్వు నవ్వుతూ కళ్లు నలుపుకొని, ఆవులించి వొళ్లు విరుచుకొని, "ఆయనకి నోరు వాయీ ఉంటేకదా! మనం ఊరేగిస్తే ఊరేగుతాడు. లేకపోతే గాలి వెలుతురురాని గర్భగుడిలో బిక్కుబిక్కుమంటూ పడి ఉంటాడు" అన్నాడు మాధవయ్య.

విమలమ్మ అసహ్యించుకొని,

"ఛి. ఛీ. పండగపూటా దేవుణ్ని తిడతారేమిటండీ - చాలుగానీ, లేచి భోగిమంట వెయ్యండి. లేకపోతే యింటికి శని చుట్టుకొంటుంది" అని బ్రతిమాలుకొంది విమలమ్మ.

ఇంతలోగా జంగందేవరలు గణగణ గంటలు వాయిస్తూ మేలుకొల్పులుపాడి, దీవించి శంఖం పూరించారు. ఆ స్వచ్ఛమైన శంఖనాదంలో ఏ దివ్యశక్తి ఉందోగానీ, మాధవయ్య తన ఆలోచనలన్నీ మాని హాయిగా విన్నాడు. "మళ్లీ ఇంకొకసారి శంఖం ఊత్తారా?" అని పసిబిడ్డలాగా అడగాలనిపించింది మాధవయ్యకు. అప్పుడే కాల్చిన తాటితేగలు నములుతూ వెంకటేశ్వర్లు మాధవయ్య ఇంటిముందుకొచ్చి తలుపు తట్టాడు.

"మాధవయ్యా ... ఏందయ్యా స్వామీ, అందరూ భోగిమంట లేసుకున్నారు - తెల్లంగా తెల్లవారొస్తాఉంటే, నువ్వింకా తలుపే తియ్యలేదే స్వామీ నా సామిరంగా బలేవోడివయ్యా నువ్వు" అన్నాడు.

మాధవయ్య మంచందిగి,. "తాటేకులు లేవు ఎంకన్నా" అన్నాడు.

"వసారావి నాలుగు పెరకరాదంటయ్యా" అని వెంకటేశ్వర్లు నవ్వి, "తలుపు తీవయ్యా స్వామీ, తాటేకులుగావాల్నంటే నే దెస్తాలే," అని గబగబా వెళ్లేడు.

మాధవయ్య తలుపు తీసి వీధిలోకి చూచాడు. పిల్లలు తాటితేగలు నములుతూ గంతులేస్తున్నారు. ఆరిపోయిన భోగిమంటలు మిణుకు మిణుకుమని మెరుస్తున్నాయి

వెంకటేశ్వర్లు ఒక మోపు తాటేకులు తెచ్చి వాకిట పడేశాడు.

"ఎక్కడివి ఎంకన్నా?" అని మాధవశాస్త్రి ఆశ్చర్యంగా అడిగాడు. వెంకటేశ్వర్లు పకపకా నవ్వి, "మీ యజమానిగారివే" అన్నాడు.

"ఎవ్వరూ చూళ్ళేదా?" అని సందేహంతో అన్నాడు మాధవశాస్త్రి.

"మాదవయ్యా. నువ్వు వట్టి అదురోడివయ్యా. చూస్తే ఏమయ్యా? మనిల్నేం చేస్తారు?" అన్నాడు వెంకటేశ్వర్లు.

విమలమ్మ సంతోషంగా వచ్చి ఒక తాటాకు తీసుకొనిపోయి, పొయ్యిలో ముట్టించుకొనివచ్చి, గనగన మండుతున్న తాటాకును విసిరి వాకిట పడేసింది. వెంకటేశ్వర్లు ఇంకొక ఆకు తీసుకొని మండుతున్న తాటాకుపై వేసి, మంటను చూస్తూ నిల్చున్నాడు. మాధవశాస్త్రి చిరునవ్వులు నవ్వుతూ, మంటవైపే చూస్తూ కూచున్నాడు. విమలమ్మ కూడా వాకిట్లో నిల్చుంది.

వెంకటేశ్వర్లు విమలమ్మను చూచి, "అమ్మో, తల్లీ; అమ్మా, అబ్బా లేనోణ్ణి, పండగపూట నాలుగు నిప్పట్లు పారెయ్యమ్మా," అని దోసిలిపట్టి అడిగాడు.

విమలమ్మ ఇంట్లోకి వెళ్ళి నాలుగు బెల్లపు అరిసెలు తీసుకొచ్చి వెంకటేశ్వర్లు చేతిలో పడేసింది. "నా బంగారుతల్లి,




తుమునూలు, అల్లికనూలుతో తయారగు మీవస్తువులు మెత్తగాను, గట్టిగాను వుండవలెనంటే 'టవర్ మార్క్' ఉత్తమశ్రేణి నూలుదారాలు ఉపయుక్తమైనదని నిర్ణయింపబడినది. ఇది కట్టలుగాను, పిడులుగాను లభించును.

జె. కె. కాటన్‌మాన్యుఫాక్చరర్స్, లి.
కమలాటవర్ కాన్పూర్.

మా కళ్లు పసుపుకుంకుమతో బతుకుతావు తల్లీ," అని, ఒక అరిసె నములుతూ మిగిలినవి ఖనీను జేబీలో పెట్టుకున్నాడు.

"ఎంకన్నా మాదేముందిలే పేదోళ్ళం. మీ రెడ్డిగారింట్లో చేసేఫలహారాలు తినే వాడికి మా అరిసెలేం బాగుంటాయోయ్?" అన్నాడు మాధవయ్య.

వెంకటేశ్వర్లు ఎగతాళిగా విరగబడినవ్వి "అయోధ్యారామ సొతంత్రంగాబట్టి మిమ్మల్ని అడిగినానుగానీ, మా రెడ్డిగారింట్లో నోరెత్తి అడుగుతానా? మొన్న తాసిల్దారు వచ్చిన రోజు ఇడ్డెన్లు చేసినారు. వాడితస్సాగొయ్యా-సెయ్యా, మిరప్పొడిబోసుకొని యిరవై యిడ్డెన్లు తిన్నాడయ్యా. నాకొక్కటైనా యిస్తారు గామాల - అని ఆశపెట్టుకొనే నాపాటికి నేను పనిచేసుకుంటా ఉంటే, నేనేంజెప్పేది స్వామీ! ఇదిగో అని ఒక్క ఇడ్డెనైనా నాచేతులో ఎయ్యలేదు సామీ, నిజమనుకో అబద్దమనుకో. నా పేణంపోతే మటుకు నేను అడుగుతానా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

మంటలో తాటాకులు వేస్తూ అరిసెలు నములుతూ వెంకటేశ్వర్లు మంటవైపే చూస్తూ నిల్చున్నాడు. అగ్నిజ్వాలలు గనగన మండుతూ నాల్కలు జాపుకుంటూ ఆకాశంలోకి ప్రాకుతుంటే ఆ అగ్నిజ్వాలల్లో దేవుడున్నాడేమో నని మాధవశాస్త్రి నిశ్చేష్టుడై కూర్చొని చూచాడు.

వెంకటేశ్వర్లు మెల్లగావచ్చి మాధవశాస్త్రి పక్కన కూచొని "మాధవయ్యా, నీకేమీ కోపం రాకుండా ఉంటే, ఒక్క సంగతి అడుగుదా మనుకున్నాను" అని గుసగుసా అడిగాడు. ఆ మాటలకు మాధవశాస్త్రి అదిరిపడి, విమలమ్మ వింటుందేమోనని వాకిలి వైపు చూచాడు.

"ఎవ్వరూ లేరులే" అని వెంకటేశ్వర్లు, అటూ ఇటూ చూచి, "నాతో చెపితే పరవా లేదులే మాదవయ్యా. అందరూ బలే ఇదిగా అనుకుంటా ఉండారు" అన్నాడు.

"ఏమని?" అని మాధవయ్య గడగడ లాడుతూ అడిగాడు.

"నీకు కోపం వస్తదేమో; అయినా నీ కోపం ఎంతసేపులే... మొన్న.... పండగనాల ఓరోజు నాపాట నేను ఊదిన పోతా ఉంటే, మీరిద్దరు బలే నవ్వుకుంటూ ఉండారు. నువ్వు కుర్చీలో కూకోనుండావు, సావిత్రమ్మ నీకు ఎదాళంగా కుర్చీలో గూకోనుండది. నే నవ్వానే అనుకున్నాను. మాదవయ్య బలేవోడురా, అని. అయినా ఊరంతా అనుకుంటూనే ఉండారు, సావిత్రమ్మకు నీమీద బలే యిష్టమని" అన్నాడు వెంకటేశ్వర్లు.

మాధవశాస్త్రి ముఖం వెలవెలపోయింది. "ఎంకన్నా...నువ్వు నమ్మేకావన్న మాట. నే నెట్టాంటివాణ్ణయిందీ నీకు తెలీదూ? చిన్నతనంనుంచి నాతో స్నేహం చేసిన వాడివి నువ్వు. నా సంగతి నీకు తెలీదా? నేను ఏ పాపం ఎరుగను ఎంకన్నా. దైవ సాక్షిగా నేను నిజం చెపుతున్నాను." అని మాధవశాస్త్రి కళ్లు మూసుకున్నాడు. 'దేవుడున్నాడా లేడా?' అనే సందేహం మాధవశాస్త్రి మనసులో తళుక్కున మెరిసింది.

"లోకులు కాకులుఅన్నారు మాధయ్యా. నీ సంగతి నాకు తెలవదా! నువ్వు వట్టి అగురోతివి. పరాయి ఆడదాన్ని చూస్తే ఆమడ దూరం పరుగెత్తేవోడివి. ఏదో అంటా వుంటారు—వున్నవీ లేనివీ - నేను నమ్మలేనులే మాదవయ్యా." అన్నాడు వెంకటేశ్వర్లు.

మాధవయ్య నిశ్చేష్టుడై ఏమీ తోచక కూచున్నాడు. భోగిమంట ఆరిపోయి ఎఱ్ఱగా ఆగ్రహంతో చూస్తూఉంది.

"కామేశ్వరరావున్నాడే, బలే అసాధ్యపోడు మాధవయ్యా, ప్రతిరోజూ దేవళ్ళో గూకోని ఆడూ యీరబద్రయ్య గుసగుసలాడతా వుండారు. ఈరబద్రయ్యకు నీమీద గొంతులుదాకా ఉండది" అని వెంకటేశ్వర్లు లేచి, "వస్తా, మాదవయ్యా, ఇంట్లో పనుండది." అన్నాడు.

"వెంకన్నా ఉండు వస్తున్నా" అని మాధవయ్య, ఇంట్లోకి వెళ్లి రెండు వేడివేడి ఇడ్లీలూ పచ్చడి వేసుకొచ్చి యిచ్చాడు. వెంకటేశ్వర్లు ముఖం ఇడ్లీలు చూడగానే కళకళలాడింది. ఆనందంతో అందుకొని వెంకటేశ్వర్లు ఇడ్లీలుతిని, "మాదవయ్యా. మీకు, తొందరగా పిలకాయలు పుట్టారులే మాదవయ్యా...మీకు అదొక్కటే కొరత. లచ్చణంగా ఈడూ జోడూ అయిన సంసారం...ఎందుకయ్యా వందలెందలు ఎకరా లుండంగానే సరా, మా రెడ్డికీ...మా యజమానురాలికీ నిమసం పడదు. అయనొక దారి అమ్మగారింకోదారి...నీకు తెలవన్దేముందిలే" అని వెంకటేశ్వర్లు గొల్లున నవ్వి పరుగెత్తాడు.

"తలంటుకుందురుగాని రండి" అని విమలమ్మ పిల్చింది. మాధవశాస్త్రి చొక్కా విప్పి తలంటుకోవడానికి కూచున్నాడు. విమలమ్మ తలంటుతూఉంటే ఆమె చేతుల గాజులు గలగలమంటున్నాయి. మాధవయ్య కళ్లు సగంమూసుకొని కూచొని విమలమ్మ గాజుల గలగలలు హాయిగావింటూ చిరునవ్వు నవ్వుతున్నాడు.

"ఏమండీ, ... ఈవూరిబడికి కొత్తగా వచ్చింది అయ్యవారమ్మ ఆమె నిన్న మనింటికొచ్చింది. అబ్బ! ఆమె కట్టుకున్న చీర ఎంత బాగుందండీ! అదేమో సిల్కట. ఆ పేర్లు నాకెలా వస్తాయి! అదేదో ఇంగిలీషు పేరు చెప్పిందండి. ఆ చీర బలే బాగుందండి" అంది విమల.

"మాధవశాస్త్రి చిరునవ్వునవ్వి "ఆ అయ్యవారమ్మకేం? మొగుడా, ముద్దులా? ఎట్టాంటి సిల్కుచీర కావాలన్నా కడుతుంది" అన్నాడు మాధవయ్య.

"ఛీ, ఏంమాటలండీ, అవి? మీనోటికి శుద్ధీబద్ధంలేదు. పాపం ఆమె చాలా మంచి

చర్మపు బాధలకన్నిటికీ
"సైబాల్"
చర్మవ్యాధు లన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విష క్రిమి నాశనిగా త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబిస్, పొంటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు, మొదలైన వాటిని కుదుర్చడంలో అద్భుతంగా పనిచేస్తుంది.
బిడ్డల ఆరోగ్యమునకు ప్రసిద్ధిచెందినది.
"రమణీస్ బేబి గ్రైప్"
తయారీదార్లు
ది సౌత్ ఇండియన్
మాన్యుఫాక్చరింగ్ కంపెని, మధురై.
డిస్ట్రిబ్యూటర్లు
సీతారామ జనరల్ స్టోర్సు ఏజెన్సీస్
విజయవాడ, సికింద్రాబాద్.
బరంపురం (గంజాం), బొంబాయి. బెంగుళూరుసిటీ.
RAMANIS BABY GRIPE

## ★ దావాగ్ని ★

డండీ! ఎంతమర్యాదగా మాట్లాడుతుంటేని?" అంది విమల. విమలమ్మకు స్త్రీజాతిపైన ఎక్కడలేని అభిమానం. ఒక మగవాడు దుర్మార్గంగా ఒక ఆడదాన్ని ఒకమాటంటే విమల సహించదు.

"ఓసీ పిచ్చి మొఖమా, నీకేం తెల్సు చెప్పు?" అన్నాడు మాధవయ్య.

విమలమ్మ భర్తపాదాలకు నూనెరాస్తూ "నాకన్నీ తెలుసు" అంది.

"ఏమిటే నీకు తెలిసింది?" అని చిరునవ్వు నవ్వేడు మాధవయ్య.

విమలమ్మ కోకిల స్వరంతో కిలకిలనవ్వి, "మీసంగతిగూడా తెల్సు" అంది.

మాధవశాస్త్రికి తను ఏలోకంలోఉన్నదీ తెలియలేదు. ఆశ్చర్యంతో సతమతమయి, "ఏమి తెలుసే, నా సంగతి?" అన్నాడు.

"ఏమీలేదు లెండి. తమాషాకు అన్నాను. మీ సంగతి నాకేం తెలుసు?" అని విమల చిరునవ్వుతో భర్త కళ్లలోకి చూచింది.

"చెప్తావా చెప్పవా? ఏమిటో తెలుసన్నావుగా, చెప్పూ. భయమేమి? అని కోపంతో ఉరిమిచూచాడు మాధవశాస్త్రి.

"ఎందుకండీ అంత కోపం? మీ సంగతి నాకేం తెలుసు?...మంచినీళ్ల బావికి పోతే ఆ కమలమ్మ చెప్పింది... నేను నమ్మలేదు లెండి. ఎంత ఎండెబడిందో చూడండి. ఇంకా ఎంత పనుందీ! మీతో మాట్లాడుతూ కూచుంటే ఎలాగ?" అంది విమలమ్మ

"చెప్పేదేదో సరిగ్గా చెప్పు. పళ్లు రాలిపోతాయి." అన్నాడు మాధవశాస్త్రి.

అధికారం చలాయిస్తూ భర్త అనిన ఆ మాటలకు విమలకు విపరీతమైన కోపం వచ్చింది.

"ఏం! చెపుతాను. నాకేం భయం? ఒకర్ని చూచి నేనెందుకు భయపడాలి? నేనేమన్నా తప్పుచేస్తే భయపడొచ్చు... రెడ్డిగారి భార్యకూ మీకూ సంబంధం ఉందని అందరూ అనుకుంటున్నారని కమలమ్మ చెప్పిందయ్యా నాకేమీ తెలీగు." అని విమలమ్మ కోపంతో మూతి ముడుచుకొంది.

మాధవయ్యగారి శరీరం మంచుగడ్డలా అయిపోయింది. కోపమంతా గుట్టుగా చల్లారిపోయింది.

"విమలా, నువ్వు నిజంగా నమ్మేశావన్న మాట?" అన్నాడు.

"నేనెందుకు నమ్ముతానండి? మీ సంగతి నాకు తెలీదా? పోనివ్వండి" అంది విమలమ్మ.

"విమలా, నీవు నమ్ము, నమ్మకపో. ఆమె నాతో అలాజాలంగా మాట్లాడేది మాత్రం నిజం. అంతమాత్రానికి నాకు పాపం అంటగడ్తే ఎలా చెప్పు? ఇప్పుడు వెంకటేశ్వర్లు కూడా అన్నాడు, ఊరంతా అనుకుంటున్నారని. రామిరెడ్డి చెవిలో పడిందంటే, ఇంక ఈ వూళ్లో మనకు గంజినీళ్లుకూడా పుట్టవు—నాకు ప్రాణాలూ దక్కవు" అని దీనంగా చూస్తూ అన్నాడు మాధవయ్య.

విమల భయపడుతూ భర్తవంక చూచి, "కొంచెం జాగ్రత్తగా ఉండండయ్యా, మీకెందుకు లేనిపోని శని, ఆమెతో మాట్లాడకుండా మీ లెఖ్కపని మీరు చేసుకొని రండి" అంది.

"అయ్యో రామ—ఎప్పుడన్నా అవసరమయితే తప్ప నేనెందుకు మాట్లాడతానే? ఇంట్లోకి కావాల్సిన సామానంతా నేనే నెల్లూర్నుండి తెస్తూఉంటిని. ఇంక అప్పుడైనా 'ఏవేం సామాన్లు కావాలమ్మా' అని అడగొద్దా? గుమాస్తాగా ఉండేటప్పుడు వాళ్లు ఏ పని చెప్పినా చెయ్యాలి. మాట్లాడకుండా ఓబ్బిబిసుకొని కూచుంటే ఎట్లా జరుగుతుంది?" అన్నాడు మాధవయ్య.

"సరే పోనివ్వండి. మీరు లేచిరండి, పొద్దుపోతూఉంది" అని విమల నీళ్లతోడడానికి వెళ్లింది. మాధవయ్య మెల్లిగా వెళ్లి, తలకు పోయించుకొని కొత్తబట్టలు కట్టుకొని, వేడి వేడి ఇడ్లీలు భోంచేసి కాఫీ త్రాగేడు. విమల తంటప్రయత్నంలో నిమగ్నరాలైంది.

మాధవశాస్త్రి ధర్మకర్త గారింటికి వెళ్లాడు. సావిత్రమ్మ తలకుబోసుకున్న తల ఆర్పుకుంటూ మిద్దెమీద నిల్చొని, మాధవయ్యను చూడగానే మిద్దె దిగివచ్చి, లోపలికివెళ్ళి పూలబుట్ట తీసుకొచ్చి మాధవయ్య చేతికిచ్చింది. మాధవశాస్త్రి వినయంగా అందుకొని వంచినతలఎత్తకుండా తిరిగాడు. "మాధవయ్యా" అని మెల్లగా పిల్చింది సావిత్రమ్మ. ఆయన గడగడలాడుతూ వెనుకకు తిరిగి చూచాడు.

"వీరభద్రయ్యతో మాట్లాడేటపుడు కొంచెం నెమ్మదిగా మాట్లాడుమాధవయ్యా. మొన్న వీరభద్రయ్యకు బుద్ధి చెప్పడానికి వెళ్లి ఆయన్ను తన్నిరావడం ఎందుకు చెప్పు?" అని సావిత్రమ్మ చిరునవ్వు తెచ్చుకుంటూ మెల్లగా అడిగింది.

"ఆయన చాలా నిర్లక్ష్యంగా మాట్లాడేడమ్మా" అని గడగడలాడుతూ అన్నాడు మాధవయ్య

"ఆ సంగతి ఎవరికి తెలుస్తుంది? మాధవయ్య వీరభద్రయ్యను కొట్టేడు, అని పలుగురూ అంటున్నారేగానీ, భద్రయ్య చేసేదుర్మార్గం అనుకునేవాళ్ళు లేరు. నీకెందుకు నువ్వు గమ్మనుండులే మాధవయ్యా" అన్నది సావిత్రమ్మ.

"అమ్మో, గమ్మనుండక నేనేమీ ఆయనతో విరోధం పెట్టుకోవాలనుకున్నానా అమ్మా! నేనసలు ఆయనతో ఇంక మాట్లాడదల్చుకోలేదు" అని మాధవయ్య నెమ్మదిగా నడిచి దేవాలయానికి వెళ్లాడు.

ధ్వజస్తంభం అరుగుమీద గరటయ్య, వెంకట్రాముడు, కొంతమంది మాలపిల్లలు కూర్చొనున్నారు. మాధవశాస్త్రిని చూడగానే గరటయ్య వెంకట్రాముడు గభాలున అరుగుదిగి, పిల్లలందర్నీ దిగమని చెప్పి "నమస్కారంస్వామీ" అన్నారు.

మాధవయ్య చిరునవ్వు నవ్వుతూ నిల్చున్నాడు వెంకట్రాముడు "ఏదో మాల వెధవలం, స్వామీ! దేవుడి ప్రసాదం కడుపునిండా బెద్దారంటేనూ, తినిపోవడానికొచ్చాం. కొంచెం ముద్దల్ని ఒక కంట కనిపెట్టి ఉండండి" అని వెంకట్రాముడు నిర్లక్ష్యంగా నవ్వేడు. దొంగసారాయి కాచినందుకు జైలుశిక్షలు చాలాసార్లు అనుభవించిన మనిషి వెంకట్రాముడు. వాడు మంచి నిషాలో ఉన్నాడని మాధవయ్య కనిపెట్టేడు.

"ఒరే వెంకట్రాముడూ, స్వామితో మాట్లాడేటపుడు కొంచెం నెమ్మదిగా మాట్లా


జలుబులు,
శైత్యం






జలుబులు, శైత్యం, దగ్గులు గొంతు పుండు, ఆస్థమా, బ్రాంకైటిస్, ఇతర బాధలు వచ్చినప్పుడే పెప్సును సేవించండి. పెప్సును చప్పరించు నపుడు క్రిమి విధ్వంసకరమైన ఔషధసారాలు రొమ్ము, శ్వాస కోశాంతర్భాగాలలో ప్రవేశిస్తున్నట్లు మీకే తెలియును. పెప్స్ క్రిములను సంహరించి, వాపును మాన్పి, మనను పోగొట్టి బాధోపశమనం కలిగిస్తాయి పెప్సునే వైద్యులు సిఫారసు చేస్తారు.

పెప్స్ సేవించండి.

PEPS
క్రిమి సంహారకరమైన గొంతు, రొమ్ము బిళ్లలు.



FPY-24 TEL

మద్రాసు సోల్ ఏజెంట్లు: దాదా & కంపెని పార్కుటౌన్ మద్రాసు-3.

డాలా." అని గెరటయ్య వెంకట్రాముణ్ణి మందలించాడు.

వెంకట్రాముడికి గభాలున కోప మొచ్చింది. "నేనేం తప్పుగా అన్నాను గెరటయ్యా? బలేవాడివే నువ్వు? ఈర భద్రయ్యగారు కడుపునిండా ప్రసాదం పెడతారు, కడుపునిండా తిందామని వచ్చాను, అన్నాను, అంతేనా స్వామీ? నేనేమన్నా తప్పుగా అన్నానా?" అని వెంకట్రాముడు మాధవయ్యవైపు చూచాడు.

"నిజమే లేరా? తప్పేముంది?" అని మాధవయ్య దేవాలయం లోపలికి వెళ్ళి పూలబుట్ట పూజారిదగ్గర పెట్టాడు. పూజారి దేవుడి విగ్రహాల్ని తళతళ మెరిసేటట్లు తోమి ఒక పక్కన పెట్టి, మొండెంలాగా ఉన్న దిండ్లకు లోహంతో చేసిన తల, కాళ్ళూ, చేతులూ, అమర్చి ఉత్సవానికోసం దేవుని బొమ్మ తయారుచేశాడు.

మాధవయ్య గర్భగుడిలో ఉన్న శివలింగాన్ని, పూజారి చేతుల్లో తయారైన దేవుని బొమ్మను, ఒకసారి చూచి, వెలుపలికి వచ్చి, దేవాలయం చుట్టూ ప్రదక్షిణం చేయడం ప్రారంభించాడు. ఆకాశాన్ని తాకుతున్నట్లు గోపురం, ధ్వజస్తంభం ఠీవిగా నిల్చొని ఉన్నాయి. గోపురం గూళ్లలో కాపురం చేస్తున్న పావురాళ్లు కువకువమంటూ ఎగురుతూ, దేవాలయానికి శోభ కలిగిస్తున్నాయి. రివ్వున వీచే గాలికి ధ్వజస్తంభం చిరుగంటలు సంగీతం ఆలపిస్తున్నాయి. దేవాలయంమీది బొమ్మల్ని చూస్తూ మాధవయ్య ఒక ప్రదక్షిణం చేసి వచ్చి, ధ్వజస్తంభం అరుగుమీద కూచున్నాడు.

గెరటయ్యా ధ్వజస్తంభం పక్కన మాలపిల్లలందర్నీ కూచోబెట్టి, "సాంబసదాశివ, సాంబసదాశివ, సాంబశివా" అని పాడుతూ భజనచేయడం ప్రారంభించాడు. వెంకట్రాముడు భక్తితో కూర్చొని, తన్మయుడై చప్పట్లు చరుస్తూ భజనచేస్తూ కూచున్నాడు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు, ధర్మకర్త రామిరెడ్డిగారూ, మిగిలిన ట్రస్టీలు, రామసుబ్బారెడ్డీ, వెంకటరెడ్డీ, పోలిరెడ్డి, పుల్లారెడ్డిగార్లూ, కబుర్లు చెప్పుకుంటూ పకపక నవ్వుకుంటూ లోపలికొచ్చారు. మాధవయ్య అరుగు దిగి నిల్చున్నాడు; గెరటయ్య భజన ఆపి లేవంగానే వెంకట్రాముడూ పిల్లలూ లేచి నిల్చున్నారు.

పూజారిగారు వినయంగా అందర్నీ ఆహ్వానించి ఘంట మ్రోగించారు. ఘంటారావం ఓంకారనాదం చేస్తూ లోకమంతా విన్పించింది. అయిదు నిముషాల్లోపల దేవాలయం జనంతో నిండిపోయింది. పిన్నలూ పెద్దలూ ఒకరినొకరు తోసుకుంటూ వచ్చారు. దేవాలయం పట్టలేదు. గెరటయ్యా, వెంకట్రాముడు, వారితో వచ్చిన మాలపిల్లలు వెలుపలే ఉండిపోవలసివచ్చింది. వెంకట్రాముడు అసలే మొరటు మనిషి. అంతేగాక సారాయిబట్టీ కుటీర పరిశ్రమగా నిర్వహిస్తున్న కారణంచేత ఎప్పుడూ మత్తులోనే ఉంటాడు.

దేవాలయంలో జనం పట్టకుండా కిటకిటలాడుతున్నారు. ధర్మకర్తలందరూ గర్భగుడిలోకి వెళ్లారు. వెంకట్రాముడు పకపక నవ్వుతూ "మనం మాలయెదవలంరా...... మనకు లోపల చోటు లేదురా..." అని పాట పాడుతూ నవ్వడం ప్రారంభించాడు.

పూజారి గర్భగుడిలో నాలుగుమంత్రాలు చదివి, హారతి వెలిగించాడు. హారతి పళ్లెం డబ్బుతో నిండిపోయింది.

ధర్మకర్త లందరికీ పూలమాలలు వేసి, పూజారి అందరికీ విభూతి పెట్టాడు. మాధవశాస్త్రి జనంలో కలిగిపోతూ ఒకపక్క నిల్చున్నాడు.

పూజారి చక్కరపొంగలి పళ్లెం చేతికి తీసుకున్నాడు. ధర్మకర్తగారు అందర్నీ వరుసగా నిల్చోమని కేక వేశారు. అందరూ గడగపెలాడుతూ నిల్చున్నారు పూజారి అందరికీ ప్రసాదం పంచిపెట్టాడు. దేవాలయం ఖాళీ అయింది—వెలుపల ధ్వజస్తంభందగ్గర మాలపిల్లలు, వెంకట్రాముడూ, గెరటయ్యా ఉన్నారన్న సంగతి పూజారి మరిచిపోయాడు.

"అయ్యో స్వాములూ, మాకు ప్రసాదం పెడ్తారా పెట్టరా? ఏదో ఒకటి చెప్పండి స్వామీ. గాంధీమహాత్ముడి దయవల్ల మమ్మల్ని ఈ ధ్వజస్తంభంకాడ నిల్చోనిచ్చారు. మా కడుపు మండిపోతా ఉండది. ప్రసాదం పెడతారా పెట్టరా?" అని వెంకట్రాముడు అరిచాడు. ఆ అరుపులకు దేవాలయం ప్రతిధ్వనించింది. పూజారి అదిరిపడ్డాడు పంచె సవరించుకుంటూ, "ఒరే తొందరపడితే ఎట్టరా వెంకట్రాముడూ? తెస్తున్నారా, తెస్తున్నారా" అంటూ ఇంటికివెళ్లి ఒక పళ్లెంనిండా పొంగలి తెచ్చి, మాలపిల్లలకూ, వెంకట్రాముడికీ, గెరటయ్యకూ పెట్టాడు.

ధర్మకర్త రామిరెడ్డిగారు వెంకట్రాముణ్ణి కొరకొర చూచాడు. చక్కరపొంగలి తింటూ వెంకట్రాముడు వీధిలోకి వెళ్లాడు. అతనితో కూడా గెరటయ్య, పిల్లలు వెళ్లారు.

"వీణ్ణి అగుపులో పెట్టకుంటే లాభం లేదు అమ్మో వీడు రౌడీ అయిపోతున్నాడు" అన్నాడు రామిరెడ్డి. ధర్మకర్తలందరు ఠీవిగా నవ్వారు.

"వాడి దేముంది, తాగుబోతువెధవ" అన్నాడు పంచాయతీబోర్డు ప్రెసిడెంటు.

"లేదు రామసుబ్బయ్యా, ఈళ్లకీ మనం దనువిచ్చినామంటే, మన నెత్తికే చెప్పలడుగుతారు" అని రామిరెడ్డి దేవాలయంలో నుండి వీధిలోకి వచ్చాడు.

దేవుణ్ణి ఊరేగించే ప్రయత్నాలు చెయ్యడానికి మాధవశాస్త్రి వెళ్ళాడు.

(ఇంకా వుంది).

కేశాలను కేశ సౌందర్యాన్ని
కాపాడు ఔషధము.
కేశవర్ధనిని
ఉదయాన్నే ఉపయోగించుటచే చుండును పోగొట్టి దినమంతా ప్రకాశవంతముగా ఉంచును. పసితనంనుంచి వాడి జీవితమంతా కేశసౌందర్యం పొందండి. యిక తలలో దురద పుట్టదు. కేశాలు రాలదు. అకాలంలో నెరియుటమాన్పి, కేశములకు ఆరోగ్యం చేకూర్చండి.
కేశవర్ధనితో కేశములను వృద్ధిచెయ్యండి.
కేశశుభ్రతకు, సువాసనకు షాంపూ వాడండి.
కేశవర్ధిని అ. 14. షాంపూ అ. 14. పోస్టేజి అదనం. అన్నిచోట్లా లభించును.
కేశవర్ధని ప్రాడక్ట్సు, కోయంబత్తూరు.
No. 2
నేషనల్ సేల్సు & సర్వీసెస్ (వదరక్) లిమిటెడ్ హాంపేట, బెజవాడ

# కనపడని మనిషి

"మన కేవూరండీ?"

చదువుతూన్న సినిమా పత్రిక మడిచి తలెత్తి చూశాడు ప్రకాశరావు. ఎదురుగా బల్లమీద కూర్చున్న ముసలాయన్ని వోసారి చూసి, తనను కాదన్నట్లే మళ్లీ పత్రిక తెరచి, ముఖానికి అడ్డం పెట్టుకొన్నాడు ప్రకాశరావు.

"మన కేవూరండీ?" మళ్ళీ అదే ప్రశ్న.

ప్రకాశరావుకు ముసలాడి ప్రశ్నకు చికాకు వేసింది.

విధవ ప్రశ్నా వీడూనూ? ఏం ప్రశ్న! "మన కేవూరండీ?" అట! 'మనం' అంటే తనదీ వాదీ అనా? అంగులో మర్యాదలు కూడాను. ఎవ దేవూరుపోతే యీయన కెందుకో?—

అనుకొంటూ ప్రకాశరావు ముసలాడి ముఖంలోకి చూసి "నన్నేనా?" అన్నాడు. తననే అడుగుతున్నాడనేది తెలిసినా అతనికి అలా అడగ బుద్ధేసింది.

"అవునబ్బాయ్! ఏవూరుమనది!" ఈసారి ముసలాయన ముఖంలోకి చిరునవ్వూ కంఠంలోకి ఆప్యాయతా తెచ్చిపెట్టుకొన్నాడు.

'మీరూ' లోనుంచి 'అబ్బాయ్' లోకి వచ్చాడు. అదీ చొరవంటే! అబ్బ నిజంగా యీ ముసల్వాళ్లు -'

"గుంటూరు!" అనేశాడు ప్రకాశరావు ముక్తసరిగా. అంతకంటే ఎక్కువ మాట్లాడితే ముత్యాలు రాలతాయేమో? ముసలాడు ఏరుకోవడం మొదలుపెడితే -!

"ఆఁ.! అంటే స్వగ్రామం గుంటూరేనా?" సాగదీస్తో అన్నాడు ముసలాడు. జేబులో పొడుం డబ్బీ బయటికితీసి మూత తెరిచాడు.

"ఆఁ.! గుంటూరుదగ్గరేండి!" అన్నాడు ప్రకాశరావు ముభావంగా; అబద్ధాలాడాల్సిన ఖర్మ తనకేంపట్టింది మరి.

ముసలాయన పొడుం గట్టిగాపీల్చి - "చేబ్రోలా?" అన్నాడు. ముక్కూ, కళ్లూ ఎర్రబడ్డాయి బయటికిరావాల్సిన తుమ్ము లోపలకిపోయివుంటుంది మరి!

"కాదు! కోడూరు!" అప్రయత్నంగా అనేశాడు ప్రకాశరావు. పుటిక్కిన నోరు జారిచెప్పానే అనుకొన్నాడు తర్వాత.

"ఓహో! అలాగా? మీ ఇంటిపేరో?" అన్నాడు ముసలాయన ప్రకాశరావుకు దగ్గరగా జరిగి.

ముసలాడు మొండివాడులా వున్నాడు. వదిలేట్టులేడు ఓ విధాన! అయినా తనకేం పోయింది, ముసలాయన అడిగింది సమాధానం చెప్తేను. బండి వచ్చేదాకా తనకూ కొంత కాలక్షేపం జరుగుతుంది కదా? వెధవ సినిమా పత్రిక తరవాత చదువుకో కూడదూ?—పుస్తకం మడిచి భద్రంగా చేతో పట్టుకొని ముసలాయనకేసి ఎగాదిగా చూశాడు.

"ఇంటిపేరు ఏమన్నారూ?" ముక్కు దులుపుకొంటూ సంభాషణ కొనసాగించాడు ముసలాయన.

* * * * * * * * * * * *

ఇంటిపేరు ఏమన్నారూ, అంటాడేఁ? తనేమీ చెప్పండే! ముసలాడు అఖండుడులా వున్నాడు? అవలిస్తే పేగులు లెఖ్ఖపెట్టేవాళ్లుంటారంటారు. కాని ముసలాడు పేగులు తోడేసేట్టున్నాడు—"......"

"సరి సరి! అట్లా చెప్పూ!" ఎందుకో ముసలాడికి అంత సంతోషం!

"నాన్న పేరో?"

అరగంట యక్స్‌ప్రెస్ లేటవడంవల్ల, అర్ధరూపాయి పెట్టి ఫిలిం మాగజైన్ కొన్నాడు. వైటింగ్ రూంలో కూర్చుని చూసుకుందామంటే ప్రాప్తం లేకపోయె! ముసలాడు తన్ను వెరపట్టాడు! ఇంకా నయం బండిలో తగిలాడుకాడు. కొంపతీసి ముసలాడుకూడా ఎలూరే పోతున్నాడేమో? వస్తే అతడెక్కిన పెట్టె ఎక్కకూడదు -'

"ఏవిటోయ్! ఆలోచిస్తోన్నావ్? నాన్న పేరు గుర్తుకు రావడంలేదా?" పళ్ళన్నీ బయటపెట్టి నవ్వుతూ అన్నాడు ముసలాయన. ముఖంచూస్తే వున్నంత వయసు ఆయన గట్టిపలువరసచూస్తే వున్నట్టు అనిపించదు. "..."

"ఇంకేం! అట్లా చెప్పవేం!"లా పాయింట్ తీసి చెప్తున్నవాడిలా ముఖంపెట్టి అన్నాడు ముసలాడు.

బండి వచ్చేదాకా - ఇంకా యిరవై, యిరవైఐదు నిముషాలు యీ ముసలాడి గొడవతో పడాల్సిందేనా? వైటింగ్‌రూంలో కొచ్చినవాడు తన మానాన్న తను కూర్చుని చావకూడదూ? అంతగా తోచకపోతే వి గంటల పంచాంగమో, కుశల కుచ్చమ్మ కథల పుస్తకమో రైల్లో అమ్మేవాళ్ళదగ్గర కొనుక్కొని చూసుకుంటూ కూర్చోకూడదూ? అదీ ఇదీ కాకపోతే వుంకో అర్ధణా పొడుం ఎక్కువగా తెచ్చుకొని పీల్చుకొని ఏడిస్తే పోదూ?

అయినా పాపం యీ ముసలాడిమీద తన కెందుకూ ఇంత మంట? ఏదో అడుగుతుంటారు. తనలాటి చదువుకొన్నవాడు అలాగేనా సమాధానాలు చెప్పాల్సింది!— ప్రకాశరావు ఆలోచన పచ్చిక బయలుమీది కాలి బాటలా మృదువుగా సాగింది.

ముసలాయనమీద కొంచెం సానుభూతి ప్రయత్నంమీద తెచ్చిపెట్టుకొన్నాడు "గుంటూరన్నావ్ ముందు! గుంటూర్లో చదువుకుంటున్నావా? నాయనా?" అన్నాడు ముసలాయన. బల్లబక్కన తన గుడ్డలసంచి వున్నదో లేదోనని వోసారి వెదికి చూసుకొన్నాడు.

"అవునండీ! గుంటూర్లో నే బి. యె. చదివాను. మొన్న మార్చిలో గ్రూపుపోయింది!"

"సంతోషం నాయనా! సంతోషం!" అన్నాడు ముసలాయన.

ప్రకాశరావుకు మళ్ళీ కాలింది! తను గ్రూపులో తప్పటం యీ ముసలాడికి సంతోషమా? పైగా ఆమాటముఖానే అనేస్తాడూ?

మీ నాన్న అదృష్టవంతుడు! కాదా మరి! స్ఫురద్రూపివి; బి. య్యే. పరీక్ష పాసయినావు. తెలివికలవాడివి మర్యాదా మన్నన తెలిసినవాడివి! నిజం చెప్తున్నాను - నువ్వేమీ అనుకోకుండా వుంటేను! ఇంత మంది కుర్రాళ్లను చూశానుగాని నీముఖంలో వున్న తేజస్సు నే నెవర్లోనూ చూడలేదు!" అంటూ ముసలాయన పొడుండబ్బీలోంచి

ఇంత పొడుంతీసి మునివేళ్ళతో పట్టుకొన్నాడు.

ప్రకాశరావు హృదయం డస్ లప్ ట్యూబులోకి గాలికొట్టినట్టు ఉబికింది. పాపం ముసలాయన మంచివాడే! కొందరు ఆప్యాయతతో అవీ ఇవీ అడుగుతారు. అంతే.

"ఇంతకీ మీ పేరేమిటో చెప్పారు కారు!" అన్నాడు ప్రకాశరావు వీలైనంత మర్యాద కనపరుస్తో.

"శేషయ్య! మాది గోదావరి జిల్లా!" అంటూ ముసలాయన ముక్కుల్లోకి పొడుం దట్టించాడు.

"ఓహో! అలాగా—" ప్రకాశరావు మాట పూర్తికాకుండానే శేషయ్య అంగుకొన్నాడు. "నెఖరు సరకు! మళ్ళీ తులం నాలుగణాలు తీసుకొన్నాడు! చేబోలువని చెప్పి చేకూరు పొడుం యిచ్చాడు! వట్టి నాసిరకం! అన్నట్టు మర్చిపోయాను అడగడం! ఎంతమంది మీరు అన్నదమ్ములూ?"

"లేరండీ! నేనొక్కణ్ణే!"

"చెల్లెళ్ళూ అక్కలూ ఎవరూ లేరా?" అన్నాడు శేషయ్య.

దూత్! యీ ముసలాడికి ఇదో పెద్ద జబ్బులావుంది! సాగదీసి సాగదీసి అడుగుతాడు. "ఇంకెవరూ లేరండీ నేనొక్కణ్ణే!"

"అయితేఏం? రత్నంలాంటివాడివి! నత్తగుల్లలు ఎన్నుంటే ఏం? ఒక్క ముత్యం చాలదూ?" మీ తల్లిదండ్రులు అదృష్టవంతులు! ఏజన్మలోనో పుణ్యం చేసుకొన్నారు!" కళ్ళు అరమోడ్పులు వేసి అన్నాడు శేషయ్య.

శేషయ్య సగం మూసినకళ్ళూ, ముఖమూ చూస్తుంటే ప్రకాశరావుకు ఆలోచన ముందుకు సాగలేదు. "ఆస్తిపాస్తులు ఏమాత్రం" శేషయ్య ముఖమంతా కళ్ళుచేసుకొని ఏదో ఆనందకరమైనవిషయాన్ని వినబోతున్నవాడిలా, అడిగాడు

అమ్మ ముసలాడా! ఎంత తెలివిగా సంభాషణ లాక్కొస్తున్నాడూ! తనను గురించి శేషయ్య దేన్ని తెలుసుకోగోరుతున్నాడో ప్రకాశరావుకు అర్థమైంది ఆ అడిగేది సూటిగా అడగకూడదూ? అన్నీ జిత్తులు!

ఏ ఊరూ?

ఎవరబ్బాయివి?

అన్నదమ్ము లెంతమందీ?

ఆస్తిపాస్తు లేమాత్రం?

ఆ తర్వాత ప్రశ్న తనకు తెలియదూ?

ప్రకాశరావుకు వళ్ళుమండి—"నాకింకా పెళ్ళికాలేదు లెండి!" అన్నాడు. ఆ పెన ఏమనుకుంటావో అడుగు అన్నట్టు ముఖం పెట్టి కూచున్నాడు.

శేషయ్య గుండెల్లో బాణం నాటినట్టయి బాధపడ్డాడు. వదనంలో విషాదరేఖలు అలరించాయి. కొద్ది క్షణాలు అయాక మెల్లగా జాలిగా చూస్తో అన్నాడు—

ఏదో "అడిగాను! పెద్దవాణ్ని! తప్పు పట్టించుకోకు నాయనా! నిన్ను చూస్తే నా కేదో ప్రాణం లేచివచ్చినట్టుండి అడిగాను!"

శేషయ్య ముఖం చూస్తుంటే ప్రకాశరావుకు జాలికలిగింది. పాపం! అనవసరంగా బాధపెట్టానే అనుకున్నాడు.

శేషయ్యకు పెళ్ళీడుకొచ్చిన పిల్ల వుందేమో! ఏవేవో ఆశలతో అడిగివుంటాడు. తను సవ్యంగా సమాధానం చెప్తే ఏంపోయింది? అంతమాత్రంచేత యీ ముసలాడికూతుర్ని తను చేసుకోపోయాడా ఏమిటి?

"నా చిన్నప్పుడు - " —

శేషయ్యగొంతు ప్రకాశరావు ఊహాలను చిందరవందర చేసింది.

ఒకసారి సకిలించి గొంతు సవరించుకొని శేషయ్య మొదలు పెట్టాడు -

"నా చిన్నప్పుడెప్పుడో వోసారి మా నాన్నగారితో కలసి మీవూరు వచ్చాను. మీతాత - ధర్మదాత - దానకర్ణుడూ అని పేరు ఆయన్ని అప్పుడు చూశాను. మీ తాతగారు కట్టించిన దేవాలయం, ధర్మసత్రవు గురించి మా తండ్రిగారు చనిపోయేంత వరకూ చెప్తూ వుండేవారు. ఆయన చేతికి ఎముక లేదట! 'దేహీ' అన్నవాడికి లేదనలేదట!"

ప్రకాశరావు హృదయం కవ్వం పెట్టి చిలికినట్టుగా అయింది! మనసు వెన్నముద్దలా అయిపోయి అన్నాడు -

"శేషయ్యగారూ! అసలు మీ కేవూరు?"

"పెదపాడు! ఏలూరుదిగి నాలుగు మైళ్ళు పోవాలి!"

"ఐతే యక్స్‌ప్రెస్‌లో కేవచ్చి ఏలూరులో దిగుతారన్నమాట! మీరేం చేస్తుంటారేమిటీ?"

"ఏమో నాయనా! నా జీవితం అంతా ఇలా ఐపోయింది! మాదీ ఒకప్పుడు బాగా బతికిన కుటుంబమే! ఇప్పుడంతా చితికిపోయాను. దమ్మిడీ వచ్చేమార్గం లేదు. ముగ్గురు పిల్లలూ భార్యా. మొత్తం ఐదుగురం ఏదో మీలాంటి పెద్దకుటుంబాలవాళ్లు కనపడితే సంతోషమయి అవీ ఇవీ అడుగుతాం - మేమూ ఒకప్పుడు బాగా బతికిన వాళ్ళం కాబట్టి; ఇప్పుడు మీ అంతరానికి మాకూ ఎంత తేడావుందో తెలియక కాదు!" శేషయ్యకంఠం రుద్ధమైంది.

ప్రకాశరావు గుండెల్లో ఏదో కలచివేసినట్లైంది - శేషయ్యను తను ఎంత అపార్థం చేసుకొన్నాడు. బ్రతికి చెడ్డవాడు శేషయ్య!

"ఏమిటినాయనా దైవ బతుకులు! విరిగి రాలిపోతూన్న యీశకటం యింకెంతకాలం దొర్లుతుంది?" శేషయ్య కళ్ళల్లో నీళ్లు చిమ్మినై. వణుకుతోన్న వేళ్ళతో కళ్ళు తుడుచుకొన్నాడు.

ప్రకాశరావు ద్రవించిపోయాడు. తన కంటె రెట్టింపు వయసులో వున్నవాడు తనముందు కన్నీళ్లు పెట్టడం చూసి చాలా బాధపడ్డాడు.

ప్రకాశరావుకు ఎలా సానుభూతి చూపించాలో తోచక - "శేషయ్యగారూ! బండొచ్చే వేళయినట్టుంది! అలా ప్లాట్‌ఫారం మీదికి వెళ్దామా?" అన్నాడు.

"యక్స్‌ప్రెస్ ఇంకా గంట లేటండీ! అయ్యగారూ!" అప్పుడే లోపలకొచ్చిన పోర్టర్ అన్నాడు.

ప్రకాశరావు గడియారం చూసుకొని 'ఇంకా అరగంటకుపైన కూర్చోవాలా!' అన్నాడు.

"ఇంతకీ ఏవూరు వెళ్తున్నావో చెప్పావు కావేం నాయనా?" అన్నాడు శేషయ్య.

"ఏలూరు దిగి నాయుడు గూడెం వెళ్లాలండీ! ఇదివరకు అవూరు చూడలేదు ఏలూరుకు ఆరుమైళ్ళన్నారు! ఎలా వెళ్ళాలో?"

"ఓహో! గూడెమేనా? మా పెదపాడుకు వో మైలువుంటుంది! ఏలూరునుంచీ వంతెనదగ్గరకు బస్సు ఉంది. వంతెన దగ్గిర దిగి మావూరు దాటిపోవాలి!"

"గూడెందాకా బస్సు పోదా?"

"వేసవికాలం అయితే పోతుంది! ఇప్పుడు కాలవలు వదిలారు. పెదపాడువతలే బస్సు ఆగిపోతుంది. అఁ. అడగటం మర్చాను! ఎవరింటికి వెళ్లాలి?" అని అడిగాడు శేషయ్య.

బావుంది! యీసారి ముసలాడు అటునుంచీ నరుక్కొస్తున్నట్టున్నాడు. తనలో తనే నవ్వుకొన్నాడు ప్రకాశరావు.

"శివయ్యగారింటికి!"

"సరి సరి! అట్లా చెప్పు శివయ్యగారింటికా? వారి పెద్దమ్మాయికి సంబంధాలు వెతుకుతున్నాడులే! ఏం పనిమీదా?" ఆ


## తెలుగు ఆంగ్లభాషా బోధిని




తెలుగు చదువతెలిసినవారెల్లరు ఈపుస్తకంతో ఇతరుల సహాయం లేకనే ఇంగ్లీషుభాష సులభంగా చదువను, వ్రాయను, మాట్లాడను, ప్రత్యుత్తరాలు జరపడం నేర్చుకోవచ్చును. ఒక పెద్దక్యాలికో బైండు పుస్తకం రు 5/- వి. పి రు 1 2-0.

**కోకోక్రకము:** ఇది అసలైన కొక్కోక గ్రంథము. ఫోటోలతో వున్నది— రు 1/- వి. పి. రు. 0 12-0.

Vani Book Depot. P. B. No. 239, Madras-1.

# కనపడని మనిషి

పకేదో పగం తెలిసినవాడిలా ముఖంపెట్టి అన్నాడు శేషయ్య.

ప్రకాశరావుకు సిగ్గుముంచుకు వచ్చింది. ముసిముసి నవ్వులు నవ్వుతూ ముసలాయన ముఖంలోకి చూశాడు.

“పిల్లను చూసుకోడానికేనా? మరి వొక్కడివే వెళ్తున్నావేం?”

“అందుకు కాదులెండి శేషయ్యగారూ! శివయ్యగారి అన్నకొడుకు నా క్లాస్ మేటు! ఊరికే చూడటానికి వెళ్తున్నా!” అన్నాడు ప్రకాశరావు. శేషయ్య నమ్మతాడని తన కేమాత్రం నమ్మకంలేదు.

“చాలేవోయ్! నన్ను పిచ్చాణ్ని చేసి ఆడిస్తున్నావ్!” అన్నాడు శేషయ్య.

‘నువ్వా బాబూ పిచ్చాడివి!’ అనుకొని! ప్రకాశరావు శేషయ్యను ఆపాదమస్తకం పరిశీలించి చూశాడు.

మురికిపట్టి, అక్కడక్కడా చినుగులు పట్టిన చొక్కా, చాలీచాలని నీరుకావి ధోవతీ, మాసినగడ్డం లోతుకు పీక్కుపోయిన కళ్లూ, ఏవో వింతభయాలతో బెదిరే అచూపులూ - శేషయ్య వాలకం చూస్తే నిజంగా పిచ్చాడిలానే కనిపించాడు. పిచ్చివాడెవడూ తను పిచ్చివాడని చెప్పుకోడు కదా? అలా చెప్పుకుంటే ఇంకా పిచ్చేముంది? మంచివాడు పిచ్చివాడ్ననని చెప్పుకోవడం పిచ్చికాదు! పిచ్చివాడు మంచివాణ్నని చెప్పుకోవడం పిచ్చి! తనపిచ్చి తనకు తెలిస్తే ఇంకేం పిచ్చి?

శేషయ్యనుగురించీ, పిచ్చినిగురించీ ఆలోచిస్తోంటే నిజంగా తనకు మతిపోయేట్టుంది!

“శివయ్యకూతురు అదృష్టవంతురాలు!” మెల్లిగా తనలోతనే ఇంకేమో గొణుక్కున్నాడు శేషయ్య.

“శేషయ్యగారూ! అలాస్టావ్ దాకా పోయి కాఫీ తీసుకువద్దాం వస్తారా?” లేచి నుంచొని వళ్లు విరుచుకొంటూ అన్నాడు ప్రకాశరావు.

“నాకు వద్దు నాయనా! నువ్వుపోయి తాగిరా! నీపెట్టె అదేగదూ చూస్తూవుంటాను!” శేషయ్య ప్రకాశరావు కళ్ళలోకి చూస్తూ కృతజ్ఞతాపూర్వకంగా అన్నాడు.

ప్రకాశరావు టీస్టాలుకేసి నడిచాడు. వెయిటింగ్ రూం బయటికి రాగానే అతనికి వెనకనుంచి శేషయ్యగొంతు వినిపించింది—

“వంశపారంపర్యం ఎక్కడికి పోతుంది! దయా, దాక్షిణ్యం, ధార్మికత్వం మీరక్తంలోనే వున్నాయి నాయనా! ఎంతమర్యాద! ఎంతమర్యాదగా పిలిచావ్ కాఫీకిరమ్మని!”

ప్రకాశరావుకు నిజంగా రక్తంలో ఏవో శక్తులు ప్రవహించినట్టయింది. అతనిలో ఏవో అంతస్తులు పెరుగుతూన్నట్టయింది. తనవంశం, తనూ! అతనిలో ఏవేవో వున్న తాశయాలూ, ఆదర్శాలు కెరటాల్లా లేచినై.

శేషయ్య ఎంతమంచివాడు? బతికిచెడ్డ శేషయ్యపాపం! ఆలోచిస్తూనే టీస్టాల్ దగ్గరకు నడిచాడు.

టీ తాగి, వో సిగరెట్ వెలిగించుకొని, స్టేషన్ మాస్టరు గదిలోకి వోసారి తొంగిచూసి వెయిటింగ్ రూంలోకి తిరిగివచ్చాడు. ప్రకాశరావు.

ప్రకాశరావు లోపలకొచ్చేసరికి ఉత్తరం రాస్తూన్న శేషయ్య రాయటం ముగించి వుత్తరం మడిచి చేతులో పట్టుకొన్నాడు.

“అయ్యా! బండివస్తోంది!” అంటూ కూలీ లోపలకొచ్చాడు. ప్రకాశరావు సూట్ కేసు కూలీ చేతికిచ్చి, శేషయ్యవంక చూసి “పదండి వెళ్దాం!” అన్నాడు.

శేషయ్య సంచి తీసుకొని మౌనంగా ప్రకాశరావు వెనకే వచ్చాడు.

రైలు వచ్చి ప్లాట్ ఫారంమీద ఆగింది.

“చూడు నాయనా! ఒక్క సహాయం చేయాలి!” ప్రాధేయపూర్వకంగా అన్నాడు శేషయ్య. ప్రకాశరావుకు ఏమీ అర్థంకాక ఒక్కక్షణం నివ్వెరపోయి చూశాడు.

ఏమిటా సహాయం? టికెట్ కొనుక్కోటానికి డబ్బు లేదా ఏం ఖర్మం!

“ఏమిటది? తొందరగా చెప్పండి!” అన్నాడు ప్రకాశరావు ఖాళీగావున్న పెట్టె దగ్గరకు దోవచేసుకొని నడుస్తూను.

“అంత పెద్ద పనేం కాదు! చిన్న సహాయం! ఇదిగో యీ వుత్తరం తీసికెళ్లి మా అమ్మాయి కివ్వాలి!” చేతులో వున్న ఉత్తరాన్ని ముందుకు చాచుతూ అన్నాడు శేషయ్య.

“నేనా? నా కెట్లా వీలవుతుంది?”

“అలా అంటే కాదు నాయనా! మా ఇంటిదగ్గర నాకోసం ఎంతో ఆదుర్దా పడుతూ వుంటారు!”

“ఐతే మీ రిప్పుడు యీ బండిలో రావటంలేదా?”

“లేదు. నాకు వేరే పనుంది! ఇటు మద్రాసువైపు వెళ్లాలి! నువ్వాటుదిరిగి గూడెం వెళ్లాలంటే పెదపాడుమీదుగానే వెళ్లాలి! నువ్వెళ్లే దోవలోనే లైబ్రరిపక్క సందులో మా ఇల్లు వుంది! అక్కడ ఎవరి నడిగినా చెప్తారు.”

అంతలోకే ప్రకాశరావు పెట్టెలోకి ఎక్కి ఫుట్ బోర్డుమీద నుంచొని శేషయ్య ముఖంలోకి చూశాడు - దీనాతిదీనంగా వున్న శేషయ్యవదనం చూసి మెత్తపడ్డాడు.

“ఇదుగో నాయనా ఉత్తరం! ఈ కాస్త సహాయం చెయ్యి! నీ ఋణం వచ్చేజన్మలో అయినా తీర్చుకొంటాను!” శేషయ్యకంఠం వణికింది. ఉత్తరం ప్రకాశరావు చేతులో వుంచాడు. శేషయ్య వేళ్లు కంపించాయి

ప్రకాశరావు ఫుట్ బోరుమీదనుంచి పైకి ఎక్కి నుంచొని వుత్తరం జేబులో పెట్టుకొని ప్లాట్ ఫారంమీదనుంచున్న శేషయ్య ముఖంలోకి చూశాడు.

శేషయ్య కళ్లల్లో నీళ్లు చిమ్మినై. కనిగుంటలు నిండి ఎండిపోయిన బుగ్గలమీదగా జారటానికి సిద్ధంగా వున్నాయి.

రైలు కదిలింది.

ప్రకాశరావు దృష్టికి శేషయ్య దూరదూరంగా మసకమసకగా కన్పిస్తూ చివరకు ప్లాట్ ఫారంమీదున్న జనంలో మాయమయాడు.

రైలు వేగంగా పోతూంది రొద చేసుకుంటూ. రయ్యిన గాలి కిటికీల్లోనుండా పెట్టెలోకి వస్తోంది. వాలిపోతూన్న సూర్యకిరణాలు పెట్టెలోకి దూరి ప్రకాశరావు చంపల్నతాకి చుర్రుమనిపిస్తోన్నాయి.

జరిగిపోయినదాన్ని గురించీ, శేషయ్యను గురించీ ఆలోచిస్తూ కూర్చున్నాడు ప్రకాశరావు.

కిటికీలోంచి చూస్తుంటే, నారింజతోటలూ, అరటితోటలూ, దుక్కిదున్నాక, కృష్ణ నీటితో తడుస్తోన్న పొలాలూ వలయాకారంలో తిరుగుతూ వెనక్కు పరుగెత్తుతున్నాయి.


క్రొత్తగా ప్రవేశపెట్టబడినవి

అందము, పటిష్టముగల ఉక్కు కుర్చీలు.

సరసమైన వెలలో కొనుటకు మమ్ము సంప్రదించండి.

వివరములకు నేడే వ్రాయండి:

లల్లారాం అండ్ కో,

వెలగలేటివారి వీధి, :: విజయవాడ - 1.

“క్రొత్త షోరూమ్ మారుతీ సినిమా కెదురుగా”.

ప్రకాశరావు బుర్రలో ఊహలు జుంయి మంటూ లేచిపోతున్నాయి—

"శేషయ్య! వింత మనిషి! వింత ప్రకృతి! శేషయ్య కూతు రెవరు? ఎందుకు శేషయ్య అలా కుమిలి ఏడ్చాడు? ఎటుపోయాడు? ఈ ఉత్తరం, - శేషయ్య కూతురూ! ఏమిటి సంబంధం! ఎవరా శేషయ్య? ఏమా కథ?' ప్రకాశరావు ఆలోచనలు పంచతంత్రం బొమ్మల కథల ధోరణిలో సాగినై. ప్రకాశరావు తన ఊహలకు తనే నవ్వుకొన్నాడు.

ఎక్స్‌ప్రెస్ ఏలూరు స్టేషన్‌లో ఆగినా ప్రకాశరావు ఊహలు మాత్రం ఇంకా పరుగెత్తుతూనే వున్నాయి—

రైలుదిగి ప్రకాశరావు బస్సు స్టాండ్‌కు వచ్చాడు. కమ్ముకువస్తోన్న చీకట్లను పూర్ణ చంద్రుడు చెల్లాచెదురు చేస్తోన్నాడు.

బస్సు పెదపాడు వెళ్ళడానికి ఇంకా అర్ధగంట టైంవుంది. ప్రకాశరావు దగ్గర్లో వున్న హోటల్లో కాఫీ తాగుతూ కూర్చున్నాడు. ఉత్సాహంతో మళ్ళీ ఆలోచన సాగింది—

ఈ గొడవంతా తన కెందుకు పట్టినట్టు? తేరుగా గూడెం వెళ్ళిపోయి రేపు ఒక కవరులో పెట్టి శేషయ్య ఇంటి అడ్రసుకు పోస్టుచేస్తే సరిపోతుంది లేకపోతే యీ రాత్రిపూట ఎవరు పోతారు ఆ ఇల్లు వెతుక్కుంటూ?

అన్నట్టు ఉత్తరంలో ఏం రాశాడో శేషయ్య? అయినా ఒకళ్ళ ఉత్తరం చదవడం ఏమంత మర్యాద! ఆఁ. ఇప్పుడు దాస్తేమటుకు ఎవరు చూడొచ్చాడు? శేషయ్య ఏంరాశాడో? - ప్రకాశరావు మనసు ఉండబట్టలేకపోయింది.

ఉత్తరం మడత విప్పుతూంటే ప్రకాశరావు మెదడులో ఓబుల్లిపూవు ఫ్లాష్‌లాతట్టింది. తన చిన్నప్పుడు తాతయ్యచెప్పిన కథల్లో - రాజుగారిని వల్లో వేసుకొన్న మాయలమారి; పెద్దభార్య కొడుకు యువరాజును - తలనొప్పిమందుకోసం దేశాంతరాలు పంపడం - వాడు సప్తసముద్రాలు దాటివెళ్ళి మాయలమారి యిచ్చినవుత్తరం, దాని పెద్దక్కకు అందచేయడం - ఆ జాబులో యీ చిన్నవాణ్ణి పచ్చడికిందకొట్టి నంజుకోమని రాసి వుండడం - అంతా గుర్తొచ్చి ప్రకాశరావు హృదయంలో కలిగిన గిలిగింతలు పెదవులపై చిరునవ్వురూపంలో అవతరించి అదృశ్యమైనాయి.

ప్రకాశరావు ఉత్తరంవిప్పిచూశాడు -

"చిరంజీవి శకుంతలకు -

మీనాన్న దీవించి వ్రాయునది -

"నాకు జీవితంమీద విరక్తి కలిగింది. భార్యాబిడ్డల్ని పోషించలేని నా బతుకుమీద నాకే అసహ్యం కలిగింది. ఒకప్పుడు బాగా బతికిన నేను యీరోజున ముష్టెత్తుకొని బతకలేను. ఆత్మగౌరవాన్ని చంపుకొని 'దేహీ' అన్నా పెట్టేదాత లేడు. కష్టించి మిమ్మల్ని పోషించగల తాహతూ, బలం నాలో ఏనాడో అంతరించిపోయినై. మీకు ఇంత తిండి పెట్టలేనివాణ్ని నీకు వేలు కట్నాలుపోసి వరుణ్ని ఎక్కడ తీసుకురాగలను తల్లీ? ఎంతోకాలంనుంచి మంచానపడి తీసుకొంటూన్న మీ అమ్మకు ఇంతవరకూ సరైనమందూ మాకూ ఇప్పించలేకపోయాను. దానికి అసలు జబ్బు సరైన తిండి లేకపోవడమే! ఉన్నదంతా మీకూ నాకూ పెట్టి తను పొట్టకాల్చుకు నేది! బడికి పోవాల్సిన యీడొచ్చిన సాంబును బడికి





ఆరవై సంవత్సరములపైనుంచి డాక్టర్లు పెర్టుసిన్ టెష్నర్‌ను సిఫార్సు చేయుచున్నారు. ఎందువలనవగా అది దగ్గులకు, గొంతునొప్పికి, శ్వాసకోశ వ్యాధికి, ఉబ్బసమునకు, కోరింతదగ్గుకు ఉపశమనము నిచ్చును. క్షేమముగా స్వస్థతనిచ్చును. తీసుకొనుటకు యింపితమైనది. పెర్టుసిన్ కొనుడు!

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఏజెఫా లిమిటెడ్, షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్, స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము, యిండియాలో **ఇన్‌ఫా లిమిటెడ్**, పోస్టు ఆఫీసు బాక్సు నెం. 1041, బొంబాయి-1 వారిచే తయారయినది.

ILY-9 TEL

# ★ కనపడని మనిషి ★

కంపించలేకపోయాను. ఇక నీ పెళ్ళి సరే సరి! మూడు సంవత్సరాలుగా కాలికి బలపం కట్టుకు తిరిగాను. ఇక నా జీవితకాలం యీ మూడింటిలో దేన్నీ సాధించలేననేది యీనాటికి నాకు పూర్తిగా తెలిసివచ్చింది. నేను జీవించివుండీ మీ కష్టాలు చూడటం తప్ప నేను చేయగలపని! నా యీ మానసిక సంక్షోభంనుంచి నేను శాశ్వతంగా విముక్తిని కోరదలచాను. మృత్యుదేవతవొక్కతే దాన్ని నాకు ప్రసాదించగలదు!

నేను ఇల్లు వదిలి వచ్చాక ఏదో చేయగలనని ఆశించాను. ఏదో కొంత సంపాదించి ఇంటికి తిరిగి రాగలననుకున్నాను. ఆశలన్నీ అడియాసలయాయి. ఈపూట నాదగ్గర మిగిలింది మీ తాత వెండిపాకుండబ్బా; ఓ జత మురికి గుడ్డలూను. యీ ఉత్తరం పోస్టు చేయడానికి రెండు అణాలు లేక నో అయ్యని బతిమాలాల్సొచ్చింది. నీ తండ్రి ఆత్మాభిమానంకల మనిషి అని నీకు తెలియుంది కాదు. నా చిట్టితల్లీ! ఇక నన్ను మర్చిపో. అసలే మంచానపడి నానాటికీ క్షీణించిపోతూన్న మీ అమ్మకు యీ దారుణవార్త చెప్పకు! తెలిస్తే దాని ప్రాణాలు అప్పుడే లేచిపోతాయి. పిల్లలు పాంబూ, పాపకూ యీ సంగతి తెలియనీయకు. దిగులుపడిపోతారు. అభం శుభం తెలియని నీమీద ఎంత భారాన్ని మోపుతున్నానో నాకు తెలుసు! నాకై నేను యీ అమానుషత్వానికి శిక్ష విధించుకొంటున్నాను. నిన్ను నిస్సహాయను చేసి, మీ జీవితనౌకలను కఠోరమైన జీవితసాగరంలో చెలరేగిన భయంకరమైన పెనుగాలిలో వదిలిపెట్టి నేను ఈ జీవితంనుంచి పరారీ అవుతున్నాను. అందుకు నువ్వు క్షమించితే మీ నాన్న ఆత్మకు పరలోకంలో కూడా శాంతి వుండదు! చిట్టితల్లీ నన్ను క్షమించవూ? నా బంగారుతల్లి నన్ను క్షమించుతుంది! నాకు తెలుసు!

ఇట్లు
నీ ప్రియమైన
నాన్న
శేషయ్య"

ప్రకాశరావు దృష్టి, కళ్ళమీద పొంగిన నీళ్ళను తోసుకు ముందుకుపోలేకపోయింది. ఉత్తరంలోని ఆఖరు పంక్తులు అలికినట్టుగా కన్పించాయి. వణుకుతోన్న వేళ్ళతో ఉత్తరం మడిచి జేబులో పెట్టుకొని కళ్ళు తుడుచుకొన్నాడు.

—గుండెల్లో ఏదో కలత పుట్టింది. ఒళ్ళు నీరసించిపోయింది—అలసిపోయిన వాడిలా కూర్చుని ఆలోచించాడు—

—ఎంత దారుణం! అయ్యో పాపం శేషయ్య! తను ఎంత నీచంగా వూహించాడు? జీవితాన్ని పరిహాసం ఆడాడు! కడుపులో కాలుతున్నా కాఫీ కూడా నిరాకరించిన ఆత్మాభిమాని శేషయ్య! కోరలు చాచి వస్తోన్న మృత్యువును చూస్తూ కూడా ఎంత మామూలు మనిషిలా మాటాడాడు శేషయ్య. విషాన్ని మింగుతూ అమృతాన్ని వర్షించగల మనుష్యులు ఈలోకంలో ఎంతమంది వున్నారో?

ఈ దారుణవార్తను తను శేషయ్య కూతురుకు ఎలా అందచేయగలడు? ఆ పని చేయగల మనోధైర్యం తనకు లేదు! కన్నీళ్ళు చూస్తే చేత గుండె నీరైపోతుంది! ఉత్తరం తెల్లారాక మనిషినిచ్చి పంపిస్తే బాగుంటుందేమో?

శేషయ్య వుత్తరం ఇస్తో చూసిన చూపులు తన హృదయాన్ని ఇంకా తూకుతూనే వున్నాయి. శకుంతలకు ఉత్తరం అందచేస్తానని శేషయ్యకు మాట ఇచ్చానా? మరణించబోయేవాడి తుదికోరికను మన్నించకుండా వుండగల మనిషి వున్నాడా?

ప్రకాశరావులోని 'చిన్న మానవుడు' ఘోష పెట్టాడు—

—అలా ఆలోచిస్తో ప్రకాశరావు ఎంతసేపు కూర్చున్నాడో, హోటల్లోంచి బయటికొచ్చేసరికి బస్సు బయలు దేరబోతూంది. ఒక్క పరుగులో వెళ్ళి ప్రకాశరావు బస్సులో పడ్డాడు.

బస్సు వేగానికి లక్షరెట్ల వేగంతో ప్రకాశరావు మనసు పరుగెత్తుతూంది - పెదపాడు ఊరిబయట వంతెనదగ్గర బస్సు ఆగింది. సూట్ కేసు చేత్తో పట్టుకొని ప్రకాశరావు ఊళ్ళోకి నడిచాడు.

వెన్నెల మంచులా కురుస్తోంది.

పెద్దబజారు - లైబ్రరీ - లైబ్రరీ పక్క సందు - మలుపుతిరిగి నాలుగిళ్ళుదాటి నుంచొన్నాడు—

"శేషయ్యగారిల్లేదండీ?" అడిగాడు ఎదురుగా వస్తోన్న మనిషిని.

"అదుగో! అదే! ఆ మొండిగోడల ప్రహారీ చూడండి! అదే ఇల్లు!"

మొండిగోడల ప్రహారీ ఇల్లుదగ్గరకొచ్చి ఆగాడు ప్రకాశరావు.

పాతబడ్డ పెంకుటిల్లు! గోడలనుంచి సున్నం రాలి కుప్పలుకుప్పలుగా పడివుంది.

తలుపు దగ్గరకుపోయి మెల్లిగా తట్టుతూ పిలిచాడు—

శేషయ్యగారూ! శేషయ్యగారూ!"

ఇంకెక్కడి శేషయ్య! యీపాటికి బహుశా పరలోకంలో వుండి వుంటాడు! పరలోకంలోవున్న శేషయ్య తన పిలుపు విని పలుకుతాడా?

'శకుంతలా!' అని తనకు తెలియని అమ్మాయిని పేరుపెట్టి ఎలా పిలుస్తాడు. పిలిస్తే ఏం బావుంటుంది?'

మళ్లీ గట్టిగా తలుపుతట్టుతూ—"శేషయ్యగారూ! శేషయ్యగారూ!" అన్నాడు.

లోపల అడుగులశబ్దం! లాంతరు వెలుగు తలుపుసందుల్లో గుండా ముందుకువస్తోంది. ఉత్తరం ఆవిడకిచ్చేసి తన దారి తను చూసుకొంటాడు. ఆ అమ్మాయి పాలిట తను యమదూత! తండ్రి చావుకబురు తను మోసుకొచ్చాడు! చావుకబురు చల్లగా చెప్పాలంటారు! ఏమిటి దీ నర్థం? తనకు గొంతెండిపోతోంది. భూమ్మీద కాళ్ళకు పట్టు చిక్కడం లేదు.

ఎవరో శేషయ్య? తనకేం పట్టింది? ఉత్తరం ఇచ్చేసి గిరున తిరిగి వొక్క పరుగు పుచ్చుకొంటే సరి! ప్రకాశరావు దిగజారిపోతూన్న ధైర్యాన్ని ఎగదోసుకోటానికి ప్రయత్నించాడు. వెన్నలా కరిగిపోతూన్న హృదయాన్ని రాయి చేసుకోవాలనే ప్రయత్నం!

—కిర్రున శబ్దంచేసి; తలుపు వెనక్కుపోయింది

శేషయ్య కూతురు శకుంతల వో చేత్తో లాంతరు పట్టుకొని ముందుకు వచ్చింది—

"ఎవరూ?"

ప్రకాశం తల్లో కోయిల కూసింది! కిన్నెర ధ్వనులు అంతకుముందు విన లేదు అతను.

బంగారువన్నె శరీరం, అల్లల్లా లేచిపడుతూన్న నొక్కులజుట్టూ, తుమ్మెదల్లా చంపలమీద పడుతూన్న ముంగురులూ, విశాల నేత్రాలమీద బరువుగా వాలిపోతూన్న కనురెప్పలూ, వంపులు తిరిగి అమృతాన్ని దాచుకొంటున్న నిండు పెదవులూ, మనసుని నిలవేసే యవ్వనపు వొంపులూ, హృదయాన్ని బంధించే సౌందర్యంతో శేషయ్య కూతురు అపర శకుంతలలా ప్రకాశరావు ముందు నుంచుంది!

ప్రకాశరావు అచేతనుడై మట్టిబొమ్మలా నుంచొన్నాడు.

"ఎవరూ?" శకుంతల చూపులు ప్రకాశరావు కళ్ళల్లో గుచ్చుకొన్నాయి.

"శేషయ్యగారిల్లిదేనా?"

"ఇదే! లోపలికి రండి!" అంటూ శకుంతల లోపలకు నడిచింది. ప్రకాశరావు ఆమెను అనుసరించాడు.

—ముందువా ఇల్లు; దేముడి గదీ వొక


96"×54"
కాశ్మీర్ శాలువ
ధర రు. 280.
వెంటనే వ్రాయండి.
GENERAL SUPPLY Co.,
(A P M) Lal Kuan Delhi

వంట గది మినహా అంతా హాలుగా నేవుంది.

హాల్లో ఒక మంచంమీద ఇద్దరు పిల్లలు పడుకొని నిద్రపోతూన్నారు. శేషయ్య భార్య దేముడి గదిలో పడుకొని నిద్రపోతూంది. మూసిన తలుపు సందుల్లోంచి కొడిగట్టు లాంతరు వెలుగు హాల్లోకి కనిపిస్తోంది.

శకుంతల వాకిలి పక్క నేవున్న తన మంచంమీది పక్క పైకి చుట్టి ప్రకాశరావును కూచోమని సైగచేసింది.

ప్రకాశరావు మంచంమీద వోరగా కూర్చొని—

"శేషయ్యగారు ఒక వుత్తరం మీ కివ్వమని ఇచ్చారు!" అన్నాడు జేబులో చెయ్యి పెట్టి వుత్తరం తీస్తుంటే ప్రకాశరావు హృదయం కంపించింది.

"మా నాన్న కనిపించాడా? ఎక్కడ?" ఆదుర్దాగా అడిగింది శకుంతల.

"తె - తెనాల్లో - " తర్వాత ప్రకాశరావుకు గొంతు పెగల్లేదు. ఓ క్షణం ఆగి - "కాసిని మంచినీళ్లు ఇవ్వండీ!" అన్నాడు.

"అయ్యో అడగటమే మర్చిపోయాను!" క్షమాపణా, సిగ్గూ, నవ్వూ ఆమె చెక్కిళ్ళపై తొణికిసలాడాయి.

దూలానికి వేలాడుతున్న తాడుకు లాంతరు కట్టి మంచినీళ్లు తీసుకురావడానికి లోపలకు వెళ్ళింది శకుంతల.

- 'ఆ నడక! ఆ సోయగం!' చూస్తూ 'పాపం! ఇంకొంచంసేపట్లో ఎంత విషాద వార్త వింటుంది!' అనుకొన్నాడు అతడు.

ఉత్తరం యిక్కడ పెట్టి, ఆమె వచ్చే లోపలే వెళ్ళిపోతే -

అతని ఆలోచన పూర్తికాకముందే ఆమె వచ్చి మంచినీళ్ళగ్లాసు అందించింది.

గ్లాసు ఎత్తిపట్టి గడగడా ఒక్క బిగువున తాగేశాడు ప్రకాశరావు.

"ఇంకొంచెం ఇవ్వమంటారా?" అన్నది పెదవులపై చిరునవ్వు దాచుకుంటూ శకుంతల.

"వద్దులేండి!" వనిగాడు అతడు.

"సందేహిస్తారేం? మంచినీళ్లేగా భాగ్యం!" అంటూ గ్లాసు తీసుకొని వంటగదిలోకి వెళ్ళింది శకుంతల.

మంచినీళ్ళగ్లాసు అందిస్తో "మా నాన్న తెనాల్లో ఎప్పుడు కనిపించాడూ?" అన్నది శకుంతల.

"ఇవ్వాళ మధ్యాహ్నం!" నీళ్లు తొణికి ఆమె కుచ్చిళ్లమీదా అతని చొక్కామీద పడినై.

"ఏదండీ ఉత్తరం! ఎప్పుడువస్తానన్నాడు మా నాన్న?" అంటూ ప్రకాశరావు చేతులోంచి వుత్తరంతీసుకొని లాంతరుపక్కన నుంచొని చదవడం మొదలు పెట్టింది.

ప్రకాశరావు మెదడులోకి రక్తం చిమ్ముతోంది. అతడి మనసు బయటికి పారిపోవాలంది. కాని కాళ్లు సహకరించలేదు. ఉత్తరం చదువుకొంటూన్న శకుంతల ముఖాన్ని తదేకదీక్షగా చూస్తున్నాడు.

కొండమీదనుంచి కిందకు దొర్లే సెలయేరులా ఆమె చెక్కిళ్లమీదనుంచి కన్నీళ్లు కిందకు జారుతోన్నాయి. ముఖంమీద విషాదచ్ఛాయలు ఆవరించుతోన్నాయి.

ప్రకాశరావు ఇక భరించలేకపోయాడు. ఇక ఆ దృశ్యాన్ని తను చూడలేడు. గుండెలు విచ్చిపోయేటున్నాయి. లేచి నుంచుకొని తడబడుతోన్న అడుగులతో తలుపుదాకా వెళ్ళాడు—

వాకిలి దాటితే అదే పరుగు—

"నాన్నా!"

శకుంతలరోదనధ్వని బాణంలా ప్రకాశం హృదయానికి గుచ్చుకొంది. గిర్రున వెనక్కు తిరిగాడు—

శకుంతల వెర్రిదానిలా చూస్తో ముందుకు తూలి కుప్పగా కూలిపోతూంది!

ప్రకాశరావు ఒక్క దూకులో పోయి శకుంతలను పట్టుకొన్నాడు.

సుడిగాలిలో తెగిపోయిన లతలా అల్లల్లాడిపోతోన్న ఆమె అతడి చేతుల్లో వాలిపోయింది.

మెల్లగా మంచంమీద పడుకోపెట్టి ముఖంమీద ఇన్ని నీళ్లు చల్లి ప్రకాశం ఆమె లలాటంమీద చెయ్యివేసి నిమిరాడు.

ఆమె తేరుకొని కళ్లు తెరిచి—"నాన్నా! మమ్మల్ని వదిలి వెళ్ళిపోయావా? నాన్నా! ఇంక మాకు దిక్కెవరు నాన్నా! నాన్నా!" వెక్కి వెక్కి ఏడుస్తో అన్నది.

'నేనున్నానుగా?' అన్న మాట ప్రకాశం పెదవులదాకా వచ్చి మళ్ళీ లోపలకే పోయింది.

"ఊరుకో! శకుంతలా! అలా అధైర్యపడితే ఎలా? మనిషిని పంపించి నాన్నను వెతికిద్దాం!" అన్నాడు ప్రకాశరావు.

"నిజంగా వెతికిస్తారా? నాన్న లేకపోతే మా కెవరు దిక్కు?" జాలిగా అన్నది.

"అంతా నేను చూస్తానుగా? దిగులు పడకు! నాన్న ఎక్కడున్నా వెతికించి రప్పిస్తాను!"

"నిజంగా నాన్న తిరిగొచ్చేదాకా ఇక్కడే వుంటారా?" అతడి కళ్ళల్లోకి జాలిగా చూస్తో అడిగింది.

"ఒట్టి పిచ్చి అమ్మాయిలా వున్నావేం? ఉంటానంటినిగా! నా మాట నమ్ము!"

కాస్సేపటికి ఆమె తేరుకుంది. "అమ్మ లేస్తుందేమో మీ రీ మంచంమీద పడుకోండి! నేను అక్కడ చాప వేసుకొని పడుకుంటాను!" మంచంమీదనుంచి లేవడానికి ప్రయత్నం చేస్తో అన్నది శకుంతల.

"ఉండు! ఆఁ...! అమ్మకు వంట్లో ఎలా వుంది?"

"నాలుగు రోజుల్నుంచీ అసలు లేవడం లేదు!"

"సరే! రేపు మంచి డాక్టరు ఎవరికన్నా చూపిద్దాం! మరిచాను అడగడం! ఈ వూళ్లో మీకు బంధువులు ఎవరూ లేరా?"


# మలబద్ధకము

## మిమ్ము క్రుంగదీయుచున్నదా?



ఔను, మలబద్ధకమే చాలా బాధకలిగించు వ్యాధి. అది మిమ్ము క్రుంగదీస్తుంది, మాంద్యం కలిగిస్తుంది. నిరుత్సాహం చేస్తుంది. అయినా కూడా ప్రపంచంలో లక్షలాది ప్రజలు ఒక్కదినం కూడా బాధ పడలేదు. ఇందుకు కారణం అతి సులభమైన, నమ్మకమైన మందు బ్రూక్‌లాక్స్ తినిపెట్టుటే! రుచికరమైన యీ చాకొలెట్ భేదిమందు, మల విసర్జనం మామూలుగా కలిగించి, మీ శరీరంలోని అపరిశుద్ధమును తీసివేయును. నిద్రకు ముందు ఒక చిన్న ముక్క తినికాని, దీనివలన కలిగే లాభాన్ని మరునాడు అనుభవించండి. మీరు ఎక్కువ ఉత్సాహంగా, చురుగ్గా, శక్తివంతంగా వుండగలరు, మీరు చాలా మెరుగుగా కన్పిస్తారు




బ్రూక్‌లాక్స్
మిమ్ము రాత్రికి రాత్రి
సరిదిద్దును

(వెస్ట్ మినిస్టర్ లాబొరేటరీస్ లిమిటెడ్ లండన్ వారి నిర్మాణము)

ఏజంట్లు
ఓరియంటల్ మర్కెంటైల్ ఏజన్సీ
99 A, ఆర్మీనియన్ వీధి,
మద్రాసు.

DMA 20

# ★ కనపడని మనిషి ★

“లేరు! కొవ్వల్లో మా పెదనాన్న కొడుకున్నాడు! కాని వాళ్ళది చితికిపోయిన సంసారమే! ఇక మీరేదిక్కు! చేతిలో చెయ్యి వెయ్యండి! మానాన్న తిరిగొచ్చేదాకా మాకు సహాయంగా ఉండరూ?” అన్నది శకుంతల.

“నామాటలు నమ్మలేవా? దైవసాక్షిగా చెప్తున్నాను?” చేతిలో చెయ్యి వేసి కళ్లల్లో కళ్లు కలిపి చూశాడు.

“ఇంతకీ నాన్న! ఇంకా బతికున్నాడా? మహాపట్టుదల గల మనిషి! ఎంతపనైనా చేస్తాడు!” దిగులుగా అన్నది.

“అదే నాఅనుమానం! ఏమైనా సరే మనశాయశక్తులా వెతికిద్దాం! తర్వాత మన అదృష్టం!” సాలోచనగా అన్నాడు ప్రకాశరావు.

‘మన అదృష్టం!’ ‘మన’ అన్నమాట శకుంతల హృదయాన్ని మీటింది.

—అంతలో గదిలోంచి మూలుగు వినబడింది.

“అదుగో! మా అమ్మ లేచినట్టుంది!” అంటూ మంచంమీదనుంచి లేచింది శకుంతల.

“యీవార్త వింటే ఆమె ప్రాణాలు ఇప్పుడే పోతాయి! ఉదయం ఏదోవిధంగా సర్దిచెప్పొచ్చు!” అన్నాడు పక్కసరి చేసుకొని పడుకుంటూ అతడు.

ప్రకాశరావుకు అంతదూరంలో శకుంతల చాపవేసుకొని పడుకొన్నది.

“నాన్న తిరుగొస్తాడంటారా?” అన్నది శకుంతల.

“మాద్దాం! మనప్రయత్నం మనం చేద్దాం!” అన్నాడు ప్రకాశరావు. కాని అతనికి శేషయ్య యీపాటికి పరలోకం చేరేవుంటాడని నమ్మకం.

“వస్తాడా నాన్న? ఏమో?” దీర్ఘంగా నిట్టూరుస్తూ శకుంతల నిద్రలోకి జారిపోయింది

ప్రకాశరావు వాళ్ళ నాన్నకు తన పెళ్ళి విషయం నచ్చచెప్పటాన్ని గురించీ—నాన్నకూ తనకూ జరగబోయే ‘కుశలవ యుద్ధాన్ని’ గురించీ ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాడు.

* *

ఒకరోజున—

భోజనంచేసి పడకకుర్చీలో మేనువాల్చి పత్రిక చూస్తున్నాడు ప్రకాశరావు.

భార్య తమలపాకులు చిలకలుచుట్టి అందిస్తోంది. ఒక్కొక్కటే అందుకొని నములుతూన్న ప్రకాశరావుకు అకస్మాత్తుగా ఏదో ఆలోచన తట్టింది!

“ఏ వేలుపట్టుకొంటావో పట్టుకో! శకుంతలా!” చూపుడువ్రేలూ మధ్యవ్రేలూ ముందుకు చాచి అన్నాడు ప్రకాశరావు.

శకుంతల మందహాసం చిందిస్తూ భర్త చూపుడువ్రేలు తాకింది.

“ఐతే అబ్బాయే!” పళ్ళెరగని ఆనందంతో అన్నాడు ప్రకాశరావు.

“ఛీ పోండీ! ఏం మాటలు? అప్పుడే?” శకుంతల చెక్కిళ్లు గులాబిపువ్వులు నెదజల్లాయి.

“మీ తాతగారిపేరు పెట్టుకుందామనా అంత ఆశ!” దెప్పుతూ అన్నది శకుంతల.

“లేక మీ నాన్న పేరు పెట్టుకుందామనా?” అన్నాడు ప్రకాశరావు.

“మా నాన్న పేరు పెట్టుకుంటే మీవాళ్లు ఊరుకుంటారా? మా నాన్న పేరెందుకులెండి! మీతాతపేరు పెట్టుకోండి! మీమీ ఇష్టాలు! నాదేముందీ!” అన్నది శకుంతల.

“అదికాదోయ్!”—ప్రకాశరావు ఇంకేదో అనబోతుండగా—

“అక్కోయ్! అక్కోయ్! వుత్తరం వచ్చిందే!” అంటూ శకుంతల తమ్ముడు ఒక కవరు తీసుకొని లోపలకొచ్చాడు వాడి చేతులోంచి కవరు తీసుకొని ప్రకాశరావు అడ్రసు చూస్తోండగా—

“నాదేనండోయ్! ఇట్లా ఇవ్వండి!” అంటూ కవరు లాక్కొని చరచరా లోపలకు వెళ్లింది శకుంతల.

—ఐదు నిముషాలపాటు అలాగా పత్రిక చూస్తోన్న ప్రకాశరావుకు మనసులో ఏదో పీకుతూనే వుంది. తనకూ, శకుంతలకూ మధ్య రహస్యాలేమున్నాయి. తన చేతులోంచి ఎందుకు ఉత్తరం అలా లాక్కొని పారిపోయింది?

చివాలున లేచి ప్రకాశరావు భార్య వున్న గదిలోకి వెళ్ళాడు.

భర్తరాక పసిగట్టిన ఆయన అర్థాంగి చదువుతోన్న వుత్తరాన్ని తొందరగా పవిటచెంగున దాచేసింది.

“ఏదీ వుత్తరం?”

“మీ కెందుకూ?”

“ఎవ్వరాశారూ?” భార్య ముఖంలో దేన్నో వెతుకుతూ అడిగాడు అతడు.

“నా స్నేహితురాలు!”

“అయితే [illegible]—?”

[illegible] సిన ఉత్తరాలు మగాళ్లు ఎక్కడైనా చూస్తారా?” చిలిపిగా చూస్తో అన్నది.

“ఏమో మొగాడే రాశాడేమో?” అతనికి తెలియకుండానే మాటలు బయటికి దూకినై

శకుంతల వెలవెలపోయింది. ఆమె పెదవులు వణికినై. ఇక కన్నీళ్లే తక్కువ!

—ప్రకాశరావు నొచ్చుకున్నాడు తన మాటలకు. కాని ఆమెముఖం ఎందుకు అలా మారిపోయింది? ఎందుకాభయం! వణుకు!

అతని మనసులో విచిత్రసంఘర్షణ చెలరేగింది. అనుమానం అపనమ్మకం ఆదిశేషుడి పడగల్లా విప్పుకొని అతని హృదయంలో నాట్యం చేసినాయి—

—వేదకాలనుంచీ యీనాటివరకూ ఆడవాళ్లు మగవాళ్లను మోసంచేస్తోనే వున్నారు. భార్యలు భర్తలకు ద్రోహం చేస్తోనే వున్నారు—

—అతనిరక్తం ఉరకలు వేసింది. శకుంతలను పట్టుకొని బలవంతంగా ఆమెచేతుల్లో ఉత్తరాన్ని లాక్కున్నాడు

పులిముందునుంచొన్న లేడిలా చూస్తో శకుంతల భర్త ముందునుంచుంది:

ప్రకాశరావు ఉత్తరంతీసి చదువుకొన్నాడు—

“చిరంజీవి శకుంతలకు - దీవించి వ్రాయునది—

నీవుత్తరం అందినది, అంతా కులాసా అనిరాశావు. సంతోషం. ప్రస్తుతం అల్లుడు కూడా అక్కడే వుండివుంటాడనుకొంటాను. అందులో నా సామర్థ్యమేముంది! నీ తెలివితేటలు వుపయోగించి ఒక ఇంటిదానివయినావు. శేషయ్య కడుపున పుట్టిన బిడ్డ తెలివితక్కువదవుతుందా? ఏదో మోసం అనికాదూ రాశావు. అయితే మనుమడు నాకు అజ్ఞాతవాసంనుంచి విముక్తి ప్రసాదించాడన్నమాట! నువ్వు కోరినట్టు పోయిన ఆదివారం బయలుదేర లేకపోయినందుకు విచారిస్తున్నాను. ఎల్లుండి బయలుదేరి మెయిల్లో వస్తున్నాను. ఆఁ. మర్చిపోయాను! అల్లుడు చాలామంచివాడని రాశావు. ఆఁ. అన్నట్టు మర్చిపోయాను! కొడుకు పుట్టే వాళ్ళ తాతపేరు పెట్టుకోవాలంటున్నాడా ఆయన! పోనీ పాపం! నా మనుమడికి వాళ్ల తాతపేరే పెట్టుకోనీయిలే! ఆయన ధర్మదాత—దానకర్ణుడూ అనీ పేరు పొందాడులే! ఇంతకీ పేరు ఎవరిదైతేఏం? బుద్ధులు మనవయితే చాలమూ!

సరే! మిగతా విషయాలు స్వయంగా మాట్లాడుకోవచ్చు—

ఇట్లు
నీ ప్రియమైన
నాన్న
శేషయ్య.

★


అకాల నెరిసిన బట్టను ఆపుటకు
కాష్మీర్-కుసుం
మీ ఇష్టమైన నూనెలో నానవేసింది
యునైటెడ్ కెమికల్ కన్సర్న్, బందరు వీధి, మద్రాసు-1. విజయవాడ.
చర్మ ఉపద్రవములకు, అపాయములకు అత్యున్నతమైన సుగంధ ములాము
సాంటలక్స్
గజ్జి, పుండ్లు, కాటులు, మొటిమలు




# ప్రజల కనీస విద్యావసరాలు

ఇల్లిందల సరస్వతీదేవి

'ఓరిమి ఏడాది కష్టపడితే మా అబ్బాయి తనకాళ్ల మీద తాను నిలబడగలుగుతాడు. నాబాధ్యత తీరిపోతుంది' అని సలుగురితో చెప్పుకొని మురిసిపోతూ ఉంటారు తల్లులు. తమ పిల్లల చదువులకొరకు ఆర్థికముగా కాయికముగా ఎంతయినా కష్టపడతారు. కొందరు వితంతువులు ఈయింటా ఆయింటా వండిపెట్టి, మంచినీళ్ళ బిందెలు మోసి, డబ్బు సంపాదించి పిల్లలను చదివిస్తారు. ఆ ఆసరాకూడా లేని విద్యార్థులు కొందరు వారాలుచేసుకొని, మధూకరమెత్తుకొని, చదువుకొంటారు. ఎక్కడచూసినా పాఠశాలలు కళాశాలలు పిల్లలతో నిండి క్రిక్కిరిసి పోతున్నాయి. అవి చాలక క్రొత్తవాటిని ప్రభుత్వము వారు స్థాపించుతున్నారు. అవీ చాలక ప్రజలే ప్రభుత్వ సహాయముతో పాఠశాలలను కళాశాలలను స్థాపించి నడుపుతున్నారు. పిల్లలు అధిక సంఖ్యలో బయలుదేరేసరికి పాఠశాలలు కళాశాలలు అధికసంఖ్యలో స్థాపింపబడుతున్నాయి. పాఠశాలలు కళాశాలలు అధిక సంఖ్యలో నడపబడుతూఉండేసరికి విద్యావిధానాలు, సూత్రాలు, పాఠ్యగ్రంథాలు అనేకముగా బయలుదేరుతున్నాయి. వీటిని సమీక్షించటానికి, సలహాలివ్వటానికి అనుభవజ్ఞులైన విద్యాశాస్త్రులు, నిష్ణాతులైనవారు పరిశోధనలు సలిపి విద్యావిధానాలను నిర్ణయిస్తున్నారు.

ఇదంతా దేనికి?

ఎవరికాళ్ల మీద వాళ్లు నిలబడేటట్లు చేయటానికి. ఎవరి కాళ్ళమీద వాళ్లు నిలబడటమంటే జీవనాధారాన్ని సంపాదించుకోవటమే కాకుండా విజ్ఞానము, సంస్కారము, సంఘములో కీర్తి ప్రతిష్ఠలు గడించి బ్రతకడమన్న మాట. ఇవి కలిగిన వ్యక్తి ఆత్మగౌరవాన్ని కాపాడుకొనగలుగుతాడు. వంశగౌరవాన్ని నిలబెట్టగలుగుతాడు. తన సంస్కృతినీ దేశాన్నీ రక్షిస్తాడు. 'నేను ఫలానా దేశీయుడిని. నాజాతి వీర్యవంతమైనది. నా సంస్కృతి గొప్పది' అని పదిమందిలో రొమ్ము విరుచుకొని సగర్వముగా చెప్పుకొనగలుగుతాడు.

దీనికంతకూ మూలము విద్య!

మనిషికి వ్యక్తిత్వాన్ని కలిగించేది విద్య. ప్రతిమనిషికీ విద్య అందుబాటులో ఉండాలని ప్రజలూ ప్రభుత్వమూ అనేక విధాలుగా కృషిచేసి నిర్బంధ ప్రాథమిక విద్య అనీ, ఉచిత విద్య అనీ, వయోజన విద్య అనీ ఎన్ని విధానాలు ప్రవేశపెట్టినా, విద్య మారుమూలలకు ప్రసరించలేదు. జాతీయ ప్రణాళికలలో 'నిరక్షరాస్యతా నిర్మూలనానికి కృషి అవసరము; దానిక్రింద ఇంత ఖర్చు' అని పెద్ద మొత్తాలను కేటాయిస్తున్నారు. అయినా విద్య అందరికీ అందుబాటు కాలేదు. ఆ కారణముచేత 'ప్రతి మనిషికీ తిండీ, గుడ్డ, ఉండటానికి ఇల్లు కనీసపు వసతులు - వీటిని కల్పించేవరకూ నేను ఈ పనినుండి విరమించను' అని పండిత నెహ్రూ దీక్షాకంకణము కట్టుకొన్నారు.

ప్రతి మనిషికీ పాఠశాల విద్య, కళాశాల విద్య అందుబాటు చేయాలనీ, అవి అందుబాటులో లేకపోయినా ప్రతిమనిషికీ జీవనాధారాన్ని కల్పించే విద్యను అందుబాటు చేయాలనీ, ప్రభుత్వము సకల ప్రయత్నాలు చేస్తున్నది.

విద్య అనగా ప్రజలకు ఆర్థికముగా, సాంఘికముగా వైజ్ఞానికముగా, అభివృద్ధిని కలిగించేదని నిర్వచింపబడ్డది. కాలానుగుణముగా మార్పుచెందుతున్న ప్రపంచములో, ఎటువంటి పరిస్థితులనైనా, ఎదుర్కొని, సుఖముగా, ప్రశాంతముగా జీవితాలను గడపటానికి సహాకరించేదే విద్య. విద్య, నగరవాసులకు పట్టణవాసులకు వేరు, గ్రామవాసులకు వేరు వెనుకబడిన జాతులకు వేరుగా ప్రయోజనాలకు తగిన విధానాలలో నిర్ణ

(30-వ పేజీ చూడండి)



కృష్ణ ఒడ్డున విగ్రహం.
ఫోటో : పి. శివరామన్
—విశాఖపట్నం.



మూషికవాహనుడు.
ఫోటో: పి. రామారావు
—రాజమండ్రి.

# వినాయక చవితి —"నమ్రా"—

మట్టితో నొక ప్రతిమ
మలచి తీసుకురండి!
పొలముగట్టుల తిరిగి
పూవులాకులు తెండి!

విఘ్నేశ్వరునికంత
దఘ్నముగ పూజించు
శుభదినము వచ్చింది,
రభసమున రారండి!

పిండివంటలు చాల
దండిగా వండించి,
గుండ్రాళ్లవలెనుండు
ఉండ్రాళ్లు చేయించి,

విఘ్నేశునకు కంత
దఘ్నముగ నైవేద్య
మిచ్చేటి శుభదినము
వచ్చింది రారండి!

చాలపెద్దది బొజ్జ,
చదువులకు ఇతడొజ్జ;
సేవింప, విఘ్నాలు
రావింక మనపజ్జ.

విఘ్నేశ్వరునిభక్తి
మగ్నాంతరంగాన
కోర్కెలీడేర్చుమని
కొలువగా రండోయి!

సూర్యాస్తమయ సమయ
శోభ మెల్లన సమయ,
చవితిజాబిలి రేక
చదల పొడమగనీక,

విఘ్నేశు వ్రతకథను
వినుటకై ఎల్లరును
దేవళమ్మున కేగు
దినము నేడే, రండి!

# [illegible] కనీస విద్యావసరాలు 

ఉండవలసి ఉంటుంది. వీరి ప్రయోజనాలలో పరిస్థితులు అంతర్యాప్తమై ఉంటాయి.

ప్రతిదేశములోను వెనుకబడిన జాతులు, అభివృద్ధికి నిరోధకాలైన అవిద్య, అనారోగ్యము, దారిద్ర్యములతో పీడింపబడుతూ ఉండటము ఉన్నదే. ప్రభుత్వాలు వాటిని అరికట్టటానికి తగిన ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాయి. భారతప్రధాని కోరినటువంటి ప్రయోజనాలను కనీస జీవనాధార విద్యవల్ల (*Fundamental Education*) సాధించవచ్చునని యునెస్కో వారు ఒక తీర్మానానికి వచ్చారు.

'జీవనాధార విద్య అంటే ఏమిటి? అది కనీసపు విద్యా? బేసిక్ విద్యా? వయోజన విద్యా?' అని పరిపరివిధాలుగా ఆలోచనలు పోయే అవకాశము ఉన్నది.

1947 నవంబరులో యునెస్కో రాష్ట్రాల ప్రతినిధులు సలభియిఘుందికి పైగా సమావేశమయిన మహాసభలో, 'ఎక్కడ అవిద్య, అజ్ఞానము, దారిద్ర్యము, అనారోగ్యముల ప్రాబల్యములో ప్రజలు పీడింపబడుతున్నారో, అక్కడ జీవనాధారవిద్యను జాతీయ ప్రణాళికలద్వారా ప్రజలకు గరపవలె'నని తీర్మానించారు. ఎవరి రాష్ట్రములో వారు, స్థానికావసరాలనుబట్టి కృషి చేయ సంకల్పించారు.

వైయక్తికమైన అవసరాలను జీవనాధార విద్యానిర్వచనము తృప్తిపరచగలదని చెప్పలేము. ఇది నాగరికత ఎరుగని ప్రాంతాలలోని వయోవృద్ధులను, పిల్లలను సంబంధించినది. వారికి ఉపయోగకరముగా ఉండవలెనను విశాలదృష్టితో ఏర్పడినది. సామూహికమైన సమస్యలు, వాటిపరిష్కారము, దానికి అవసరమైన కనీసపు వసతులు మాత్రమే పరిగణింపబడే విధానము కలది. మానవుడి విధిధజీవితావసరాలకు అనువైనవివిధమార్గాలు ఈ జీవనాధారవిద్యాసూత్రాలలో ఇమిడి ఉన్నాయి.

1. భావవాకోశలము, దాని వ్యక్తీకరణ- (వ్రాయుట, చదువుట, సంభాషించుట, వినుట, గుణించుట మొదలైనవిషయాలలో)

2. వృత్తినైపుణ్యములు - ఆర్థికాభివృద్ధిని కలిగించేవి - (సేద్యము, పశువృద్ధి, గృహనిర్మాణము, నేత మొదలైన చేతిపనులు, సామాన్యసాంకేతిక నైపుణ్యములు)

3. గృహసంబంధమైన పనులు - (పాకశాస్త్రప్రావీణ్యము, శిశుసంరక్షణ, రోగులకు ఉపచారము)

4. స్వయంప్రతిభను వ్యక్తీకరించ గల కళలు (లలితకళలు - చిత్రలేఖనము, సంగీతము, నృత్యము, కవిత్వము మొదలైనవి)

5. వైయక్తికసామాజికారోగ్యముద్వారా ఆరోగ్య విజ్ఞానసాధనము.

6. భౌతికవాతావరణము, ప్రకృతివిధానములను వాటికి సంబంధించిన విజ్ఞానమును గ్రహించుట.

7. ఆర్థిక సామాజిక వ్యవస్థలను గురించిన విజ్ఞానము (న్యాయశాస్త్రము, రాజ్యాంగములను గురించిన విషయ పరిజ్ఞానము.)

8. వివిధ దేశములనుగురించి అక్కడి ప్రజలను గురించిన పరిజ్ఞానము.

9. ఆధునిక జీవితవిధానానికి తగిన పరిజ్ఞానము: స్వీయతీర్మానము, భయ మూఢ విశ్వాసములను తొలగించుకొని పురోగమించుట; సానుభూతి విశాలదృష్టుల నలవరచుకొనుట.

10. ఆధ్యాత్మిక నైతికాభివృద్ధి నైతికాదర్శములయెడ విశ్వాసము, వాటిని ఆచరించుట, పరంపరాగతమైన ఆచార వ్యవహారములను ఆధునిక జీవితానికి అనుగుణముగా, విద్యుక్త ధర్మముల ననుసరించి, మార్పు కొనే విచక్షణను పెంపొందించుకొనుట.

ఈ కనీస జీవనాధార విద్యాసూత్రాలు, పైకి కనబడినంత సులభసాధ్యాలు కావు. వీటిని సాధించటానికి అవలంబించవలసిన మార్గాలు ప్రత్యేకముగా ఉన్నాయి.

సామాజిక వ్యవస్థలు: ఏ దేశములోనయినా, పారిశ్రామికముగా అభివృద్ధిగాంచని ప్రాంతాలలో, జీవనాధార విద్యాప్రచారావశ్యకత ఎంతైనా ఉన్నది. కాని రాష్ట్రము పాటుగునా, జీవనాధార విద్యాసంస్థలను, వ్యవస్థీకరించటము మానవ శక్తికి అతీతమైనది; తగిన ఆర్థిక సహాయము తగినపరికరాల అనుకూల్యత, లభించటము కష్టము కనుక, వాస్తవముగా, చురుకుగా పనిచేస్తూ పురోగమించగల వ్యవస్థలను, పరిమితిగా స్థాపించినట్లయితే శక్తిని కేంద్రీకరించటానికి అనువుగా ఉండగలదని యునెస్కో వారు నిశ్చయించుకొన్నారు. ఈ వ్యవస్థలలో జాతీయమైనదిగాని, ప్రాంతీయమైనదిగాని విద్యాప్రణాళికలలో ఇమడగల కార్యక్రమాన్ని ప్రవేశపెట్టవచ్చునని నిర్ణయించారు.

ఈ వ్యవస్థలు సామాన్యముగా గ్రామీణ ప్రదేశాలలో ఒకేప్రాంతమువారిని (ఆ ప్రజలకు కులముగాని, జాతిగాని, దేశముగాని, నాగరికతగాని ఒకవిధమయినదిగా ఉండాలి) సమావేశపరచాలి. ఇదే సామాజికవ్యవస్థ లేక కమ్యూనిటీప్రాజెక్టు.

భాష: కొన్ని ప్రాంతాలలో బహుభాషాప్రాబల్యమూ, వాటిలో కొన్నిటికి లిపి సౌకర్యము లేకపోవటమూ ఉన్నది. కొన్ని ప్రాంతాలలో ప్రాచీనమైన చరిత్ర, సంస్కృతీగల భాషలు ఉన్నాయి. విద్యాప్రచారకులు ఆ పరిస్థితులననుసరించి నడుచుకొనవలసి ఉంటుంది. ఈ సందర్భాలలో కొన్ని విద్యాసూత్రాలను ఏమరకూడదు. పిల్లలుగాని, పెద్దలుగాని మాతృభాషలలోనే సులభముగా అర్థము చేసుకొనగలుగుతారు. ఆధునికవిద్య వారి మాతృభాషలలో గరపటానికి వీలులేనట్లయితే, ప్రాంతీయభాషలలో ప్రచార మెక్కువగా ఉన్న భాషను, రెండవభాషగా సాధ్యమైనంత త్వరలో అంగీకరించవచ్చు. అంతవరకు జీవనాధార విద్యను వాగ్రూపముగాను చతురింద్రియ సహాయముతోను బోధించవచ్చు. ఈ సందర్భాలలో లిపి సంస్కారము లేని భాషలను సంస్కరించ బూనుకోవటము కూడా ఉపయోగకరమే. అంతవరకూ పై విధానము ననుసరించవలసిఉంటుంది.

ప్రాంతీయ భాషలలో ఉపయుక్తమైనదానిని నిర్ణయించటములో, స్థానిక సౌకర్యము లేకుండ, అంతర్జాతీయముగా ప్రజల సౌహార్ద్రసహకారములకు అనుకూలించేదిగా ఉండాలి. అది సాధ్యమైనంత విస్తృత ప్రయోజనము కలదియై ఉండటము ముఖ్యము.

పాఠ్యగ్రంథాలు: భాషావేత్తల సహకారముతో భాషలను సంస్కరింపచేసి, వాటిలో బాలశిక్షలను సిద్ధముచేయించవలసి ఉంటుంది. ఒకటి రెండు పాఠ్యగ్రంథాల అనుభవముతో, వ్రాయటమూ చదవటమూ అలవడవచ్చు.

ఉపాధ్యాయులు: సాధారణ ఉపాధ్యాయ శిక్షణను పొందిన ఉపాధ్యాయులతో ఈ ఉద్యమాన్ని ప్రారంభించినప్పటికీ, ఈ విద్యాబోధనకు తగిన శిక్షణ నివ్వటము ముఖ్యమైనది. ఉపాధ్యాయులు తమ విద్యార్థుల పరిస్థితులనూ, జీవనాధార విద్యాసూత్రాలనూ ఏమరకూడదు. బోధించేది క్రొత్త భాష కనుక సులభోపాయాలను అనుసరించవలసి ఉంటుంది. ఆ భాషలో వారు కేవలము వ్రాయటము చదవటము అభ్యసించితే చాలు, అది కేవలము వాడుకకు మాత్రమే నని గ్రహించాలి.

సాధనలు: ఒక విషయాన్ని గురించిగాని, ఒక వస్తువును గురించిగాని బోధించవలసి వచ్చినప్పుడు, దానిని ప్రత్యక్షముగా చూపించి బోధించినట్లయితే, సులభగ్రాహ్య మవుతుంది. దీనికిగాను పత్రికలు, పటములు, చలనచిత్రాలు, రేడియో, గ్రామఫోను సాధనలుగా

శ్రీ వత్స వారి

# వైటోడెంట్

దంతక్రిములను సంహరించేపండ్లపొడి

గ్రహించవలసి ఉంటుంది. అయితే రేడియో కార్యక్రమాలు చలనచిత్రాలు, బోధింపబడే విద్యాసూత్రాలకు అనుకూలించినవీ, అనుసరించినవీ అయి ఉండాలి. జీవనాధార విద్యాప్రచారము విధానాలమీద సాధనల మీద ఆధారపడి ఉన్నది. ఆ విధానాలు, సాధనలు గురుశిష్య సంబంధానికి అతీతమైనవిగా ఉండాలి. కనుకనే ప్రజా బాహుళ్యానికి ప్రచారముచేసే సాధనల కంత ప్రాముఖ్యము ఇవ్వబడ్డది. ఆ సాధనలలో వస్తుప్రదర్శనశాలలు, గ్రంథాలయాలు కూడా చేర్చబడ్డవి.

సామాజిక వ్యవస్థలలో విద్యా విజ్ఞానాలను చేకూర్చే పరికరాలలో, గ్రంథాలు ముఖ్యము. ప్రపంచజ్ఞానాన్ని విద్యార్థులకు అందించటానికి, సులభశైలిలో రచింపబడిన గ్రంథాలను సేకరించి, గ్రంథాలయాలను నింపాలి. విద్యార్థులకు గ్రంథాలయాన్ని ఉపయోగించుకొనే విధానాలు బోధించాలి. ఇవిగాక పురాతనమైనవీ, చారిత్రకమైనవీ, విజ్ఞానప్రబోధకరమైనవీ వస్తువులను సేకరించి ప్రదర్శనశాలలో అమర్చాలి. దీనిలో గోడలకు తగిలించే పటాలు, అట్టలుకూడా ఉంచవచ్చు.

భవనము: సామాజిక వ్యవస్థాకేంద్ర భవనము జీవనాధార విద్యాప్రణాళికకు అనుకూలమయినదిగా ఉండాలి.

జీవనాధారవిద్యాకార్యక్రమము ప్రారంభము చేయవలెనంటే, దేనితో ప్రారంభము చేయవలెనన్నది ప్రతి సామాజిక వ్యవస్థకూ సాధారణముగా కలిగే సమస్య. ఏ ప్రాంతములో ఏది లోపిస్తుందో దానితో కార్యక్రమము ఆరంభించవలెనని యునెస్కో వారు నిశ్చయించారు. అనారోగ్య పరిసరాలలో ఆరోగ్యరక్షణకై ఉద్యమము సాగించవలసి ఉంటుంది. అత్యవసరమైనది ఆరోగ్యసంరక్షణ ప్రధానమైనది కనుక దీనితోనే ఈ ప్రాంతాలలో విద్యారంభము జరగాలి.

జీవనాధారవిద్య ప్రపంచమందంతటా గ్రామాలకు సంబంధించినదిగానే పరిగణింపబడ్డది. సేద్యగాండ్రు, ఆటవిక జాతులు, కాయకష్టముతో ప్రజలకు అత్యంతోపయుక్తమైన పరికరములను సమకూర్చేవారు. అటువంటివారి ఆర్థిక సాంఘికపరిస్థితులు ప్రోత్సాహకరముగా లేవు పరిపూర్ణజీవితవికాసానికి తగిన శాస్త్రీయపరిజ్ఞానము వారివృత్తులలో వారికి కొరవడి ఉన్నది. ఇటువంటి ప్రాంతాలలో జీవనాధారవిద్య సేద్యసంబంధమైనదిగా, సాంఘికాభివృద్ధికరమైనదిగా, ఆర్థికాభివృద్ధిని కలిగించేదిగా ఉండాలి. ఈ ప్రాంతాలలో సహజముగా ఉత్పత్తిఅయ్యే వస్తువులను ఉపయోగానికి తెచ్చి, గ్రామసౌభాగ్యాన్ని పెంపొందించి, ఆ ప్రాంతాల సంక్షేమానికై కృషిచేయవలసి ఉంటుంది.

నగరాలలోను పట్టణాలలోను పారిశ్రామికరంగాలలోని కార్మికుల వసతులకొరకు, అభ్యుదయానికి కృషి చేయటము జీవనాధార విద్యయొక్క కనీసమైన ఆశయము. వీరికి అక్షరాస్యతను కల్పించాలి. రాత్రి పాఠశాలల ద్వారా ఈ కృషి జరగాలి. వీరికి తమ విరామకాలాన్ని సద్వినియోగపరచుకొనే విధానాలను బోధించాలి. దీనివల్ల కార్మికులు తమ జీవితవికాసాన్ని గాంచగలుగుతారు.

ప్రజాభ్యుదయానికై వారికి సహకరించదలచినప్పుడు, వారి సంస్కృతిలో ఏది మంచిదో నిర్ణయించి, దానినే పునరుద్ధరించాలి. దానినే సరిక్రొత్త విధానాలలో తిరిగి వారికి గ్రహింపచేయాలి.

ప్రపంచములో శాంతిసౌఖ్యాలతో జీవితాలను గడపటానికి, అనువైన విద్యా సాంఘిక ఆర్థికాభివృద్ధి ప్రజలకు కలిగించటానికి జీవనాధారవిద్య ఒక కొలతబద్దగా, కనీసపు విద్యగా పరిగణింపబడినది. కాని ప్రజల జీవనప్రమాణాన్ని, విద్యా విధానాలద్వారా హెచ్చింపటానికి సాధ్యము కాదు. ఆర్థికాభివృద్ధిని కలిగించే విధానాలకు విద్య దోహదమిచ్చేదిగా ఉంటుంది. స్థానిక పరిశ్రమాభివృద్ధికి, సహకార సంస్థలను వ్యవస్థీకరించుకొని, ప్రజలే వాటిని నిర్వహించుకొన్నట్లయితే - జీవనాధార విద్యకూ జీవనప్రమాణానికీగల సన్నిహిత సంబంధము సార్థకము కాగలదు.

భారతదేశములో జీవనాధారవిద్యను అంగీకరించటము కష్టమైనపని కాదు. ఇప్పటికే సోషల్ సర్వీస్, నిమ్నజాత్యుద్ధరణ, నిమ్న తరగతుల అభివృద్ధి మొదలైన పేర్లతో అనేక రకాలుగా, కొన్ని నియమితవిధానాలలో, కృషి జరుగుతున్నది; బడ్జెటులో కొంత ధనము కేటాయింపబడుతునే ఉన్నది. వీటన్నిటినీ క్రోడీకరించి, జీవనాధారవిద్యావిధానముతో క్రమబద్ధము చేసి ఉద్ధరింపవచ్చు.

ఉపాధ్యాయులకు గాని భాషా విషయములో గాని మనకంతగా ఇబ్బందులు లేవు. పాఠ్యగ్రంథాలకు కూడా ఎక్కువ కష్టము లేదు. తెలుగుభాషలో పెద్దబాలశిక్షను జీవనాధార విద్యాసూత్రాలననుసరించి సంస్కరించి, దానినే ఇతర భాషలలోకి, అవసరాన్ని బట్టి, అనువాదము చేయవచ్చు. పెద్దబాలశిక్షవంటిదానిని శ్రీ. కే. ప్రతాపరెడ్డి గారు 'యువజనవిజ్ఞానము' అనే గ్రంథాన్ని రచించారు. దానినికూడా పై విధానాలకు అనుకూలముగా సంస్కరించుకొనవచ్చు.

సంఘసంక్షేమ కార్యక్రమాలలో, జీవనాధార కార్యక్రమాన్నికూడా చేర్చి స్త్రీలు నిర్వహింపవచ్చు. ఉపాధ్యాయులుగా ఉన్న దంపతులను, సామాజిక వ్యవస్థలలో నియమించినట్లయితే, కార్యక్రమము విజయవంతమవుతుందనటములో సందేహము లేదు. చేయగలిగినప్పటికీ చాలా మంది స్త్రీలు సంఘసంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనలేకపోవటము సాంసారికమైన ఇబ్బందుల వల్లనే. కనుక దంపతులనే నియమించినట్లయితే ఈవిధమైన చిక్కులు తొలగగలవు.

'ప్రతిమనిద్దృష్టవంతుడి కన్నీరు తుడవటానికి నా జీవితాన్ని వినియోగిస్తాను' అని మహాత్ముడు శపథముచేసి తన జీవితాన్ని దానికే అర్పించాడు. ఈనాడు భారత ప్రధాని 'ప్రతిమనిషికీ తిండీ, గుడ్డ, నీడ కల్పించితీరుతాను' అని ప్రజలకు వాగ్దానముచేశారు. దానికై ప్రభుత్వము జీవనాధారవిద్యావిధానాన్ని అంగీకరించినట్లయితే ప్రతిమనిషికీ కనీసపు జీవితావసరాలను కల్పించినదవుతుంది. ఈ కనీస జీవనాధార విద్యను మూలాధార విద్య అని అన్నా అనవచ్చు. ★




# ఆడవాళ్లు అనుమానం మనుషులా?

## మ. రుక్మిణీగోపాల్

అప్పుడే మావారు కాఫీ త్రాగి ఆఫీసుకు వెళ్ళారు. వంట ప్రారంభిద్దామనుకుంటూ, కత్తిపీటమీద కూర్చుని కూరలబుట్ట ముందుకు లాక్కున్నాను. వీధి తలుపు చప్పుడైంది. వెళ్ళి తలుపుతీశాను. ప్రక్కవాటాలోని కామాక్షమ్మగారు లోపలికొచ్చింది. వస్తూనే "మేడమీది వాటాలోకి కొత్తగా దిగారండోయ్. మీరు చూశారా?" అంది, అదోలా మొహం పెట్టి. నేనేమీ పట్టించుకోనట్టు 'లేద'న్నాను. అంత నిర్లిప్తత ఆవిడకి నచ్చలేనట్టుంది. ఏం మనిషి అన్నట్టు ఒకసారి చూసి—

"నిన్న సాయంత్రమే దిగారు. కొంచెం కనుచీకటి పడిందేమో ఎవరో పోల్చుకోలేకపోయాను. కాని పొద్దున్న స్పష్టంగా చూశాను" అంది ఆగుతూ...

నాకీ సంభాషణ అంతా అనవసరమనిపించింది. మేడమీది వాటాలోకి ఎవరు దిగితే మాత్రం ఈవిడ కెందుకో, అనుకున్నాను. ఆవిణ్ణి నిరుత్సాహపరచటం ఇష్టంలేక "మీ కెరుగుదు రేవిటి వారిని" అని అడిగాను.

ఇంతసేపటికి సరైన ప్రశ్న వచ్చినట్టు ఆవిడముఖం వికసించింది. "అయ్యో, ఎరక్కపోవట మేవిటి? పేటలో ఉన్నప్పుడు వీళ్ళు మా పక్కవాటాలోనే ఉంటూ ఉండేవారు. ఆవిడపేరు సరస్వతి" అని కొంచెం నవ్వింది; ఏదో గ్రంథమున్నట్లు. నాకు చిరాకు వేసుకొస్తోంది. చెప్పేదేదో పూర్తిగా చెప్పక మధ్యమధ్య ఆగటమెందుకో! కొందరికి అదో సరదా, మాటమాటకి 'అడిగించుకుంటేకాని ఏ విషయం పూర్తిగా చెప్పరు.

"అయితే ఆవిడకూ, మీకూ చాలా స్నేహమే ఉండిఉంటుంది" అన్నాను.

కామాక్షమ్మగారి మూతి మూడు వంకరలు తిరిగింది.

"ఆ, స్నేహాని కేంలోటు" అంటూ కొంచెం దగ్గరికి వచ్చి, నెమ్మదిగా "ఆవిడ వట్టి అనుమానం మనిషండీ. ఇరుగు పొరుగు ఆడవాళ్ళని తిటిపోస్తుంది. ఒకరోజు ఆయన ఆఫీసునుంచి వచ్చేసరికి నేను వీధి గుమ్మంలో నుంచున్నానని, పిల్లిమీదా ఎలకమీదా పెట్టి ఎన్ని తిట్టిందో! అప్పటినుంచి వాళ్లింటికి వెళ్ళటంకాని, ఆవిడతో మాట్లాడటంకాని మానుకున్నాను. ఆయన చాలా పెద్దమనిషి. వంచిన బుర్ర ఎత్తడు. పెళ్లాం నోటికి దడుస్తాడు."

చెప్పవలసిందంతా చెప్పి కర్తవ్యం ముగించుకున్నట్టు నిలబడింది కామాక్షమ్మగారు.

అప్పటికిగాని నాకు తటనేలేదు, ఇంటికి వచ్చిన పెద్దమనిషిని కూర్చోమనలేదని.

"కూర్చోండి కామాక్షమ్మగారు, నుంచునే ఉన్నారు" అన్నాను.

"ఇంట్లో బోలెడంత పని ఉందమ్మా. ఇప్పుడు కూర్చునేందుకు కూడా తీరుబడి ఎక్కడ? మీతో ఈమాట చెప్పిపోదామని వచ్చాను. ఆవిడ విషయంలో జాగ్రత్తగా ఉండండి." అంటూ వెళ్ళిపోయింది. ఆవిడ పరోపకారబుద్ధికి నాకు నవ్వు వచ్చింది. వీధి తలుపు గడియ పెట్టి మళ్ళీ కత్తిపీటమీద కూర్చున్నాను.

నా దృష్టి అంతా ఆ సరస్వతిమీదే నిలిచింది. నాకిలాంటి అనుమానపు స్వభావం ఉన్నవాళ్ళను చూస్తే చాలా చిరాకు. ఇటువంటివాళ్లు నలుగురితో సరదాగా మెలగలేక అనవసరమైన అపోహలతో కుమిలిపోతూ, తమలో తాము దహించుకుపోతూ, ఉంటారని నా ఊహ. అదేమాదిరి భావం ఈ సరస్వతిమీద కూడా కలిగింది. కాని ఈమాటు నా ఆలోచనలు వేరుగా కొత్త పంథాలో నడవటం మొదలెట్టాయి. ఇటువంటివాళ్లను సంస్కరించేందుకు ఉపాయం లేదా? అని ఆలోచించాను. ఇలాంటి భార్యతో ఆ భర్త ఎంత ఇబ్బంది పడుతున్నాడో, అన్న ఆలోచన ఆ క్రొత్త వ్యక్తిమీద ఒక రకమైన అభిమానాన్ని నాలో కలగజేసింది. మధ్యాహ్నమే వెళ్ళి ఆవిడతో పరిచయం చేసుకోవాలనుకున్నా. ఎలాగైనా ప్రయత్నించి ఆవిడ అపోహ మాన్పించి, ఆవిణ్ణి ఒక కొత్త వెలుగులోకి తీసుకురావాలని నిశ్చయించుకున్నా. ఆవిణ్ణిగురించి ముందుగానే తెలిపి కామాక్షమ్మగారు చాలా ఉపకారం చేసిందనుకున్నా. ఇటువంటి తొందరపాటు స్వభావం గలవాళ్ళు కూడా సంఘానికి ఒకరకంగా సహాయపడతారని ఈనాడు గ్రహించాను.

మధ్యాహ్నం మేడమీది వాటాలోకి వెళ్ళాను. సరస్వతే వచ్చి తలుపు తీసింది. నన్ను చూడగానే మొదట కొంచెం తెల్లబోయింది. కాని సంబాళించుకుని "రండి, కూర్చోండి" అంది, మూలనున్న చాప తీస్తూ. మనిషికంఠంలో కొద్దిగా కర్కశత్వం ఉంది.

"మేము ఈ కింది వాటాలోనే ఉంటున్నాం..నిన్న సాయంత్రమే వచ్చారనుకుంటాను." అన్నాను కూర్చుంటూ.

"అవునండి, నిన్న సాయంత్రమే వచ్చాం" అంటూ ఇంకేమి మాట్లాడాలో తెలియనట్టు ఒడిలో చంటిపిల్లాడి జుట్టు నిమురుతూ ఊరుకుంది.

నేను మనిషిని కొంచెం పరకాయించి చూశాను. మనిషి తెల్లగా ఉంది. లావు కాకుండా సన్నం కాకుండా, పొడుగూ కాకుండా, పొట్టి కాకుండా మధ్యరకంగా ఉంది. కళ్ళు పెద్దవే అయినా కాంతిహీనంగా ఉన్నాయి. మొహంలో కొంచెం కాఠిన్యం ఉంది. అది ముఖచ్ఛాయలో మోటుతనం కాదు; స్వభావంచేత కలిగిన కాఠిన్యంలా ఉంది. అన్నిటికంటె కొద్దిగా ఉంగరాలు తిరిగిన ఆమె పెద్ద జుట్టు ఆకర్షణీయంగా ఉంది. వయసు పాతికేళ్లకు మించనిదానిలా ఉంది. పిల్లల తల్లి కావటంతో ఉండవలసినంత నాజూకుతనం లేదు. ఏమైనా తగినవిధంగా అలంకరించుకుంటే ఆకర్షణీయంగానే ఉంటుందనిపించింది. హఠాత్తుగా ఆవిడ మొహం ఎత్తి చూసింది. నా చూపులు ఆవిడ మొహంమీంచి కిందికి దిగాయి. ఇంతవరకు ఏం మాట్లాడకుండా ఆవిణ్ణి పరికిస్తూ కూర్చున్నందుకు నాకే సిగ్గేసింది.

15 జ్యూయల్సు రిస్టువాచి రు. 5/-



ఇది 15 జూయల్సు రిస్టువాచి అందానికి గట్టికి 15 సం॥లు గ్యారంటీ దీనితో ఒక ఫౌంటెన్ కలం ఇవ్వబడును ఖరీదు రు. 5/-లు. వెంటనే ఆర్డరు ఇవ్వండి.

SWISS WATCH SUPPLIERS
(A P M) Lal Kuam. Delhi.

"ఎంతమంది పిల్లలు?" అడిగాను.

"ముగ్గురు."

మళ్ళీ ఆవిడ బుర్ర వంచుకుంది. ఇలాగ ఒక్కతినే ఎంతసేపు మాట్లాడగలనో నాకర్థం కాలేదు. కొత్తవాళ్లతో మాట్లాడటం నాకసలు చాతకాదు. ఏదో విధమైన ఆకర్షణ నన్నిలా ఈడ్చుకొచ్చింది.

"మీరీ ఊరొచ్చి ఎన్నాళ్లయింది?" అన్నాను.

"రెండేళ్ళయింది."

మళ్ళీ మౌనం. నాకు చిరాకెత్తుకొచ్చింది. ఇనప గుగ్గిళ్లు కాని అనపగుగ్గిళ్లు కావు అనుకున్నాను.

"మీరు కొత్తగా వచ్చారంటే చూడాలని వచ్చాను. వెడతాను. పనుంది. మా యింటికి కూడా ఒకసారి రండి." అంటూ వచ్చేశాను. నేను వచ్చేటప్పుడు కూడా ఆవిడ ఏమీ మాట్లాడలేదు.

ఆమర్నాడు [illegible] మధ్యాహ్నం సరస్వతి మా యింటికి రావటంతో ఆశ్చర్యపోయాను. ఒక విధమైన సంతోషంతో ఆహ్వానించాను. మొదటి రోజుకంటె బాగానే మాట్లాడింది. ఆరోజు అలా ఎందుకు ప్రవర్తించిందో నాకర్థం కాలేదు. తన అత్తవారినిగురించి, పుట్టింటివారినిగురించి ఏవేవో చెప్పింది. కాని భర్త మాట మాత్రం ఎక్కడా రానివ్వలేదు. ఈ ప్రవాహంలో ఆ వ్యక్తిని గురించి ఒక్క మాటన్నా దొర్లకుండా ఉంటుందా అనుకున్నా. కాని ఆ విషయంలో మాత్రం ఆవిడ చాలా జాగ్రత్తగా ప్రవర్తించింది.

అక్కడనుంచి మేము తరుచు కాకపోయినా, అప్పుడప్పుడు కలుసుకుంటూ ఉండేవాళ్ళం. ఆవిడ నాతో బాగానే మాట్లాడేది. నేను కూడా ఆవిడ స్వభావాన్నిగురించి మొదటే తెలుసుకున్నాను కాబట్టి ఆయన తన వాళ్లలో [illegible] వారింటికి వెడుతూ, నామీద ఎటువంటి చెడ్డ అభిప్రాయం కలగకుండా ఉండేందుకు ప్రయత్నించేదానిని. నే నెవరింట్లోను ఎక్కువగా వెళ్ళనని, అందరితో స్నేహం కలుపుకోనని పేరుంది. ఒకవిధంగా అది నిజమే కూడాను. కాని ఈవిడతో ఇంత ఆత్మీయత ఎందుకు కలిగిందో అర్థంకాదు. కామాక్షమ్మగారికి మాత్రం మా స్నేహం నచ్చలేనట్టుంది. సరస్వతితో స్నేహం, నన్ను ఆవిడనుంచి దూరం చేస్తున్నట్టు భావించసాగింది. ఆ భావం చూపులలోను సూటిపోటు మాటలలోను వ్యక్తపరిచేది. నే నేమీ పట్టించుకునేదాన్ని కాను.

క్రమంగా సరస్వతికి కూడా నేనంటే ఒకవిధమైన గౌరవం ఏర్పడుతోందని గ్రహించాను. ముఖ్యంగా ఆయన కంటబడకుండా ఉండేందుకు నేను చేసే ప్రయ





అనాసిన్ నాలుగు మందులయొక్క వైజ్ఞానిక మిశ్రమము ఇది నరముల ముఖ్య స్థానములందు తీవ్రమైన మిశ్రమచర్యను జరిపి, నొప్పి, తలనొప్పి, జలుబులు, జ్వరం, పన్నునొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రవిముక్తిని కలిగించును.

1. క్వినైన్: అధిక శక్తి నిచ్చు మరియు జ్వరనివారణ మొనర్చు గుణాలకు ప్రఖ్యాతి గాంచినది, జ్వరాన్ని తగ్గించడంలో మిక్కిలి శక్తిగలది.
2. కఫీన్: బలహీనానికి మరియు చిక్కిపోయినందులకు తగిన ఔషధమని విరివిగా వాడబడుచున్నది.
3. ఫినాసిటిన్: తీవ్రమైన బాధా నివారణి జ్వర నివారణియని ఖ్యాతిచెందినది.
4. అసిటైల్ సాలిసిలిక్ ఆసిడ్: తలనొప్పి, మరియు అలాటి బాధలను పోగొట్టుటకు మిగుల ఉపయుక్తమైనది.

ఈ నాలుగు మందులు సరిగ్గా వైద్యునియొక్క ఔషధయోగము వలె పనిచేయును 'అనాసిన్' గుండెకు హాని కలిగించదు, లేక కడుపును అవకతవక చేయదు. నొప్పి, తలనొప్పి జలుబులు, పన్నునొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రంగా మరశితమైన మరియు రూఢియైన విముక్తికొరకు ఎల్లప్పుడూ 'అనాసిన్'నే వాడండి.




లక్షలాది మందికి బాధావిముక్తిని కలిగించును

A.43

తాన్నాలు, ఆవిడ్నే ఎక్కువగా ఆకర్షించేయి అనుకుంటాను. "చదువుకున్నవారైనా మీ పద్ధతి వేరండి. ఇప్పటికాలంవాళ్లకి మొగుడంటే అసలు గౌరవంలేదు. ఎదురుగా వస్తుంటే పక్కకి తప్పుకోనన్నా తప్పుకోరు" అనేది. నేను నవ్వి ఊరుకునేదాన్ని. నేనంటే ఆవిడకు గురి కుదిరినందుకు లోలోపల సంతోషించేదాన్ని. కామాక్షమ్మగారు చెప్పిన విషయం ఆమెలో నా కెప్పుడూ గోచరించలేదు. కొందరు వ్యక్తులు ఇతరులనుగురించి చెడ్డగా చెప్పుకుని సంతోషిస్తారేమో అనుకున్నాను.

ఆయనకూడా చాలా పెద్దమనిషిలా కనిపించాడు. వంచిన బుర్ర ఎత్తేవాడు కాదు. ఈ విషయంలోమట్టుకు కామాక్షమ్మగారు చెప్పింది అక్షరాలా నిజమయింది. మా వీధి గదిలోంచే పైకి వెళ్లటానికి మెట్లున్నాయి. అక్కడే ఆయన తన సైకిలు పెట్టుకొనేవాడు. ఆయన సైకిలు తీసుకుందుకు వచ్చే టైముకు నే నెప్పుడైనా అక్కడున్నానంటే, నే వెళ్ళిపోతేకాని పూర్తిగా మెట్లు దిగేవాడు కాదు. ఏ సాయంత్రం వేళైనా నేను దొడ్లో కూర్చున్నప్పుడు, ఆయన డాబామీదికి రావటం తటస్థిస్తే, నన్ను చూసి వెనక్కి వెళ్ళిపోయేవాడు. ఇటువంటి వ్యక్తినిగురించి, ఆవిడ అలాంటి అభిప్రాయం ఎలా పడేనో నాకర్థంకాలేదు.

ఓరోజు సరస్వతి ఇంట్లోంచి పెద్దపెద్దగా కేకలు వినపడ్డాయి. అది సరస్వతి గొంతుకే. మధ్యమధ్య పనిమనిషి సణుగుడుకూడా వినపడింది. ఏదో పనిదగ్గర పేచీ వచ్చింది కాబోలు, అనుకున్నాను. ఇంతలో పనిమనిషి కళ్లు తుడుచుకుంటూ వచ్చి "కాఫీ గిన్నె లెయ్యండి అమ్మగారూ"అంది. మాకు పనిచేసేదే సరస్వతి ఇంట్లోకూడా చేస్తోంది. గాని కళ్ళు ఎరుపుదనం చూసి 'ఏం జరిగిందో' అని అడగకుండా ఉండలేకపోయాను.

"చూడండమ్మగోరూ, నే నేమన్నా మొగాడికోసం మొహం వాచిపోయానా! అయ్యగారు లోపల ఉన్నారని తెలీక గది ఊడవటానికి వెళ్ళాను. అది తప్పొచ్చింది ఆ అమ్మకి. నానా మాటలూ అంది. నా మొగోడు అసలే మంచోడు కాదు. ఇంటే సంపేత్తాడు" అంటూ మళ్ళీ ఇంకోసారి కళ్లు తుడుచుకుంది.

"అయ్యగారు ఉన్నట్టు నాకు తెలవక వెళ్లానమ్మా, తెలిస్తే వెళ్ళకపోదును—అని చెప్పలేకపోయావుటే" అన్నాను.

"సెప్పినానమ్మా. ఆ యమ్మ ఇనిపించుకుంటేగా, ఆ యమ్మతోరణి ఆ యమ్మదే" అంటూ గిన్నెలు తీసుకు పెరట్లోకి వెళ్ళిపోయింది.

ఇన్నాళ్ళకు కామాక్షమ్మగారు 'చెప్పిన దాంట్లో కొంతైనా నిజం లేకపోలే దనిపించింది. ఈ పనిమనిషిస్వభావం నాకు బాగా తెలుసు. ఇటువంటి విషయాన్ని గురించి నాకెప్పుడూ అనుమానం అనిపించలేదు. ఈ చుట్టుపక్కల చాలా ఇళ్లలో పని చేస్తోంది కాని ఎప్పుడూ ఇలాంటి గొడవ జరగలేదు. ఈవిషయంలో కేవలం సరస్వతి అపోహపడిందనే అనుకోవాలి. కాని ఆవిడ ఇటువంటి అపోహపడటానికి ఆధారం ఏముందో నా కెంత ఆలోచించినా దొరకలేదు. పోనీ, మొగుడైనా అల్లరి చిల్లరివాడా అంటే అదీలేదు. ఇంక ఇది కేవలం ఆవిడ మూర్ఖత్వం తప్ప విడిచి మరేంకాదని నాకు తోచింది. ముఖ్యంగా అటువంటి ఉత్తముడైన భర్తనుగురించి ఆవిడ ఇలా దురభిప్రాయపడటం నా కెంతమాత్రం నచ్చలేదు. ఎలాగైనా ఆవిడ బుర్రని ఇటువంటి కుళ్ళులోంచి బయటికి లాగాలనుకున్నాను. ఇంతవరకూ ఏమనుకుంటుందో అని ఈ విషయం ఆమెదగ్గర ఎప్పుడూ ఎత్తలేదు. అయినా తరుణంకూడా ఎప్పుడూ చిక్కలేదు. ఇప్పుడు ఈ వంకని ఒకసారి తప్పకుండా కదపాలనుకున్నాను.

ఆ మధ్యాహ్నమే సరస్వతి మా యింటికొచ్చింది. కొంతసేపు ఏవో అవీ ఇవీ మాట్లాడుకున్నాం. ఇంక ఈ విషయం కదుపుదామనుకుంటున్నాను. ఇంతలోకే సరస్వతి అంది. "ప్రొద్దుట మా ఆడబిడ్డకు పురుడు వచ్చిందట. మా ఆడబిడ్డగారు ఈ ఊర్లో ఉన్న సంగతి మీ కిదివరకే చెప్పాననుకుంటాను. పొద్దుట కబురు తెలిస్తే మా ఆయన వెళ్ళి చూసొచ్చారు. 'పిల్లలు ఒక్కళ్లూ తంటాలు పడుతున్నారు, వదిన్ని పంపు' అని చెప్పిందట మా ఆడబిడ్డ. సాయంత్రం బయలుదేరి వెళుతున్నాను. ఈ పది రోజులూ ఉండి నీళ్ళువాడు తిరిగొస్తాను. ఈ సంగతి మీతో చెప్పిపోదామని వచ్చాను" అంది.

సరే ఇప్పుడా గొడవ లేవటం ఎందుకు, వెళ్ళొచ్చిన తరువాతనే కదపొచ్చని ఊరుకుని "అలాగే వెళ్ళిరండి" అన్నాను. ఆ సాయంత్రమే సరస్వతి వెళ్ళినట్టు పనిమనిషి చెప్పింది.

ఆరోజునుంచి మావారికి రాత్రి డ్యూటీ పడింది. త్వరగా భోజనం తెముల్చుకుని ఆయన వెళ్ళిపోయారు. నేను కూడా భోజనం పని ముగించుకుని కాలక్షేపానికి ఒక పత్రిక తీశాను. వీధితలుపు చప్పుడైంది. ఈ వేళప్పుడు వచ్చేవాళ్లెవరా అనుకుంటూ తలుపు తీశాను. గుమ్మంలో ఉన్న వ్యక్తిని చూసేసరికి నా ఆశ్చర్యానికి అంతులేకపోయింది. సరస్వతి మొగుడు! ఏమనాలో అర్థంకాక అలా చూస్తూ ఉండిపోయాను.

"కొంచెం మంచినీళ్లు పోస్తారా? ఇవాళ పనిమనిషి మంచినీళ్లు తీసుకురాకుండా వెళ్ళిపోయింది." అంటూ చేతిలో మర చెంబు పట్టుకుని ఒకడుగు ముందుకు వేశాడు. నా అనుమానానికి నాకే సిగ్గేసింది. అసలు ఆడజాతే ఇంతేనేమో అనిపించింది. గుమ్మంలోకొచ్చిన పెద్దమనిషిని ఏం కావాలనైనా అడగలేదు.

"అలాగే, కూర్చోండి, పట్టుకొస్తాను" అంటూ లోపలికి వెళ్లి, చెంబుతో నీళ్లు తెచ్చి ఆయన చెంబులో పోశాను. ఆయన వెళ్లటానికి లేవలేదు. అలాగే కూర్చుని కొంచెం తటపటాయిస్తూ "మీతో ఒక విషయం చెప్పుదామని వచ్చాను. మీ కభ్యంతరం లేకపోతే కొంచెం ఆ తలుపేస్తారా?" అన్నాడు పూర్తిగా, నా ముఖంవంక చూడకుండా. మళ్ళీ నేను ఆశ్చర్యంలో మునిగిపోయాను. ఆయనకు నాతో చెప్పవలసిన రహస్యం ఏముందా అని ఆలోచించాను. నా బుర్ర కొంచెం వేగంగా పనిచెయ్యటం మొదలెట్టింది. బహుశా భార్యవిషయంలో ఏమైనా చెప్పి, నా సలహాకాని, సహాయంకాని కోరతాడేమో అనుకున్నాను. ఈ సమయంలో ఆయన్ని అనుమానించటం నామీద నాకు నమ్మకం లేకనా, అనిపించింది. ఏమైనా ఆయన చెప్పే విషయమేదో తెలుసుకోవాలనే కుతూహలంతో తలుపు వెయ్యటానికి వెళ్లాను. తలుపు వేయబోతూ అకస్మాత్తుగా వెనుదిరిగి చూశాను. ఆయన నాకు చాలా సమీపంలో నుంచున్నాడు. ఆయన రెండుచేతులూ నా నడుము చుట్టివేసే ప్రయత్నంలో ఉన్నాయి. కళ్ళు కామంతో నిండిపోయి ఉన్నందుకు చిహ్నంగా ఎర్రబారి ఉన్నాయి. ఒక్కసారి తలుపులు రెండూ బార్లా తీసేసి బయటికి పరుగెత్తాను. భయంతో వణికిపోతున్నాను. గుండెలు దడదడ కొట్టుకోసాగాయి. భయం, కోపం, అసహ్యంతో నా హృదయం నిండిపోయింది. "వెళ్ళిపోతారా, నలుగుర్నీ కేకెయ్యమంటారా?" సాధ్యమైనంత గట్టిగా అన్నాను. "క్షమించండి, వెళ్లిపోతాను. మీ స్వభావం ఎలాంటిదో తెలియక పొరపాటు చేశాను." అంటూ మరచెంబు తీసుకుని వంచిన బుర్ర ఎత్తకుండా వెళ్ళిపోయాడు. బ్రతుకు జీవుడా అనుకుని లోపలికి పోయి తలుపు బిగించుకున్నాను. నా వణుకు ఇంకా తగ్గలేదు కాని నా ఆశ్చర్యానికి అంతులేకపోయింది. నేను ప్రతిరోజూ చూసే వ్యక్తేనా ఈ వ్యక్తి అనిపించింది. ఇటువంటి భర్తల విషయంలో భార్యలు అనుమానపడితే తప్పా? ఆడవాళ్లు అనుమానంమనుషులని టక్కున అనేస్తారు. భర్త స్వభావం ఎరిగున్నదికాబట్టే సరస్వతి ఆయన విషయంలో అలా ప్రవర్తించేది. అది తెలుసుకోలేక ఈ నివురుగప్పిన నిప్పును చూసి ఆవిడ్నే ఆడిపోసుకుంటుంది లోకం! ★




# నీతిగీతి

దూతలూరి జగన్నాథం

**1**

ఉదయసమయమున
సూర్యునికెదురుగ
నిలబడి చూడుము
నీ నీడ!

**2**

అంతకంతకూ
మధ్యాహ్నమునకు
తరుగుచు తరుగుచు
మరుగుపడున్.

**3**

అదేరీతిగను
అపరాహ్ణమ్మున
నిలబడిచూడుము
నీ నీడ!

**4**

కొంచెకొంచెముగ
మించుచు మించుచు
గొప్పదియగునది
క్రుంకుతరిన్.

**5**

దుర్జనమైత్రికి
సజ్జనమైత్రికి
తేడా ఇదియని
తెలిపగ మెలగుడు!




# పావురాలు, కాకి

కళల పుట్టిల్లు, కవుల కాణాచి,
సిరి కాటపట్టు సేమాసు దీవి
గ్రీసుదేశమున వాసికెక్కినది.
ఈ కథలకర్త ఈసపొకనాడు
సేమాసు నగర సీమ నొకచోట
తోటి బానిసల తోటి సభచేసి
కమనీయఫణితి కథ చెప్పినాడు.

సంపన్ను నొకని సదనమ్మునందు
పావురములుండు పంజరము కలదు.
తెల్లనివి, మరియు నల్లనివి, మరియు
పలువన్నెలీను పారావతాలు
అందు నివసించి అందాలు విరియు.
పంజరంపు టపరంజి ఘంటికలు
గాలితాకునకు ఘలుఘల్లుమనగ
గారవము మీర ఆ రవము వినుచు
కలరవము లన్ని అలరెడివి మదిని.

ఆ గుంపులోన అతివృద్ధయైన
పావుర మ్మొకటి పలికె నీరీతి
తనవారినెల్ల గనుచు సంప్రీతి :

"యజమానివంటి సుజనుండు లేడు.
ఆశ్రితుల కతడు అఖిల సుఖదాత.
పావురపు జాతి దేవు డనజాలు
యజమాని కెపుడు విజయమౌగాత !

ప్రభు దయకు మనము పాత్రులము గాన
ఏ గోడు లేక ఈ గూడులోన
హాయిగా నుంటి మందరము కలిసి.
ఇది లేకయున్న ఎన్నెన్ని ఇడుమ
లొందువారలమొ యోచింపుడయ్య.
దినదిన మ్మిట్లు మన సంఖ్య పెరిగి
అభివృద్ధియౌట ఆనందమౌను.
ఈవిధముగానె పావురపుజాతి
దినదినము వృద్ధి గనగోరుచుందు."

ఈరీతి ముసలి పారాయి పలుక
వాయస మ్మొకటి ఆ యుపన్యాస
మంతయును వినుచు అపహసించినది :

"పంజరములోని పావురములార!
చింతించు బదులు సంతపించెదరు;

ఈసప్ కథలు : 18 — నండూరి రామమోహనరావు



స్వేచ్ఛనరికట్టు తుచ్ఛ పంజరము
చూచుకొని ఇట్లు చొక్కెదరు మీరు.
రోజురోజునకు మీ జాతి సంఖ్య
వృద్ధియగుకొలది బద్ధులగు వార
లెక్కువగుచుంట నిక్కువము గాదె?
బానిసతనమ్ము పోనడచు బదులు

స్వాతంత్ర్య మెటులో సాధించు బదులు
పరతంత్రులయ్యు పంజరపు బ్రదుకు
ప్రేమింతు రహహా! ఏమందు మిమ్ము,"
అని వాయసమ్ము తనదారి నేగె.

పావురము అంత పరవశ్ల మాని
తమ తప్పు తెలిసి తల వంచుకొనెను.

# హిరణ్మయి

## 16

అలెగ్జాండరు వెళ్లేక తన తండ్రి తాను చేసిన పనికి కోపపడతా డనుకుంది హెర్మియా. కాని రోహిలసు అలాంటి తెలివితక్కువ పనేమీ చెయ్యలేదు. ఆమె తెలివితేటలకీ, ధైర్యసాహసాలకు అతడు నిజంగా గర్వపడ్డాడు. మాసిడోనియాలో జరుగబోయే ఉత్సవాలలో తన కుమార్తె రథంలో మహారాణిపక్కన కూర్చోబోతోందన్న తలపుతో అతడు పొంగిపోయాడు.

చక్రవర్తి వెళ్లిన మర్నాడు రోహిలసు కుమార్తెతో, 'ఈ విసుజిసు ఎక్కడ దాగిఉన్నాడో చెపితే, అతణ్ణి రప్పించి చక్రవర్తి అభయమిచ్చాడని చెపుతాను. అతడు మళ్లీ అర్జీ రాసి ఇస్తే చక్రవర్తికి పంపుతాము' అన్నాడు.

హెర్మియాకు గాయత్రీదేవి అనుమతి లేనిదే వాళ్ల గుహాసంగతి తండ్రికి కూడా చెప్పటం ఇష్టం లేదు. 'నేనే అడవిలోకి వెళ్ళి హారప్రియుణ్ణి తీసుకొస్తాను' అందామె.

'ఒక్కర్తివూ వెళ్ళటానికి వీల్లేదు. మన సైనికుల్ని తోడిచ్చిపంపుతాను, 'వెళ్లు.' అన్నాడు రోహిలసు.

'మన సైనికులొస్తే, హారప్రియుడు నాకు కనపడడు. మన గ్రీకులంటే వాళ్ళకంత అపనమ్మకం' అంది హెర్మియా.

రోహిలసుకు ఏంచెయ్యాలో తోచక, కొన్నాళ్లు గడిచాయి. ఆఖరికి హెర్మియాకే ఒకఆలోచన తట్టింది.

పుష్కలావతిలో కలహాణుడనే ఒక పండితుడున్నాడు. ఆయనను రప్పించి, ఒక తాటి ఆకుమీద ఒకజాబు వ్రాయించింది. ఆకాలంలో ఇప్పటిలాగ రాసుకోడానికి కాగితాలు లేవు. తాటిఆకులమీద ఇనుపగంటాలతో వ్రాసేవారు.

'హారప్రియునికి—

అలెగ్జాండరు చక్రవర్తి మీకు అభయమిచ్చారు. పుష్కలావతికి నిర్భయంగా వచ్చి చక్రవర్తికి అర్జీ వ్రాయవలెను.' అని హెర్మియా కలహాణునిచే సంస్కృతంలో జాబు వ్రాయించింది. క్రింద 'హిరణ్మయి' అని సంస్కృతం అక్షరాలలోనే సంతకంపెట్టింది. ఆమెకు సంస్కృతం అక్షరాలు రావు. కాని చేవ్రాలుమాత్రం కలహాణునివద్ద నేర్చుకుని పెట్టింది.

ఆమె చేవ్రాలుకింద కలహాణుడు, 'ఈ ఉత్తరంలోని సంగతులన్నీ నిజం. ఇందులో మోసంఏమీ లేదు.' అని వ్రాసి తన సంతకంకూడా పెట్టేడు.

ఆ ఉత్తరాన్ని తీసుకెళ్లి అడవిదారిలో ఒక చెట్టుమ్రానుకు ఒక బాణంతో గుచ్చారు. ఎప్పటికైనా ఆ జాబును హారప్రియుడు చూసుకుని పుష్కలావతికి వస్తాడని హెర్మియా ఆశించింది.

చాలా రోజులు గడిచాయి. కాని హారప్రియుని జాడ ఎక్కడా కనపడలేదు.

అతడు ఆ జాబు ఉన్న చెట్టుకేసే రాలేదన్న మాట. వాళ్లకి చక్రవర్తి అభయ మిచ్చాడన్నవార్త తనే స్వయంగా వెళ్లి చెప్పాలి. కాని తండ్రి వప్పుగుంటాడా తను ఒంటరిగా అడవిలోకి వెళ్లడానికి? పోనీ చెప్పకుండా వెడితేనో? ఛా! అది తప్పావని!...ఈ విధంగా ఆలోచించుకుంటూ ఏమీ చెయ్యలేక చాలా రోజులు హారప్రియునికోసం ఎదురు చూసింది.

 పాలంకి వెంకటరామచంద్రమూర్తి 

ఆఖరి కొకనాటిరాత్రి అడవిపంచలోనుండి కొమ్మూ బూరా ధ్వని వినిపించింది. హెర్మియా, 'హారప్రియుడు!' అంటూ లేచి రోహిలసు కూడా రాగా. కోటను దాటి ఆధ్వనివచ్చినవైపు వెళ్లింది. మళ్ళీ బూరా వినిపించింది. 'హారప్రియా, నాతో మానాయన తప్ప మరెవరూ లేరు. మా నాయన మీ కిప్పుడు మిత్రుడే. చక్రవర్తే మిమ్మల్ని కనికరించాడు. ఎక్కడున్నావో, నిస్సంకోచంగా వచ్చి కలుసుకో.' అని గట్టిగా అరిచింది.

ఆ సమీపంలోనే వాళ్ళరాక కనిపెడుతూ ఒక చెట్టుపై నున్న హారప్రియుడు దిగివచ్చి వాళ్ళముందు నిలిచాడు. హెర్మియా అతణ్ణి చూడటంతోనే, 'హారప్రియా, కుమావతి క్షేమంగా ఉందా? రాణి గాయత్రీదేవికి నేను జ్ఞాపకం ఉన్నానా? మీ నాయన లేచి తిరుగుతున్నారా?' అని ఆగకుండా ప్రశ్నలు కురిపించింది. హారప్రియుడు ఆఖరిప్రశ్నకే బదులు చెప్పేడు. 'హిరణ్మయీ, మా నాయనగారు మరణించారు.'

'అయ్యో! ఎంతపని జరిగింది! ఎన్నాళ్లైంది? చక్రవర్తి అభయమిచ్చారనీ, మీ కష్టాలు గట్టెక్కాయని ఆయనకు తెలియనేలేదా?' అంది హెర్మియా.

'లేదు. నేను ఇక్కడనుంచి తప్పించుకుపోయిన మర్నాడే మా తండ్రి ప్రాణాలు విడిచాడు...హిరణ్మయీ, నీ మేలు నే నెన్నటికీ మరువను. నీ వారాత్రి నాకు ఆ సాయం చేసి ఉండకపోతే ఆయన మరణ సమయానికి నేను దగ్గర ఉండకుండా పోదును...

మానాయన పోయినప్పటినుంచీ మా అమ్మ దుఃఖంలో మునిగిపోయింది. నేను అప్పటినుంచీ బయటకు రాకుండా గుహాలోనే ఉంటున్నాను. ఈనాడే వచ్చాను. చెట్టు మ్రానుకు గుచ్చిఉన్న ఉత్తరాన్ని చూసి, వెళ్లి మా అమ్మతో చెప్పేను. మొదట ఏదో మోసం అని సందేహించాము కాని నీ సంతకం, కలహాణపండితుని వ్రాలూ ఉన్నాయి గనుక అనుమానపడక్కర్లేదంది మా అమ్మ' అన్నాడు హారప్రియుడు.

రోహిలసు, 'ఇంక మీరు అడవిలో బాధపడక్కర్లేదు. వెంటనే నాతో కోటలోకి వచ్చి, నచ్చిన గుర్రాలను నాలుగింటిని తీసుకువెళ్ళి మీ వాళ్ళనందర్నీ ఇక్కడకు చేర్చు. పుష్కలావతిలో మీ భవనంలో మీ రుందురుగాని. కొత్తగా కట్టిన ఇంటికి నేనూ, మా హెర్మియా మారుతాము' అన్నాడు.

హారప్రియు డెందుకో మొదట సందేహించాడు. అతని సంకోచం గ్రహించి హెర్మియా, 'మీరు రాకపోతే మేమే మీ గుహకు వచ్చి ఉండవలసొస్తుంది. కుమావతిని చూడాలని ఉంది నాకు. ఆమెకు వచ్చిన కథలన్నీ చెప్పిందేకాదు. ఎప్పుడు కలుసుకుంటానా, ఎప్పుడు వింటానా అనిపిస్తోంది నాకు...హారప్రియా, భర్త పోవటంవల్ల వచ్చిన కష్టాన్ని గాయత్రీదేవికి మనం తీసెయ్యలేం గాని, ఆ గుహాలో ఏకాంతవాసం వల్ల కలిగే ఇబ్బందులను, నువ్వు వప్పుకుంటే, తప్పించవచ్చును.' అంది.

ఆమె మాటల నేర్పు చూసేసరికి రోహిలసుకు ఆశ్చర్యంవేసింది. 'మా చిట్టి హెర్మియాయేనా ఇది? మంచితనంలో తన తల్లిని మించి పోయింది! హెర్మియా అంతా ఆ తల్లిపోలికే.' అనుకున్నాడు. హారప్రియునితో, 'పుష్కలావతి మీదే కదా? మీ యింటికి మీరు రావటానికి సంకోచమెందుకు?' అని వప్పించి, అతణ్ణి వెంటబెట్టుకుని హెర్మియాతో కోటకు చేరుకున్నాడు.

తెల్లవారుఝామున హారప్రియుడు నాలుగు గుర్రాలను కొందరు సేవకులనూ వెంటబెట్టుకుని గుహకు పోయి, తమవారి నందరినీ పుష్కలావతికి తీసుకొచ్చాడు. వాళ్లు వచ్చేలోగానే రోహిలసు తమ సామానంతా కొత్తభవనంలోకి మార్పించేశాడు. కాని హెర్మియామాత్రం కుమావతితోనో గాయత్రీదేవితోనో కబుర్లు చెబుతూ పాతభవనంలోనే ఎప్పుడూ కనపడుతోండేది.

## 17

కలహాణపండితుడు అలెగ్జాండరుచక్రవర్తికి ఒక అర్జీని తయారుచేసి దానిపైన గాయత్రీదేవిచే చేవ్రాలు చేయించి రోహిలసుకు ఇచ్చాడు. రోహిలసు ఆ అర్జీని తన గుర్రపు రౌతులలో నమ్మకమైనవాడి కొకడి కిచ్చి, చక్రవర్తికి అందచెయ్యవలసిందని పంపేడు.

ఆ కాలంలో జాబులను తీసుకుపోవటానికి ఇప్పటికిమల్లే రైళ్లూ, విమానాలూ లేవు. మనుష్యులే నడిచో, గుర్రాలమీదనో వెళ్ళి అందచేసేవారు. రోహిలసు పంపిన అశ్వికుడు చక్రవర్తిని కలుసుకుని జాబునిచ్చి రావటానికి చాలారోజులుపట్టింది. చక్రవర్తి ఆ అర్జీని వెంటనే పరిశీలించి, గాయత్రీదేవికి ఒక జాగీరు నివ్వవలసిందనీ, అందులో ఆమె హోదాకు సరిపడ్డ దివ్యభవన మొకటికట్టించి ఇవ్వవలసిందనీ సెల్యూకసు పేర ఒక ఆజ్ఞాపత్రాన్ని పంపేడు.

ఆ ఆజ్ఞాపత్రాన్ని చూసుకున్న సెల్యూకసుకు చాలా కోపంవచ్చింది. తనకు తెలియకుండా విశ్వజిత్తు కుటుంబం చక్రవర్తిదయను సంపాదించారంటే ఆ సేనానికి చాలా గుబ్బుగా ఉండి, అతడు రోహిలసును రప్పించి, 'ఇదంతా ఎలాగ సాధ్యమైంది?' అని అడిగేడు. రోహిలసు జరిగినదంతా చెప్పి, 'విశ్వజిత్తు పంపుకున్న అర్జీలను తమకు అందచెయ్యలేదని చక్రవర్తికి ఆలోచన మీమీదకి కోపంవచ్చింది'అన్నాడు.

తన కిష్టంలేకపోయినా చక్రవర్తిఆజ్ఞను పాటించి తీరాలి గనుక సెల్యూకసు గాయత్రీదేవికి ఒక జాగీరును ఇచ్చాడు. కాని అది ఎందుకూ పనికిరాని బంజరుభూమి. దానిలో భవనం కట్టించడం మాటేమి టని రోహిలసు అడిగేడు 'బొక్కసంలో ఇప్పుడు సొమ్ము లేదు. సొమ్ముచేరటంతోనే కట్టిద్దాము.' అన్నాడు సెల్యూకసు. సొమ్ము లేక కాదు. అతనికి భవనం కట్టించటం ఇష్టంలేదు. దేవుడు వరమిచ్చినా పూజారి ఇవ్వ నన్నట్లైంది. గాయత్రీదేవికి చక్రవర్తి ఆమెకు ఉప కారం చేద్దామనుకున్నా సెల్యూకసు జరగనిచ్చావాడు కాదు.

హెర్మియా, 'ఇంకా భవనం కట్టించలేదేం?' అని రోహిలసుకు జ్ఞాపకంచేస్తూనే ఉండేది. మళ్ళీ ఒక అర్జీని పంపుతేగాని పనిజరిగేటట్లు లేదన్నాడు రోహిలసు. గాయత్రీదేవి, 'ఏమీ వద్దు ఊరుకోండి.' అంది కాని హెర్మియా అలాగ ఊరుకోక కలహాణపండితుణ్ణి రప్పించి మరొక అర్జీని తయారుచేయించింది. గాయత్రీదేవి సంతకంకోసం తీసుకువెడుతోంటే, గుఱ్ఱపురౌతు ఒకడు కోటద్వారం ప్రవేశిస్తో ఆమె కంటపడ్డాడు. వాని ముఖం చాలా విచారంగా ఉంది.

'ఎవరు నువ్వు? ఎక్కడనుంచి రాక? ఎవరి కోసం?' అని మూడుప్రశ్నలు వేసింది హెర్మియా.

'అలెగ్జాండరు అనుచరులలో ఒకణ్ణి నేను. బేబిలాను నగరంనుంచి వస్తున్నాను. రోహిలసు కావాలి.' అన్నాడు వాడు.

'చక్రవర్తి క్షేమమేనా?' అని అడిగింది హెర్మియా.

'ఇంకెక్కడి చక్రవర్తి? మూడురోజులు చలి జ్వరంవచ్చి, చక్రవర్తి బేబిలానులో మరణించారు!' అన్నాడు వాడు.

హెర్మియాచేతిలోని అర్జీ క్రిందపడిపోయింది.

అలెగ్జాండరుమరణానికి గ్రీకులతో పాటు, అతన్ని ఎరిగిన భారతీయులందరూ విచారించారు. రోహిలసు హెర్మియాతో, 'మాసిడోనియాలో ఉత్సవాలు' జరుగుతాయనీ, అప్పుడు నీవు మహారాణి రథంలో కూర్చుని ఊరేగుతావనీ మురిసిపోయాను! చక్రవర్తి స్వదేశం చేరకుండా దారిలోనే మరణించాడు!'అని నిట్టూర్చేడు.

హెర్మియా 'నేను మహారాణి రథంలో ఊరేగ లేకపోయినందుకు విచారించటంలేదు. చక్రవర్తిపోయాడనటంతోనే సెల్యూకసు ఇంక గాయత్రీదేవికి ఏ ఉప కారంచెయ్యడు.' అంది.

ఆమెచెప్పినమాట నిజమే. చక్రవర్తి మరణవార్త విని, పైకి విచారం నటించినా లోపల సంతోషించాడు సెల్యూకసు. 'అలెగ్జాండరు సంపాదించి ఇచ్చి వెళ్ళిన రాజ్యమంతా నేనే ఇంక ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలవచ్చును!' అని మురిసిపోయాడా సేనాని. గాయత్రీదేవికి భవనం కట్టించిఇవ్వలేదు సరికదా తనకు ఇష్టంలేనిదే చక్రవర్తి అనుగ్రహాన్ని సంపాదించిన సామంతుల నందరినీ ఏదోవిధంగా హింసించటం ప్రారంభించాడు.

కొంతకాలానికి సెల్యూకసంటే భారతీయ సామంతులకే కాక, రోహిలసువంటి గ్రీకులందరికీ కూడా అసహ్యంవేసింది. దానితో సెల్యూకసుకు బలం తగ్గింది. కాని తన ఐశ్వర్యగర్వంలో ఆ మదాంధుడు తానున్న ఆపదను గుర్తించలేకపోయాడు.

## 18

ఆ రోజుల్లో తూర్పున మగధరాజ్యం ఉన్నదనీ, దానిని మహాపద్మనందుడనే గొప్పరాజు పరిపాలిస్తోండేవాడనీ, అతణ్ణి జయించాలన్న కోర్కెతో అలెగ్జాండరు సేనలతో వెళ్ళేడుగాని గ్రీకు సైనికులు స్వదేశానికి మళ్ళిపోవాలని పట్టుబట్టడంవల్ల అతడు తిరిగిపోవలసివచ్చిందనీ చెప్పేము. ఆ మహాపద్మనందునకు ముర అనే భార్య ఉండేది. ఆమెకు చంద్రగుప్తుడనే కుమారుడుండేవాడు. మురకులం తక్కువదన్న కారణంవల్ల ఆమెనూ చంద్రగుప్తుణ్ణీ తక్కిన నందకుమారులు హీనంగా చూసేవారు. 'ఎవరు హీనులో, ఎవరు ఘనులో తెలియజేస్తాను.' అని

చంద్రగుప్తుడు తన సవతిసోదరులనందరినీ నాశనం చెయ్యటానికి కంకణం కట్టేడు.

చంద్రగుప్తుడొకరోజు ఉదయం షికారువెళ్ళి వస్తోంటే ఊరిబయట అతని కొక బ్రాహ్మణుడు కన బడ్డాడు. ఆ బ్రాహ్మణుడు తను తాటాకులమీద వ్రాసుకునే గంటంతో, దారిలోఉన్న ఒక ముళ్ళ దుబ్బును దీక్షగా తవ్వుతున్నాడు. చంద్రగుప్తుడు చూసి, 'ఈ ముళ్ళకంచెను తవ్వుతున్నారు, ఏంచేస్తారు దీనితో?' అని అడిగేడు.

'నాదారిని నేపోతోంటే ఇది నాకు గుచ్చు







లైఫ్ బాయ్
సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిముల
నుండి మిమ్ములను కాపాడును






కుంది. దీన్ని వేళ్ళతో పెరికి నాశనంచేస్తాను!' అన్నాడా బ్రాహ్మణుడు కోపంగా.

'చెట్టుమీదే ఇంత పగబట్టిన ఈ బ్రహ్మచారి శత్రువుమీద ఎంతైనా పగపట్టగలడు!' అని తోచి చంద్రగుప్తుడు, 'అయ్యా, తమ పేరేమి? ఈరోజున తమరు మాయింట దేవతార్చనకు దయచెయ్యాలి.' అన్నాడు.

'నా పేరు చాణక్యుడు. నువ్వెవరు?' అన్నాడు బ్రాహ్మణుడు.

'నేను మహాపద్మనందుని భోజనశాలాధికారిని. నా పేరు చంద్రగుప్తుడు. మీకీరోజున విందుచేయిస్తాను, దయచెయ్యండి.' అన్నాడు చంద్రగుప్తుడు.

చంద్రగుప్తుడు చాణక్యుణ్ణి తీసుకుపోయి భోజనశాలలో మొదటిపీటమీద కూర్చోబెట్టేడు. చాణక్యుడు సంధ్యవారుస్తోంటే నందకుమారులలో ఒకడు వచ్చి, 'ఇది రాజూ, రాజపుత్రులూ కూర్చునే పంక్తి! ఇక్కడ కూర్చున్నావేమిటి? నీవంటి సత్రపుభోజనంగాళ్ళకి వేరేశాల ఉంది. అక్కడకు పో.' అన్నాడు.

చాణక్యునికి కోపం వచ్చింది. 'నేను కూర్చున్న చోటునుంచి బ్రహ్మరుద్రులొచ్చినా లేవను!' అన్నాడు. రాజపుత్రుడు, 'లేవవా?' అంటూ చాణక్యుని పిలక పట్టుకు లేవదీసి, భోజనశాలలోంచి అవతలకు గెంటేశాడు.

చాణక్యుడు కళ్ళనుండి నిప్పులు రాలుస్తో, 'నందకుమారుణ్ణన్న మదంతో నన్నవమానంచేశావు! నందవంశమంతా నాశనం చేసేవరకూ నా పిలకను ముడివెయ్యను!' అంటూ ప్రతిజ్ఞచేసి చరచరా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

చంద్రగుప్తుడు చాణక్యుణ్ణే అనుసరించి వెళ్ళి, 'అయ్యా, ఈ నందులు నన్నూ అవమానించారు!' అన్నాడు.

'అనుభవిస్తారు! వీళ్ళందర్నీ నాశనం చేసి, మగధ సింహాసనంమీద నిన్ను కూర్చోపెడతాను.' అన్నాడు చాణక్యుడు.

'మహాప్రసాదం!', అని చంద్రగుప్తు డాయనకు నమస్కరించి, ఆయన చెప్పినట్లల్లా చెయ్యటం మొదలెట్టేడు.

చాణక్యుడు మహామేధావంతుడు. ఆత డన్నంత పని చెయ్యగలిగేడు. నందరాజులకు విరోధులైన రాజులందర్నీ కూడగట్టి చంద్రగుప్తునకు సాయం రప్పించి, నందరాజును మగధనుండి పారదోలేడు.

చంద్రగుప్తుడు చాలా పరాక్రమవంతుడు. చాణక్యుని బుద్ధిబలం తోడై ఆతడు గొప్పసామ్రాజ్యాన్ని స్థాపించగలిగి, దాసీపుత్రుడనే మాటపోయి ఘనుడనిపించుకున్నాడు.

పంజాబులో సెల్యూకసు పరిపాలనంటే విసిగెత్తిపోయిన భారతీయసామంతులంతా చంద్రగుప్తుని పరాక్రమం విని, 'పంజాబుపై దండెత్తివచ్చి, మాకు ఈ విదేశీయునిపీడ వదిలించవలసింద'ని కోరుతూ రాయబారాలు పంపేరు. చంద్రగుప్తుడు గొప్ప సేనతో పంజాబు ప్రవేశించాడు.

గ్రీకులకూ ఇండియన్లకూ జరిగిన ఆ యుద్ధంలో ఇండియను సామంతులందరూ చంద్రగుప్తునిపక్షాన చేరేరు. విశ్వజిత్తుకుమారుడు హరప్రియుడు చంద్రగుప్తునిముందు నిలిచి, 'ప్రభూ, సెల్యూకసు మమ్మల్ని అనవసరంగా బాధించి, మా తండ్రిని అడవిలో దిక్కుమాలిన చావుకు గురిచేశాడు! ఈ దుర్మార్గుణ్ణి బంధించి తెచ్చి, తమముందు పడేసే హక్కు నాకు ప్రసాదించండి.' అని కోరేడు. చంద్రగుప్తుడు 'సరే' అన్నాడు. హరప్రియుని కొక గొప్పసేనను తోడిచ్చి పంపేడు.

ఆ యుద్ధంలో రోహిలసువంటి గ్రీకుయోధులెవరూ సెల్యూకసుకు తోడ్పడలేదు. సెల్యూకసు యుద్ధంలో ఓడిపోయి, హరప్రియునికి చిక్కేడు. చంద్రగుప్తుడు చాణక్యునివైపు తిరిగి, 'అయ్యా, ఈ గ్రీకురాజు నేమిచెయ్యమన్నారు?' అని అడిగేడు. చాణక్యుని సలహాచెయ్యనిదే చంద్రగుప్తుడు ఏపనీ చేసేవాడుకాదు.

చాణక్యుడు నవ్వుతో, 'అలెగ్జాండరు పురుషోత్తముణ్ణి రాజును గౌరవించవలసినట్లు గౌరవించి వదిలేశాడు. అట్లే నువ్వుకూడా ఇతణ్ణి గౌరవించి వదిలెయ్యి. ఇతనికి హెలెను అనే ఒక చక్కని కుమార్తె ఉన్నదని విన్నాను. ఆమెను నువ్వు వివాహంచేసుకుని, ఇతనికి అల్లుడవై, భారతీయులకీ గ్రీకులకీ శాశ్వతమైన మైత్రి కలిగేటట్లు చెయ్యి.' అన్నాడు. సెల్యూకసుతో 'పంజాబులోని భారతీయ

# ముగ్గురు బీదవాళ్లు

పూర్వం ఒకదేశంలో ముగ్గురు అన్నదమ్ములుండేవారు. పాపం ముగ్గురూ పరమదరిద్రులు. వారికి ఉన్న ఆస్తి అంతా వారు కట్టుకునే చింకిబట్టలు, ఒకగుడిసె, గుడిసెవెనుక ఒక మామిడిచెట్టు. మామిడిచెట్టుకు కాసే పళ్లే వారికి జీవనాధారం. అందుచేత వారు వంతులు వేసుకుని ప్రతి రాత్రీ మామిడిచెట్టును కంటిని రెప్పలాగా కాపాడుకునేవారు.

ఒక వెన్నెలరాత్రి పెద్దవాడు చెట్టు కాపలా కాస్తుండగా ఒక బిచ్చగాడు ఎంతోదూరంనుంచి వస్తున్నట్టు వగరుస్తూ వచ్చాడు.

"అయ్యా, నేను బిచ్చగాణ్ణి. మూడురోజులనుంచీ ఎంగిలి మెతుకైనా దొరకలేదు. కాస్త ఏమన్నా పెట్టి ప్రాణం రక్షించండి," అని వేడుకున్నాడు వాడు.

పెద్దన్నకి వాణ్ణి చూసి కడుపు తరుక్కుపోయింది. "తీసుకో అబ్బాయ్! నీకు కావలసినన్ని పళ్లు తీసుకో. అయితే ఆ రెండుకొమ్మలూ ముట్టుకోకు. అవి మా తమ్ముళ్ళవి. వాటిమీద నాకు అధికారంలేదు. ఈకొమ్మ నాది. దీనిమీద కాసిన పళ్లలో నీకు కావలసినన్ని తీసుకో," అన్నాడు.

బిచ్చగాడు కొమ్మ అంతా దులుపుకుని, కొన్నితిని, మిగతావి మూటగట్టుకుని తీసుకుపోయాడు.

తరవాత వరసగా రెండు రాత్రులూ ఆ బిచ్చగాడు వచ్చి, మిగిలిన ఇద్దర్నీ అడిగి, వారి వారి కొమ్మల్నికూడా దులుపుకుని చక్కాపోయాడు.

అలా బిచ్చగానిరూపంలోవచ్చిన వాడు మానవుడు కాడు, దేవేంద్రుడు. ముగ్గురు అన్నదమ్ముల కష్టాలు చూసి జాలిపడి వారి కెలాగైనా సాయంచేయాలనుకున్నాడు. అయితే వారు సహాయానికి అర్హులో కారో పరీక్షించనిదే సాయం చేయరాదనుకుని ఈవిధంగా పరీక్షించాడు. ముగ్గురూ మంచివాళ్ళనీ, పరోపకారస్వభావులనీ తేలిపోయింది.

నాలుగోరోజు ఉదయమే ఆ బిచ్చగాడు వారివద్దకు తిరిగి వచ్చాడు:

"అయ్యలారా! మీరు నాకు కష్టదశలో ఎంతో సహాయం చేశారు. మీ ఋణం, తీర్చుకోవాలనుకుంటున్నాను. నాతో అలా కొంతదూరం వస్తారా?" అని అడిగాడు.

'వీడు మనకేం సహాయం చేస్తాడూ?' అని ఆశ్చర్యపడుతూ అన్నదమ్ములు వాణ్ణి అనున

---

సామంతు'లంతా ఇంక చంద్రగుప్తునికి కప్పం కడతారు. నీ అల్లునికి కట్నంక్రింద, నీ ఏలుబడిలోఉన్న ఆఫ్ఘనుస్థానాన్ని ఇచ్చెయ్యి' అన్నాడు. సెల్యూకసు గత్యంతరంలేక, ఆ సంధికి వప్పుకుని చంద్రగుప్తునికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేసి, ఆఫ్ఘనుస్థానాన్ని అల్లుని వశం చేశాడు.

హెలెన్ చంద్రగుప్తుల వివాహంతోబాటు మరొక్కపెండ్లికూడా ఐంది. ఆ వధూవరులు హిరణ్మయి హర్షప్రియులని మీకీపాటికి తెలిసే ఉంటుంది. హిరణ్మయిధైర్యసాహసాలకు మెచ్చుకుని అలెగ్జాండరుచక్రవర్తి మాసిడోనియాలో జరగబోయే ఉత్సవాలలో మహారాణిరథంలో కూర్చుని ఊరేగే హక్కు ప్రసాదించాడు. అతడు అకస్మాత్తుగా స్వదేశం చేరుకోకుండానే మరణించడంవల్ల ఆ గౌరవం హిరణ్మయికి దక్కలేదు. కాని మరొక చక్రవర్తి పెండ్లి ఊరేగింపులో, తనుకూడా తన పెండ్లికొడుకైన హర్షప్రియునితో ఊరేగే భాగ్యం ఆమెకు లభించింది.

హర్షప్రియుడు చంద్రగుప్త సార్వభౌముని ఆదర గౌరవాలకు పాత్రుడై, పంజాబులోని సామంతరాజులకు మొనగాడయాడు. హిరణ్మయి 'గొప్పరాణి' అనిపించుకుంది. ఆమెకు కొడుకులూ కూతుళ్లూ చాలామంది పుట్టేరు. తన చిన్నతనంలో జరిగిన చిత్రకథంతా వాళ్ళకామె చెపుతోండేది వాళ్లామెకథను మళ్ళీ మళ్ళీ చెప్పించుకుని సరదాగా వింటూండేవారు.

(అయిపోయింది)

## ★ ముగ్గురు పేదవాళ్లు ★

ంచారు. ఒక సెలయేరు సమీపించారు. బిచ్చగాడు పెద్దవాణ్ణి పిలిచి "అయ్యా! మీకు ఏం కావాలో చెప్పండి. ప్రపంచంలో కల్లా మీకు ఇష్టమైనదేది?" అని అడిగాడు.

"నాకు చిన్నప్పటినుంచీ పాలూ పెరుగు అంటే చాలా యిష్టం. కాని కొనేతాహతు లేక జిహ్వ చంపుకున్నాను. ఆ సెలయేరు పాలయేరైతే ఎంత బాగుండును?" అన్నాడు పెద్దవాడు.

బిచ్చగాడు చేతికర్రను నీళ్ళలో ముంచాడు. నీళ్ళన్నీ పాలై పోయాయి. అప్పుడే పొదుగునుండి కారిన గుమ్మపాలవలె వెచ్చగా నురుగులు కక్కుతో పాల యేరు ప్రవహించసాగింది. క్షణంలో నేల యీనినట్లు అనేకులు సేవకులు పుట్టుకొచ్చారు. కొందరు పాలను గుండిగలలోకి పట్టుతుండగా, కొందరు గుండిగలను బళ్ళమీదకు ఎక్కిస్తుండగా, కొందరు బళ్ళను వివిధ పట్టణాలకు తోలుకుపోతుండగా, కొందరు ఆ పాలధరలు పద్దుపుస్తకాలలో రాసుకుంటుండగా, చూస్తూండగానే పెద్దవాడు గొప్ప ధనవంతుడైపోయాడు.

మిగతావారు తిరిగి బిచ్చగాణ్ణి అనుసరించారు. పోగాపోగా ఒక చోట ఒక పొలం కనిపించింది. అందులో బోలెడు పావురాలు వాలి ఉన్నాయి.

"ఆ పావురాలన్నీ పశువుల మందలైపోతే ఎంత బాగుండును," అన్నాడు రెండోవాడు.

బిచ్చగాడు మళ్ళీ చేతికర్రతో ఒక పావురాన్ని తాకాడు. వెంటనే అన్నీ ఆవులూ, గేదెలూ, ఎద్దలూ, దున్నలూ అయిపోయాయి. పొలంలో బోలెడుమంది కూలీలు, రైతులు, గుమాస్తాలు తయారై ఎవరిపనులు వాళ్లు చేయసాగారు. ఆ సంపద యావత్తూ రెండోవాడికి సంక్రమించింది.

ఇక మూడోవాడు కొంతదూరం వచ్చాక బిచ్చగాడు వాణ్ణి అడిగాడు "నీకేం యిష్ట"మని.

"నాకు గుణవతియైన భార్య కావాలి" అన్నాడు వాడు.

మళ్ళీ ఇద్దరు నడిచి, పోయి పోయి, ఒక మహానగరం ప్రవేశించారు. రాజభటులందర్నీ తప్పించుకుని సరాసరి రాజుగారి కొలువుకూటం ప్రవేశించారు. అక్కడ రాజు, రాణి, రాజకుమారి కనిపించారు. రాజకుమారి దేవకన్య లాగ మెరిసిపోతోంది.

బిచ్చగాడు రాజుతో అన్నాడు:

ఓ బొజ్జ గణపయ్యా!
నీ బంటు నేనయ్యా!
ఫోటో: ఎన్. రామకృష్ణ—మాయవరం.



"రాజా! నీ కుమార్తెను ఈ యువకుని కిచ్చి పెళ్ళిచెయ్యి."

రాజు, రాణి, కొలువులో ఉన్న మిగతా సభికులు ఈమాట విని గొల్లున నవ్వారు. రాజుగారు రత్నాసనాలమీద కూర్చున్న ఇద్దరు యువకులను చూపించి "అరుగో మా యిరుగుపొరుగు రాజ్యాల రాజకుమారులు. మా అమ్మాయిని చేపట్టాలని ఏడాది నుంచీ పోటీలుపడుతూ మా ఆస్థానంలోనే ఉండిపోయారు. మా అమ్మాయిని కావాలనేవాడిప్పుడు ఇంకోడు తయారయ్యాడన్నమాట. ముందు నడు అవతలికి," అన్నాడు.

"రాజా! భార్యాభర్తలను నిర్ణయించేది మానవులు కాదు. ఎవరికి ఎవరు రాసిపెట్టిఉంటే వారికే వివాహాలు జరుగుతాయి. ఇది నీ చేతులో ఉన్న విషయం కాదు," అన్నాడు ఇంకా బిచ్చగాడిరూపంలోనే ఉన్న దేవేంద్రుడు.

"అలాగా ? అయితే ఈ బీదవాడికి మా అమ్మాయితో వివాహం రాసిపెట్టిఉందని ఋజువేమిటి?" అన్నాడు రాజు.

"నేను ఋజువు చేస్తాను. మీ కుమార్తెచేత ఈరోజున మూడు మామిడి మొక్కలు పాతిపెట్టించండి. వాటిలో ఏ మొక్క ఏ రాజకుమారుడిదో, ఏ మొక్క ఈ బీదవాడిదో ఆమెనే నిర్ణయించమనండి. తెల్లవారినతరవాత ఎవరి మామిడి మొక్కకు పళ్లు కాస్తాయో వారికిచ్చి మీ అమ్మాయిని పెళ్ళి చెయ్యండి," అన్నాడు బిచ్చగాడు.

ఈ వింత ఏమిటో చూద్దామని రాజు, రాణి ఒప్పుకున్నారు. రాజకుమారి పేరుపేరునా ముగ్గురికీ



చవితి మర్నాడు

ఫొటో: సి. ఎన్. పార్థసారథి—ప్రొద్దటూరు.

మూడు మామిడిమొక్కలు పాతిపెట్టింది. తెల్లవారినపిదప చూస్తే బీదవాని మామిడి మొక్క ఎత్తుగా పెరిగి కాయలతో, పళ్ళతో కలకలలాడుతున్నది.

అతనికీ, రాజకుమారికీ వివాహం

చైనీస్ కథలు - ఫెంగ్ స్వే ఫెంగ్ :

# 13. కస్తూరిమృగం

చాలరోజుల్నించీ మంచు కురుస్తోంది. కొండలన్నీ మంచుతో కప్పబడిపోయాయి. ఎటు చూసినా తెల్లని మంచుతప్ప మరేమీ కనిపించడం లేదు.

"అహా, ఏమి రమణీయ దృశ్యము!" అనుకున్నది కొండ గుహనుండి తొంగిచూస్తున్న కస్తూరిమృగము. "ఇటువంటి వాతావరణం అంటే నాకు చెడ్డయిష్టం. చెప్పొద్దూ, వెచ్చవెచ్చగా ఉన్న యీ గది, కావలసినంత మేత, బయటచూస్తే ఒళ్లు పులకరింపజేసే ప్రకృతి రామణీయకం, చాలా బావుంది. మంచు కురిసి, దట్టంగా పేరుకొనిపోవడంవల్ల, నా కాలి జాడలుగాని, మరే జాడలుగాని కనబడడం లేదు. ఇక వేటగాడు నన్ను పట్టుకోవడం కలలోని వార్త" అని చంకలు కొట్టుకొని సంతోషించింది కస్తూరిమృగం.

కొన్నిరోజులకు సరిపడ దాచుకున్న పచ్చికను తీరికగా మేస్తూ, గుహనుండి వెలుపలికిచూస్తూ దృశ్య సౌందర్యాన్ని మెచ్చుకుంటోంది. సౌందర్యం చూసి ఆనందించగల తన రసజ్ఞతకు తనే మురిసిపోయింది. చాలా గొప్పదాన్ననుకుంది. "ఈ వెధవగదిలోకూర్చుని హిమరామణీయకాన్ని ఎలా ఆస్వాదించేది? ఏం బాగాలేదు ఈగది. కొండశిఖరాన ఉన్న సుందరమందిరంలో కూర్చుని చూస్తేగాని ఈ అందాన్ని అనుభవించలేను. అసలు ఈ సౌందర్యతత్త్వం అక్కడగాని బోధపడదు. శుభ్రంగా ఒక మద్యపాత్ర, ఒక పద్యగ్రంథం పట్టుకుపోయి, పైనకూర్చుని దర్జాగా గడుపుతాను," అని తలచి కస్తూరిమృగం కొండపై కెక్కింది.

కొండమీద గల మరోగుహలో కూర్చుని తన్మయత్వంలో మునిగింది.

తన కాలిజాడలవెంబడే వచ్చి తన వెనక నుంచున్న వేటగాణ్ని పాపం అది చూడనేలేదు. అందుచేత సులభంగా వాడిచేతుల్లో చిక్కిపోయింది.

ఈ కథనీతి ఏమంటే, మనం చేసే పనుల్ని గోప్యంగా ఉంచలేకపోతే, మన ఆలోచనల్నికూడా గోప్యంగా ఉంచలేము. ఎందుకంటే, మన ఆలోచనజాడలూ ఆచరణజాడలూ వేరువేరు కావు, ఒకటే. ★

## ★ ముగ్గురు బీదవాళ్లు ★

జరిగింది. కాని రాజుగారికి అల్లుడిమీద పట్టరాని ద్వేషం కలిగింది. అతడు తన భవనంలో ఉండరాదని శాసించాడు. "నాభర్త ఇక్కడ ఉండడానికి వీలులేకపోతే, నేను మాత్రం ఎలా ఉంటాను? నేనూ ఆయనతోపాటే వెళ్లిపోతాను." అని రాజకుమారి పట్టుబట్టింది. "అయితే నువ్వూ పో, వాడితో" అని రాజు ఆగ్రహంతో అరిచాడు.

బీదవాడు రాజకుమారిని వెంటపెట్టుకుని నగరం విడిచి దూరంగా వెళ్ళిపోయాడు, జీవనోపాధి అన్వేషిస్తూ.

బిచ్చగాడు అదృశ్యుడయ్యాడు.

* * *

ఒకపదాదితర్వాత ముగ్గురన్నదమ్ములూ ఎలా ఉంటున్నారో చూడడానికి దేవేంద్రుడు తిరిగి మునుపటి బిచ్చగాని రూపంలోనే భూలోకానికి వచ్చాడు. ముందు పెద్దవానిదగ్గరకు వెళ్లాడు.

పెద్దవాడు ఇదివరకటికంటే ధనవంతుడయ్యాడు. ధనంతోపాటే మదం పెరిగింది, ఆశ పెరిగింది. తన పూర్వస్థితిని మరిచిపోయి బీదవాళ్ళను జాలి తలచేవాడు కాడు. పాలయేరుయావత్తూ అతనిస్వాధీనంలోనే ఉన్నా, పాలల్లో నీళ్లు కలిపి మరీ అమ్మేవాడు. లోభగుణంవల్ల ప్రతిచిల్లిగవ్వా జాగ్రత్తగా దాచిపెట్టేవాడు.

బిచ్చగాణ్ణి అతడు చూసి గుర్తుపట్టనేలేదు. "ఎందుకొచ్చావ్" వని అడిగాడు.

"కాసిని పాలు ధర్మంచెయ్యండి. నా పసిపిల్ల అక్కడ దూరంగా ఉన్నది. తల్లిదగ్గర పాలులేవు.

రెండిపోయి పిల్ల ఏడుస్తున్నది," అన్నాడు బిచ్చగాడు.

"ఇది ధర్మసత్రంకాదు, అడిగిన వాళ్ళందరికీ పాలు ధర్మం చెయ్యడానికి" అన్నాడు పెద్దవాడు.

"ఇంత డబ్బు సంపాదించారు మీరు. ధర్మసత్రాలు కట్టించక పోయారా?" అన్నాడు బిచ్చగాడు.

"నాకు నువ్వు ఉపదేశించనక్కర్లేదు, పోపో" అని పెద్దవాడు కసిరికొడుతూఉండగానే పాలయేరు నీటియేరై, ధనవంతుని సంపద యావత్తూ మాయమై తిరిగి చింకిపేలికలతో తయారైనాడు.

రెండోవాణ్ణి పరీక్షిద్దామని బిచ్చగాడు వెళ్లి "కొంచెం మజ్జిగ దాహం ఇప్పిస్తారా?" అని వేడుకున్నాడు.

రెండోవాడుకూడా పెద్ద భూస్వామిఅయి, ధనమదంతో బలిసిఉన్నాడు. అందుచేత ఆ బిచ్చగాడు తన కొకప్పుడు ఈ ఐశ్వర్యం ఇచ్చిన మహానుభావుడే నని గుర్తించక "వొళ్లువంచి పనిచేసుకోరాదూ? ఇలా అడుక్కు తినక పోతే? పోపో" అని కసిరికొట్టాడు.

"అలాగే పనిచేస్తాను. పని ఇప్పించండి," అన్నాడు బిచ్చగాడు.

"నీకోసం తేరగా ఇక్కడ పనులు దొరుకుతాయి. పో, ఇంకోచోట చూసుకో," అన్నాడు ధనవంతుడు. అంటుండగానే అతని సంపద యావత్తూ మాయమై తిరిగి చింకిపాతలతో తయారైనాడు. పశువులన్నీ పావురాలై ఎగిరిపోయాయి.

బిచ్చగాడు ఆఖరివాడిదగ్గిరికి వెళ్లాడు. అతడొక ఊరివెలుపల గుడిసెలో భార్యతో జీవిస్తున్నాడు. కట్టెలమ్ముకుని, చెప్పులుకుట్టి జీవితం సాగిస్తున్నాడు. బిచ్చగాణ్ణి అతడుకూడా గుర్తించలేదు. కాని ఎంతో ఆదరంతో లోపలికి ఆహ్వానించి తాము వండుకున్న అన్నంలోనే కొంత అతనికి పెట్టాడు. రాజకుమారియైనా, అతని భార్య భర్తనే నమ్ముకుని సేవిస్తూ ఉన్నది. ఆమెకూడా బిచ్చగాణ్ణి ఎంతో మర్యాద చేసింది. వారిద్దరి ఆతిథ్యం, మంచితనం చూసి బిచ్చగాడు సంతోషించాడు. వెళ్లివస్తానని చెప్పి చెట్ల చాటున కనుమరుగైనాడు.

అతడు అదృశ్యంకాగానే గుడిసెకూడా అదృశ్యమైంది. దాని స్థానంలో అనేకులు సేవకులతో, ధనధాన్యాలతో, భోగభాగ్యాలతో కలకలలాడే మహాభవనం వెలిసింది. అందులో మూడవవాడు, రాకుమారితో కలిసి హాయిగా జీవించ సాగాడు. తన అన్నలవలె ఐశ్వర్యమదాంధుడుకాకుండా, అతిథులను ఆదరిస్తూ, పేదలకు ధర్మసత్రాలు కట్టిస్తూ గుణవతియైన భార్య తనకు అన్నిటా సహాయపడుతూఉండగా ఎంతోకాలం జీవించి ధర్మాత్ముడనే పేరు పొందాడు.

(ఆంగ్లకథ ఆధారంగా)

★



లావణ్యమునకు
ప్రతిఛాయ



ఆఫ్ఘాన్
స్నో

ప్రాచ్య ప్రపంచములో
ప్రఖ్యాతమైన సౌందర్య క్రీమ్




సువాసన వెదజల్లు తాజా "ఆఫ్ఘన్ స్నో" కోమలమైనది, ముఖ లావణ్యము నిచ్చుటకు సులభ సాధనము. దినమంతా చర్మమును పూతేకువలె నుంచగలదు.



వాటన్‌వాలా

# పక్షులకు రాజైన బంగారు పిచ్చుక

అడవిలో పక్షులన్నీ సమావేశమై తమనుపాలించే రాజును ఎన్నుకోవాలని నిశ్చయించుకున్నాయి. ఎవరిని ఎన్నుకోవాలనే విషయమై చాలసేపు వాదోపవాదాలు జరిగాయి.

"రాజుగా ఉండేవాడికి అందం ముఖ్యం. ఎవరు అందంగా ఉంటే, వారినే ఎన్నుకోవాలి," అన్నది పింఛం విప్పిన నెమలి.

"అబ్బే. రాజులో ఉండాల్సిన ముఖ్యలక్షణం గాంభీర్యం. ఎవరు గంభీరంగా, జ్ఞానిలాగ కనిపిస్తారో వారిని ఎన్నుకోవాలి," అన్నది ఎప్పుడూ తీవ్రంగా చూసే గుడ్లగూబ.

"అబ్బే. ఎవరు బాగా మాట్లాడగలిగితే వారిని ఎన్నుకుందాం," అంది తియ్యగా మాట్లాడే రామచిలక.

కాని డేగ పెద్దగొంతుక పెట్టుకొని ఇలా అరిచింది:

"మనకీ, మిగతా ప్రాణులకీ తేడా ఏమిటి? మనం ఎగరగలం. మిగతా ప్రాణులు ఎగరలేవు. కనక మనలో ఎవ రెంత ఎత్తుకు ఎగరగలిగితే వారిని ఎన్నుకుందాం," అన్నది డేగ.

దాని చూపులూ, భయంకరమైన ముక్కూ, గోళ్ళూ, దానిబలం చూసి మిగతా పక్షులన్నీ గజగజలాడాయి. విధిలేక డేగ చెప్పిన దానికి ఒప్పుకున్నాయి.

ఒకటీ, రెండూ, మూడూ అని అనగానే పక్షులన్నీ ఒక్కసారిగా పైకెగిరాయి. ఒకదానికంటె ఒకటి ఎత్తుగా ఎగరాలని ప్రయత్నించాయి. కాని డేగ అన్నిటినీ మించి, క్షణంలో మేఘమండలందాకా ఎగిరింది.

అలా ఎగిరి ఎగిరి ఇక ఎగరలేకపోయింది. దాని రెక్కల్లో సత్తువ అయిపోయింది. అందుచేత అక్కడ ఆగి, కిందికి చూసి, "చూశారా, పక్షులారా! నేను ఎంత ఎత్తుకు ఎగిరానో? మీ రెవ్వరూ నా అంత ఎత్తు ఎగరలేకపోయారు. కనుక నేనే రాజునౌతాను," అని అరిచింది.

అంతవరకూ డేగవీపుమీద కిక్కురుమనకుండా దొంగలాగ కూర్చున్న బంగారుపిచ్చుక గభాలున లేచి ఇంకా పైకెగిరి ఇలా అన్నది: "ఏయ్, డేగా! పాపం తెలివిగా రాజు నవుదామనుకుంటున్నావేం? ఇదుగో, నేను నీకంటే ఎత్తు ఎగిరాను. కావలిస్తే, నన్ను అందుకో చూద్దాం."

వేగంగా ఎగరాలనే ఉబలాటంలో డేగ తన వీపుమీదే బంగారుపిచ్చుక ఎక్కికూర్చున్న సంగతి చూడలేదు. అందుచేత నిజంగానే అది తనకంటే ఎత్తు ఎగిరిందని నమ్మింది. బంగారుపిచ్చుకను చేరుకోవాలని శాయశక్తులా ప్రయత్నించింది. కాని సత్తువలేక ఎగరలేకపోయింది.

"బంగారుపిచ్చుకే గెలిచింది. అదే మాకు రాజు," అని పక్షులన్నీ గోలచేశాయి. డేగ దానికి ఒప్పుకోక తప్పిందికాదు.

ఈ విధంగా పరిమాణంలో అన్నిటికంటే చిన్నదైన బంగారు పిచ్చుక పక్షులన్నిటికీ రాజైంది. బుద్ధిబలం ముందు దేహబలం పనికిరాదని ఈ కథలో నీతి. ★

ఏం, తలనొప్పి
కొనుటకు వెదుకుతున్నారా?



సారిడన్
నొప్పిని పోగొట్టును
ఒక బిళ్ల 2 అణాలు

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## కోడి ముందా? గుడ్డు ముందా?

"ప్రపంచంలో ఏది ముందు పుట్టింది? గుడ్డా? లేక పిల్లా" అని విజయవాడనుంచి విలాయత్ గారట అడుగుతున్నారు.

సృష్టి అన్నది అంతా ఒకనాటి ఉదయము జరగలేదనీ, సహస్రశతాబ్దాల తరబడిని భూమి ఉపరితలము మీద వచ్చిన మార్పుల క్రమఫలితమే మనకు నేడు కనబడే సృష్టి అనీ వైజ్ఞానికుల మతము.

ఎమీబా లనే సూక్ష్మజీవులలో జీవకణము ఒకటే. వీటిని ఏకకణాంగ జీవులంటారు శాస్త్రజ్ఞులు. ఇవి పెరిగి పెరిగి, రెండుగా చీలిపోవడము వల్లనే వీటి వృద్ధి జరుగుతుంది. మొక్కలలో ప్రాథమికస్థితిని సూచించే 'ఫంగస్'లో కూడా ఒకజీవకణం పెరిగి చీలిపోవడము వల్లనే ఆజాతియొక్క వృద్ధి జరుగుతుంది. ఈ ఘట్టములో ఆడ, మగ భేదము లేదు.

'హైడ్రా'అనే అనేక కణజీవులలో— మానవులకు కంతి పెరిగినట్లు—మొగ్గలు పెరిగి పెరిగి చివరికి తెగి విడిపోతాయి. అవే పిల్ల హైడ్రాలు. (కిత్తనార చెట్టుకు కూడా ఇలాగే పిల్ల మొక్కలు "కాచి" కింద పడి వేరె మొక్కలు పెరుగుతాయి). దీనిని బట్టి మనకు తెలిసే దేమిటంటే, మొక్కలలోనూ జంతువులలోనూ కూడా ప్రాథమిక అవస్థలో ఆడ, మగ భేదమువల్ల కాక వేరే ఏర్పాటువల్ల ఆజాతివృద్ధి జరుగుతూండినదని.

కాలక్రమ పరిణామములో జీవులకు ప్రధానగుణములైన పరిసరానుగుణ్యతా, స్వప్రాణరక్షణమూ అన్న రెండుశక్తులవర్తనములో, స్థావరములలోనూ జంగమములలోనూ కూడా లింగభేదము వృద్ధి అయినది. వానపాములో ఆడ, మగ అంగములు రెండూ ఒకే జీవిలో వుంటాయి. అయితే సంయోగముమాత్రము ఒకే జీవిలో జరుగదు. పువ్వులలో ఆడ మగ భాగములున్నను ఒక పువ్వులో స్వపరాగ సంపర్కము జరగదు సాధారణముగా. మరికొంత పరిణామము జరుగుసరికి జంతువులలో ఆడ మగ జంతువులు వేరైనవి. (చెట్లలోనూ బొప్పాయి వంటివి కలవుకదా?)

ఇదీ మనము ప్రస్తుతకాలములో చూస్తున్న స్థితి. ఇప్పుడు వేసుకోండి "కోడిముందా? గుడ్డుముందా?" అన్న ప్రశ్న. కోడి పక్షి. అంటే జంగమములలో చేరును. కోడిని, దాని పూర్వికపక్షులనూ, వాటికి పూర్వికజీవులనూ ఊహించుకుంటూ పోతే ఆడ, మగ, భేదములేని ప్రభూతకాలపు స్థితిలో "కోడి"యే ముందుకదా? నాడుగుడ్డు లేదు! మొదట అనేక పద్ధతులవల్ల పునస్సృష్టి అన్నది జరిగి, కాలక్రమమున ఆడ, మగ భేదమూ, గుడ్డూ అన్నవి ఉద్భవించినవి. ఇప్పటిస్థితిని పట్టుకుని, 'కోడి లేకుండా గుడ్డు ఎలాగ పుట్టింది? గుడ్డు లేకుండా కోడి ఎలాగ పుట్టింది?' అని అడుగుతున్నారు మీరు. దీనికి జవాబు అసలు కోడి ప్రాథమిక రూపమునకు వెళ్ళిన గాని రాదు. అలాగ వెళ్ళినప్పుడు "కోడియే ముందు" అని జవాబుచెప్పాలి.

మీ ప్రశ్నకి కొంచెము విపరీతముగా కూడా జవాబు చెప్పవచ్చును. ఇంగ్లండులో ఒక జాతికోళ్లు కొన్ని పరిస్థితుల్లో పెట్టేగుడ్లు పిల్లలు అవవు. మరి అక్కడ కోడియేకదా ముందు?

అకాల నెరసిన వెంట్రుకలు నల్లబడుటకు
కాశ్మీర్ - కుసుం
మీ శిరోజములకు శ్రేష్ఠమైన నూనెలో నాన్పండి
యునైటెడ్ కన్‌సెర్న్, బందరు రోడ్, మదరాసు-1. విజయవాడ.
నిరపాయకరమైన
నంజనగూడు పండ్లపొడి
ఇతర 54 ఔషధముల జాబితా ఉచితము

హకల్ బెరిఫిన్
వెల రూ. 2-0-0
పోస్టుఖర్చులు అదనము.
ఆంధ్రగ్రంథమాల, మదరాసు-1,

## బొడ్డుయొక్క ప్రయోజనము

చెప్పమంటున్నారు కూరపాటి శీతారామరావుగారు ఖమ్మంమెట్టునుంచి.

తల్లిగర్భములో పిండము పెరుగుతూన్నప్పుడు, పిండమునకు దెబ్బతగలకుండా దాని చుట్టూ ద్రవములు ఏర్పడతాయి. తల్లి గర్భకోశపు లోవైపు ఒకపొర ఏర్పడి ఈద్రవాన్ని పట్టి ఉంచుతుంది. ఈపొరకీ పిల్లకీ, పిల్లబొడ్డుదాకా ఉన్న బొడ్డుత్రాడుద్వారా సంబంధ పూర్తిగా ముంటుంది. బిడ్డ వృద్ధి కొంతవరకూ ఈపొర తల్లి గర్భకోశాన్ని గట్టిగా పట్టి వుంటుంది. బిడ్డవృద్ధికి కావలసిన నెత్తురు - తల్లిది - ఈబొడ్డు త్రాడుద్వారా బిడ్డ శరీరాంగములలో ప్రవహిస్తుంది. బిడ్డ గుండెకాయ రెండవనెలలోనే కొట్టుకోవడము ఆరంభిస్తుంది! ఊపిరితిత్తులూ మిగతా అంగములూ మాత్రము పనిచేయవు. బిడ్డ శరీరమంతటా ప్రసరించి మలినపడిన నెత్తురు - తల్లి ఇతరాంగములలో మలినపడిన నెత్తురులాగే - తల్లి ఊపిరితిత్తులలోనికి పోయి శుభ్రపడుతుంది. అంటే బిడ్డ తల్లికి ఒక కొత్త అంగము అన్నమాట.

పదినెలలూ అయి బిడ్డ (పిండము అనడానికి బిడ్డ అంటున్నాను) పూర్తిగా ఎదిగినప్పుడు, నొప్పులువచ్చి, బిడ్డవున్న సంచీ చిరిగి ద్రవములు బిడ్డయొక్క దారిని నిర్విఘ్నముగా కడిగివేస్తాయి. బిడ్డ పుడుతుంది (వాస్తవానికి పుట్టిన తర్వాతనే 'బిడ్డ' అనాలి. అంతకుముందు ఆకారము ఎలాగు వున్నా పిండమనే అనాలి) బిడ్డకూ తల్లిగర్భకోశమునకూ బిడ్డ బొడ్డుత్రాడు ద్వారా ఇంకా సంబంధముంటుంది. తల్లికి మళ్ళీ నొప్పులువచ్చి ఈత్రాడునకు రెండవకొసనున్న పొర - తల్లి గర్భకోశమునువదలి పడిపోతుంది. ఈత్రాడుద్వారా తల్లి నెత్తురు బిడ్డ బొడ్డునుంచి బిడ్డ శరీరములో ప్రసరిస్తుందని చెప్పియుంటిమికదా? కనుక మంత్రసాని ఈ బొడ్డుత్రాడును పట్టి, ఆత్రాడులో మిగిలివున్న రక్తమును బిడ్డ శరీరములో ప్రవేశించేటట్లుగా నొక్కి తోడుతుంది. ఇలాగ తోడి, బిడ్డ బొడ్డుకు దగ్గరగా ట్వైనుదారముతో తాడును గట్టిగా కట్టివేసి, ఈముడికి పైన బొడ్డుతాడును కోసేస్తుంది. కట్టుఉన్నది కనుక, కట్టుకింది నెత్తురు కారిపోదు.

బొడ్డుత్రాడు కోయడములో ఒకొక్క తెలివిమాలిన మంత్రసాని తాడును లాగి కోస్తుంది. అందువల్ల బిడ్డ బొడ్డు (పొక్కిలి) లోపలికి ఉండవలసినదర్మము తరవాత తరవాత బుడగలాగ పైకివచ్చి కనబడుతుంది.

బిడ్డ భూమిమీద పడగానే ఏడవడము ఆరంభిస్తుంది. అంటే ఊపిరితిత్తులు పనిచేయడము ఆరంభించాయి అన్నమాట. బిడ్డ ఏడవకపోతే కాళ్లుపట్టుకుని ఝాడించీ, పిర్రలమీదకొట్టీ, కంచాలు గణగణ లాడించీ బిడ్డ ఇంద్రియాల్ని జాగరితము చేయడము వల్ల ఊపిరితిత్తుల్ని పనిచేశేటట్టు చేస్తారు.

బొడ్డుతాడుయొక్క ముక్క నాలుగు రోజులలో పడిపోతుంది. బొడ్డు దగ్గర భాగము పుండులాగ పచ్చిగా ఉంటుంది. నూనెపెట్టి ఈగలు వాలకుండా గుడ్డవేస్తారు. మానిపోయిన తరువాత బొడ్డుయొక్క ఉపయోగము ఏమీలేదు. బొడ్డు ఉపయోగము మనము పుట్టకపూర్వమే. పుట్టిన తర్వాతయేమీ లేదు. ★



ప్రియునికి మాడు చిట్లితే, మంగు వేస్తున్నది ప్రేయసి.
అన్నపూర్ణావారి "దొంగరాముడు"లో సావిత్రి, నాగేశ్వరరావు.

# బొంబాయి సినిమా లేఖ

బొంబాయిలో "ఆజాద్" చిత్రం రెండు థియేటర్లలో రజతోత్సవం చేసుకున్నది. మినర్వా థియేటర్లో జరిగిన ఉత్సవ సభకు గవర్నర్ హరేకృష్ణ మహతాబ్ అధ్యక్షత వహించారు. ఆ సందర్భంలో దర్శక నిర్మాత ఎస్. ఎమ్. ఎస్. నాయుడుగారు ప్రధాన మంత్రి సహాయ నిధికిగాను 25 వేల రూ॥లు విరాళం ఇచ్చారు. గవర్నరుకు స్వాగత మిస్తూ "ఇది ఫిర్యాదులు చేసే సమయం కాక పోయినా ఒకమాట చెప్పాలి. ఫిలిం పరిశ్రమలో వ్యక్తిగతంగానైనా శ్రద్ధ తీసుకోవలసిందని మిమ్మల్ని కోరుతున్నాను," అని నాయుడుగారన్నారు.

బొంబాయి ఫిలిం పత్రికా రచయితలు, ఉర్దూ పత్రికా రచయితలు నాయుడు గారికి, 'ఆజాద్' తారలకు సన్మానం చేశారు. డిస్ట్రిబ్యూటర్ తారాచంద్ బార్జాత్యాగారు తాజ్ మహల్ హోటల్ లో మేయర్ అధ్యక్షతన మరొక సన్మానం ఏర్పాటుచేశారు. వీటన్నిటికీ తారలు కూడా హాజరయ్యారు. ఓంప్రకాష్, మిశ్రా, బద్రీ ప్రసాద్ ల ఛలోక్తులు ప్రేక్షకులను వినోదింపజేశాయి.

*   *   *

బొంబాయిలో ఈమధ్య చాలా మంచి చిత్రాలు విజయవంతంగా నడుస్తున్నందున థియేటర్ల కొరత ఏర్పడింది. రాక్సీలో సొహ్రాబ్ మోడీ చిత్రం "కుందన్" బాగా నడుస్తోంది. బహుశా అది అక్కడే రజతోత్సవం కూడా చేసుకోవచ్చును. ఈ కారణంచేత జెమినీవారి "ఇన్సానియత్" విడుదల వాయిదాపడుతోంది. ఇంపీరియల్ లో ఉరన్ ఖటోలా, నాజ్ లో మునీంజీ, సెంట్రల్ లో వామన్ అవతార్, మినర్వాలో ఆజాద్, కమల్ లో వచన్ చిత్రాలు ఇంకా జయప్రదంగా నడుస్తున్నాయి. వీటివల్ల రాజ్ కపూర్ చిత్రం "శ్రీ 420" కూడా స్వస్తిక్ లాంటి చిన్న థియేటర్ లో విడుదల కావలసిన అవస్థ పట్టింది. వి. శాంతారాం ఈ విషయంలో చాలా అదృష్టవంతులనే చెప్పాలి. ఆయన "ఝనక్ ఝనక్" చిత్రం మెట్రోలోను, రాయల్ ఒపెరాలోను బుక్ అయింది.

ఇన్సానియత్, శ్రీ 420, ఝనక్ ఝనక్ పాయల్ బాజే—ఈ మూడూ ఈ ఏడాది చిత్రాల్లోకల్లా భారీ ఎత్తు చిత్రాలు. వీటి జయాపజయాలమీద పై సంవత్సరపు భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. వీటికి



జమునకు ఏవో 'పూలబాసలు' నేర్పుతున్నాడు జగ్గయ్య.

అన్నపూర్ణావారి "దొంగరాముడు"లో ఒక ప్రణయ ఘట్టం.

"మెరైన్ డ్రైవ్" హిందీ చిత్రంలో కె. ఎన్. సింగ్, బీనారాయ్

## ★ బొంబాయి సినిమా లేఖ ★

చాలా డబ్బు ఖర్చుపెట్టడం, ప్రేక్షకులు టీటికోసం ఎదురుచూస్తూ వుండడం జరిగింది.

* * *

ఫిలిం నిర్మాతలలో ఐకమత్యం సాధించడానికి పాటిల్ గారి నాయకత్వాన ఐ. ఎమ్. పి. పి. ఎ. తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నది. నిర్మాతలందర్నీ ఒకే సంఘంలోకి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నది. భారత దేశంలోని వివిధ ప్రాంతాల చిత్రనిర్మాతలందర్నీ త్వరలో సమావేశం చేయడానికి పాటిల్ గారు నిశ్చయించారని తెలుస్తున్నది. నిర్మాతలే స్వయంగా తమ చిత్రాలను సెన్సారు చేసుకోవడంలో కూడా ఐ. ఎమ్. పి. పి. ఎ. కొంత విజయం సాధించిందనే చెప్పాలి. శిల్పి ఫిలిమ్స్ నిర్మించిన "మెరెన్ డ్రైవ్" చిత్రానికి సర్టిఫికెట్ ఇవ్వడానికి సెన్సార్లు ఇటీవల నిరాకరించారు. అప్పుడు ఐ.ఎమ్. పి. పి. ఎ. కలగజేసుకుని సమాధానం కుదర్చగా ఆచిత్రానికి 'ఎ' సర్టిఫికెట్ మాత్రం ఇవ్వబడింది. * * *

ఈ మధ్య బొంబాయిలో విడుదలైన కొత్త చిత్రాలు 'ముసాఫిర్ ఖానా' 'నవరాత్రి.' ఎమ్. సాదిక్ నిర్మించి డైరెక్ట్ చేసిన 'ముసాఫిర్ ఖానా' పూర్తిగా హాస్య చిత్రం. శ్యామ, కరణ్ దివాన్, ఓంప్రకాష్, జానీవాకర్, నమ్మీ, బద్రీప్రసాద్, గోప్ నటించారు. ఓ. పి. నయ్యర్ సంగీత దర్శకుడు. మొత్తంమీద ఇది మంచి ఆహ్లాదకర చిత్రం.

పౌరాణిక చిత్రమైన "నవరాత్రి"లో నిరూపరాయ్, మన్‌హర్ దేశాయి, స్వరూప నటించారు. మహిషాసుర మర్దన కథ ఆధారంగాగల ఈ చిత్రాన్ని రమన్ బి. దేశాయ్ డైరెక్ట్ చేశారు. సంగీత దర్శకుడు చిత్రగుప్త. వినోదకర చిత్రమైనప్పటికీ, అడుగడుగునా మాయలూ, మహిమలు కనిపిస్తాయి. మతాభిమానం అమితంగాగల మన ప్రజలకు ఈ చిత్రం నచ్చవచ్చును.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



త్వరలో

## "దొంగరాముడు" విడుదల

అన్నపూర్ణా పిక్చర్సు వారి "దొంగ రాముడు" ఈ మాసాంతానికి విడుదల కావచ్చునని తెలుస్తోంది. ప్రఖ్యాత దర్శకులు కె. వి. రెడ్డిగారు ఈ చిత్రాన్ని డైరెక్ట్ చేశారు. ఎ. నాగేశ్వరరావు, సావిత్రి, జమున, రేలంగి, జగ్గయ్య, వంగర, ఆర్. నాగేశ్వరరావు, హేమలత, రామన్నపంతులు, ఎ. రామలింగయ్య, విజయలక్ష్మి, వర్మ మున్నగువారు ఈ చిత్రంలో నటించారు. పాటలు సముద్రాల, మాటలు డి. వి. నరసరాజు గార్లు వ్రాశారు. సంగీత దర్శకుడు పెండ్యాల.

'పరిస్థితుల ఒత్తిడికి తట్టుకోలేక, ఖర్మం చాలక ఒకసారి దొంగతనం చేస్తే, దాని ఫలితం ఆ వ్యక్తిని చిరకాలం వెన్నాడు



"జయసింహ"లో ఎన్. టి. రామారావు, అంజలి, రేలంగి, గుమ్మడి.

తూనే ఉంటుంది. సంఘం ఆ వ్యక్తిని క్షమించదు. కాని ఎన్నటికైనా వ్యక్తి మంచితనం బయటపడక తప్పదు' అనే సత్యాన్ని ప్రాతిపదికగా తీసుకొని "దొంగ రాముడు" కథ రచించబడింది. మానవత్వం లోని మంచి చెడ్డలను చిత్రించే ఈ చిత్రం మొదటినుంచి చివరదాకా హాస్యం, వినోదం కలిగిఉంటుందని తెలుస్తోంది.

* * *

అన్నపూర్ణా పిక్చర్సువారు తిరిగి మరొక చిత్రం నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు.

## కొత్త డాక్యుమెంటరీ చిత్రాలు

భారత ప్రభుత్వపు ఫిల్మ్సు డివిజన్ తయారుచేసిన కొత్త డాక్యుమెంటరి చిత్రాలు 4, వార్తాచిత్రం ఒకటి మొన్న 14 వ తేదీన మద్రాసు, గెయిటీలో ప్రత్యేకంగా ప్రదర్శింపబడినవి. పశువుల పెంపకాన్ని గూర్చిన చిత్రంలో దేశ సౌభాగ్యానికి పశుపోషణ ఎంత అమూల్యమైనదో, సరియైన పశువులను ఉత్పత్తి చేయడంలో ఏయే జాగ్రత్తలు తీసుకోవాలో, ఎటువంటి ఆహారం ఇవ్వాలో చూపబడింది.

భారతదేశపు ముస్లిములను గూర్చి మరొక చిత్రంలో నాలుగున్నరకోట్లదాకా ఉన్న భారతీయ ముస్లిములు మన సంస్కృతి, సంపద, నాగరికత మొదలైనవాటిలో ఎంత ముఖ్యపాత్ర వహిస్తున్నారో చూపబడింది. తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రంలోని ప్రజాజీవిత విశేషాలను తెలిపే మరొక చిత్రం, నూరేళ్ళక్రిందట ప్రారంభమైన భారతదేశపు తంతి, తపాలాశాఖ ఎలా పని చేస్తున్నదో చూపే మరొక చిత్రం కూడా ప్రదర్శింపబడినవి.

## డేనిష్ చిత్రానికి వెనిస్ బహుమానం

వెనిస్ చలన చిత్రోత్సవంలో ప్రసిద్ధ దర్శకుడు కార్ల్ డ్రేయర్ నిర్మించిన డేనిష్ చిత్రం "ఓర్డెట్" ప్రథమ బహుమతి (స్వర్ణ సింహం) సంపాదించింది. తరవాత బహుమతుల్లో మొదటి బహుమతి (రజత సింహం) సోవియెట్ చిత్రం "లా సికాడా" సంపాదించింది. రెండవ బహుమతి "బిగ్ నైఫ్" అనే అమెరికన్ చిత్రానికి లభించింది. మూడవ బహుమతి "గర్ల్ ఫ్రెండ్స్" అనే ఇటాలియన్ చిత్రానికి, నాలుగవ బహుమతి ఒక డచ్ చిత్రానికి లభించాయి. మగ తారల్లో ఉత్తమ నటనకు కెన్నెత్ మూర్ అనే బ్రిటిష్ నటునికి, కర్ట్ జరెన్స్ అనే జర్మనీ నటునికి కలిపి బహుమతి ఇవ్వబడింది.

వెనిస్‌లో ఈ నెల జరిగిన ప్రపంచ చలన చిత్రోత్సవంలో వి. శాంతారాం నిర్మించిన నృత్య, సంగీత వర్ణచిత్రం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" కూడా ప్రదర్శింపబడింది.

* * *

"సి. ఐ. డి." అనే హిందీ చిత్రంలో దేవ్ ఆనంద్‌తో కలిసి నటిస్తున్న తెలుగుతార వహీదా రహమాన్, దర్శక నిర్మాత గురుదత్‌తో కలిసి ఆయన నిర్మించే మరొక చిత్రంలో కూడా నటించనున్నదని తెలుస్తోంది.

* * *

దేవదాసు కథను హిందీలో పునర్నిర్మిస్తున్న బిమల్ రాయ్ బెంగాలీలో కే. శే.

శరచ్చంద్ర ఛటర్జీ జీవిత కథను చిత్రం తీస్తారట.

* * *

భారత - చైనా సౌహార్ద సంఘంవారు ఈ నెల ఆఖరులో చైనీస్ చలనచిత్రోత్సవం జరుపుతున్నారు. ఈ ఉత్సవం న్యూఢిల్లీలో ప్రారంభమవుతుంది.

## టాకీ రజతోత్సవం

భారతీయ టాకీ చిత్రపరిశ్రమకు ఇది రజతోత్సవ సంవత్సరం. పాతికేళ్ళక్రిందట ప్రారంభమైన టాకీచిత్ర నిర్మాణం అనేకమైన ఒడుదుడుకులు గడిచి ప్రభుత్వ సహాయం చెప్పుకోదగినంతగా లేకుండానే అభివృద్ధిచెంది ఈనాడు ప్రపంచంలోనే అగ్రశ్రేణిలో ఉన్నది. ఏటా 250 చిత్రాలకు తక్కువకాకుండా మనదేశంలో తయారవుతున్నాయి. ముడిఫిలిందగ్గిర్నించి ప్రతిదీ విదేశాలనుండి దిగుమతి చేసుకుంటూ, ప్రదర్శించడానికి తగినన్ని థియేటర్లు కూడా లేకుండా మన పరిశ్రమ ఇంత పురోగమించిందంటే ఆశ్చర్యమే.

టాకీచిత్రాల రజతోత్సవాన్ని జరపడానికి భారత ఫిలింఫెడరేషన్ ఇదివరలో నిశ్చయించింది. అయితే ఈ ఉత్సవం ఎక్కువగా బొంబాయికే పరిమితమై ఉండవచ్చునని తెలుస్తోంది. చిత్రపరిశ్రమకు బొంబాయి ప్రధాన కేంద్రమైనప్పటికీ, దేశంలో ఇంకా నిర్మాణకేంద్రాలు చాలా ఉన్నాయి. ఈ అన్నిచోట్లా కూడా రజతోత్సవాన్ని వైభవంగా జరిపించడానికి ఫిలిం ఫెడరేషన్ పథకం తయారుచేయాలి. ఫెడరేషన్ ఆధ్వర్యాన, స్థానికంగా ఉన్న ఆంధ్ర, మద్రాసు ఫిలిం సంఘాలు కూడా ప్రతి పెద్ద పట్టణంలోను ఏదో విధంగా ఉత్సవం జరపడానికి పూనుకోవాలి. ఈ సంవత్సరం సమాప్తం కావడానికి ఆట్టే వ్యవధి లేనందున మన ఫిలిం పారిశ్రామికులు త్వరగా సన్నాహాలుచేయడం అవసరం. ★

## ప్రేక్షకుల అభిప్రాయాలు

## ★ "వదిన" ★

'వదిన' చిత్రం మనోరంజకంగా, ఎ. వి. ఎమ్. వారి చిత్రాల స్థాయికి తగినదిగానే వుంది. నటీనటుల్లో వదిన శాంతిగా కన్నాంబ, మరది రఘుగా నాగేశ్వరరావు, లలితగా సావిత్రిగార్ల నటన అత్యున్నతస్థాయిలో వుంది. రఘుగా నాగేశ్వరరావుగారి నటన చిత్రము మొదటినుండి చివరవరకు నూతనపంథాలో రసవత్తరంగా నడిచి చిత్రానికెంతో వన్నె తెచ్చింది. నరసయ్యగా బి. ఆర్. పంతులు నటన పేలవంగా వుంది. రేలంగి నటన అనుకున్నంత బాగా రాణించలేదు. పండరీబాయి సంభాషణలు ఒకరకంగా ఉన్నప్పటికీ నటన సంతృప్తికరంగా వుంది. గుమ్మడి మొదలగు యితర నటీనటులు చక్కగా నటించారు. సెంట్ దృశ్యాలు చిత్రానికి మరింత శోభను చేకూర్చాయి. స్వర్గీయ తోలేటిగారి పాటలు, మాటలు అద్భుతంగా వున్నవి. సుదర్శనంగారి సంగీతం ఫరవాలేదు. పాటలన్నీ మధురంగా వున్నాయి. అన్నిటికంటే "ఎంచి చూడరా - యోచించి చూడరా" అని ఘంటసాల పాడిన పాట, అప్పుడు నాగేశ్వరరావుగారు ప్రదర్శించిన నటన మరపురాకుండా వున్నవి.

దొప్పలపూడి వేంకటసుబ్బారావు.

—తిమ్మాపురం.

* * *

'సంఘం' చిత్రంకన్నా బాగానేవుంది. చిత్రానికంతకు నాగేశ్వరరావునటనప్రాణం. నాగేశ్వరరావు రౌడీగా అద్భుతంగా నటించాడు. చిత్రంలో పాటలేమంత బాగుండలేదు. రూపమాల నాట్యం బాగుంది. సావిత్రి, కన్నాంబ, రేలంగి బాగానే

(56-వ పేజీ చూడండి)

జ్ఞాన్ ప్రొడక్షన్స్‌వారి "షతరంజ్" హిందీచిత్రంలో మీనాకుమారి, అశోక్‌కుమార్, యాకూబ్.



# నవ్వితేనే వుంది లోకం

(4 వ పేజీ తరువాయి)

చాటుమాటుగా తెస్తే
చక్కగా గమనించారు.
పై అధికార్లకుగాని తెలిస్తే
బాబోయ్ ఇంకేమయినా వుందా?
ఏదో నా శక్తికి తగినట్లు
ఇస్తున్నా ఇవిగో నోట్లు
పైకిగాని పొరపాటున అన్నారా?
ప్రమాదమొస్తుందని విన్నారా?

ప్రేమికుడు:
అల్లాగే మరి, వెళ్లొస్తాను.

కథకుడు:
అనుకోకుండా ధనలాభాలకు
ఆనందిస్తూ భగ్నప్రేమికుడు
వివాహార్థమై మామగారికై
వెతికి విఫలుడై క్లబ్ చేరాడు
కాబోయే మామగారు
క్లబ్‌లోనే వున్నాడు!
పేకాటకి మెంబర్లని
పోగుచేస్తున్నాడు!
అడ్డాటలో కొత్తాటలు
అతడే కనిపెట్టాడు!
అందరినీ కవ్వించి
ఆడింపచేస్తున్నాడు!
ప్రజలందరి సొమ్ము తనే
పోగుచేస్తున్నాడు!

పేకాటగాళ్ళ కోలాహలం:
ఆటంటాను. అడ్డంటాను
అడ్డంటే పరతంటాను
పరతా? పేపరతన్నాను
కౌనుకో అయితే పుకేలన్నాను!!

కథకుడు:
ఏది ఆగినా కాలం ఆగదు
గడియారం ముల్లు నిలబడదు
పదకొండూ పది నిముషాలు
పంతులుగారికి నవ్వు మొదలు!

ప్రేమికుడు:
ఒస్తున్నది ఉప్పెనగా నవ్వు
అహ్హహ్హహ్హ హ్హహ్హహ్హా!!

కథకుడు:
కాబోయే మామగారు
కంగారయ్యాడు
ఇల్లు వదలి అల్లునికై
పరుగెత్తాడు
కాబోయే అల్లుడితో
కబుర్లాడాడు.

కాబోయే మామగారు:
అల్లుడూ వొక మాట, అర్జంటు మాట!
పగలబడి నవ్వావు పకపకా నీవు
బండారమంతాను బయటపడిపోయె
పయికిమాత్రం చెప్పి పరువు తీయకుమా!
ముక్కలను చూశాను ముందుగా నేను
చూసియే పంచాను, కొశాను పందెం
ఉద్దండ పిడుగువోయ్, ఉత్తముడ వేను!
పేకాటలో ట్రిక్కు పసికట్టినావు!
కాన్సెప్పు ఘుప్‌చుపో! కామ్‌గా వుండు!
గేములో సొమ్మంత గెలిచి వస్తాను,
మంచివాడవు నువ్వు, మా పిల్ల నిచ్చి
పెళ్ళి చేస్తానోయి, పెళ్ళిచేస్తాను!!

ప్రేమికుడు లేక పెళ్లికొడుకు:
ఈ ముక్క కోసమే ఇటు వచ్చినాను
మామగారూ ఎంత మంచివారండీ!!!

కథకుడు:
పెళ్ళి వైభవంగా జరిగింది!
మన కథ కంచికి వెళ్ళింది!!

పాఠకులు: (కోలాహలంగా)
ఈ పాటలనాటిక నీ కేమిటి?
మేం చదివినందుకు ఫలశ్రుతి ఏమిటి?

కథకుడు:
ప్రపంచమంతా గెలవాలంటే
పకపకమంటూ నవ్వాలండీ!
నిరాశ, నిస్పృహా, గెలవాలంటే
నిశ్శంకంగా నవ్వండీ!!
కోరిన కోరిక తీరాలంటే
దరహాసాలను కురిపించండీ!
సంతోషం సగం బలం
తినాటిక సమాప్తం.

ఇది († P. G. Wodehouse చదివిన తరువాత స్వతంత్రంగా ఊహించిన రచన)

★



బి. ఆర్. ప్రొడక్షన్స్‌వారి "నకద్ నారాయణ్" హిందీచిత్రంలో సునీల్ దత్, డెయిజీ.



కాలికి వేసిన బంఢకొయ్య చాలక, రాముడి చెవికి 'కీ' యిస్తున్నాడు బడిపంతులు.
అన్నపూర్ణావారి "గొంగరాముడు"లో మాస్టర్ వర్మ,
పి. హేమలత, వంగర.

## ప్రేక్షకుల అభిప్రాయాలు

నటించారు. పంఢరీబాయి నటన ఏమంత బాగులేదు.

ముదిగంటి జగదీశ్,
—రాజమండ్రి.

*  *  *

ఎ. వి. యం. వారి "వదిన" చిత్రం చాలా బాగుంది. నాగేశ్వరరావు నటన చిత్రమునకంతకూ బాగుంది. కన్నాంబ, పంఢరీబాయి, రేలంగి, సావిత్రిల నటన బాగానేవుంది. తోలేటి మాటలు, పాటలు చిత్రానికి వన్నెనిచ్చేయి. సుదర్శన్‌గారి మ్యూజిక్ అద్భుతముగావుంది.

కొమ్మూరి సోమశేఖరరావు,
—పేరుకలపూడి.

*  *  *

ఎ. వి. ఎం. వారి 'వదిన' చిత్రం చూశాను. అనుకున్నంత బాగా లేదు. కథలో పటుత్వం లేకపోయినా కొన్ని ప్రత్యేక ఆకర్షణలవలన చిత్రం పొడిగించారు. నాగేశ్వరరావు, కన్నాంబ, సావిత్రి, సుమ్మర్షి బాగా నటించారు. రేలంగి హాస్యం ఏమంత బాగాలేదు. పేకముక్కల డాన్సు బాగుంది. సి. ఐ. డి. గా వేసిన సీతారామ్ నటన బాగులేదు. ఘంటసాల, ఎ. ఎమ్. రాజా పాడిన రెండుపాటలు బాగున్నాయి.

సుంకరపల్లి కస్తూరిరావు,
—బొబ్బిలి.

*  *  *

ఎ. వి. యం. వారి 'వదిన' ఆశించినంత బాగాలేదు. సినిమాకంతటికి రెండేరెండు పాటలు బాగున్నవి. సావిత్రి చేసిన డాన్సులు చాలా బాగాయున్నవి. నాగేశ్వరరావు, రేలంగి, బి. ఆర్. పంతులు, కన్నాంబ, పంఢరీబాయి చక్కగా నటించినారు. ఈ చిత్రంలో కొన్ని లోపాలున్నాయి. మొత్తంమీద ఈ చిత్రం ఏమంత చెప్పుకోతగ్గట్టులేదు.

యస్. నరసింహం,
—గుంతచీపాడు.

*  *  *

వదిన కథాగమనం చక్కగా ఉంది. నాగేశ్వరరావు, రేలంగి, సుమ్మర్షి, సావిత్రి, కన్నాంబ అమోఘంగా నటించారు. పాటలు మాటలు బాగానే యున్నవి. అన్నిటికంటే, "ఓటింగు రంగారూ" అను పాట, మనోహరంగా ఉన్నది.

అబ్దుల్ సత్తార్,
—తాడేపల్లి గూడెం.

*  *  *

ఎంతో బాగుంటుంది అని అనుకొన్న ఎ. వి. యమ్. వారి "వదిన" నిరుత్సాహపరిచింది. దినికి ముఖ్యకారణం కథ బాగా లేదు. చిత్రం మొదట కొంతవరకు క్రొత్త పోకడలో నడచింది. సెట్టింగ్సు, కొన్ని దృశ్యాలు చక్కగా నిర్మించారు. అనవసరముగా కొన్ని పాత్రలు సృష్టించారు. పాటలు, మాటలు అంతగా బాగులేవు.

ఎన్. సీతారామరాజు,
—కాకినాడ.

*  *  *

ఈ చిత్రములో కథ బాగాలేదు. పాటలు బాగానే ఉన్నవి. నటనలో ఎ. నాగేశ్వరరావు, బి. ఆర్. పంతులు, సుమ్మర్షి నటన అద్భుతముగా ఉన్నది. రేలంగివారి నటన అంత బాగాలేదు. శ్రీమతి కన్నాంబ, పంఢరీబాయి నటన ఫరవాలేదు. లోపాలు చాలా కలవు.

పొక్కునూరి మల్లికార్జునరావు,
—విజయవాడ.

*  *  *

ఈ చిత్రం చూస్తున్నంతసేపూ ఆహ్లాదకరంగాయుండి ప్రేక్షకులకు, వినోదం, విషాదం, హాస్యం, అన్ని కల్గినవి. ఇందులో ఎన్నడూ చూపని ప్రతిభను శ్రీ నాగేశ్వరరావు చూపించారు. డాన్సులు, పాటలు యీ చిత్రానికి ఒక ప్రత్యేకత. ఈచిత్రము తప్పక విజయవంతమగును.

కొప్పల గంగాధరరావు,
—పోణంగి.



Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.



విఘ్నేశ్వరుడు

కత్తిరింపులచిత్రం: వెల్లటూరి పూర్ణానందశర్మ—క్రోసూరు.

"సౌందర్యమునిచ్చు ఈ సబ్బు ప్రత్యేకమైనది."

క్రొత్తది! సువాసనగలది!

బ్రీజ్







"ఇది ఎక్టమర్ను కలిగియున్నది"

* చర్మంమీది క్రిములను నిర్మూలించును

మీ చర్మమును ఆరోగ్యముగానుంచును!

* ఒడలికంపును తొలగించును

మిమ్ములను శుభ్రముగానుంచును!

ఎక్టమర్ (బైథయోనాల్) మాన్‌సేంటో వారి అద్భుతమైన క్రొత్త కెమికల్, అనగా నెమ్మదైన చల్లని గుణముతోగూడిన శ్రేష్ఠమైన క్రిమి విధ్వంసక శక్తిని కలిగియున్న ఒక రసాయన పదార్థము. అది చర్మ-మచ్చలను మరియు అంటువ్యాధులను నిర్మూలించును—మీ చర్మ ఛాయను సుందరముగాను, ఆరోగ్యవంతముగాను మరియు శుభ్రముగాను ఉంచును.

8 అణాలు మాత్రమే

స్థానిక పన్నులు అదనము

బ్రీజ్-ఎక్టమర్‌తో కూడిన సౌందర్యమునిచ్చు సబ్బు

ఇరాస్మిక్ కంపెని, లిమిటెడ్; లండన్ వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది